భారతీయ సాహిత్య నిర్మాతలు :

# కల్హణుడు

మూలం :

సోమ్‌నాథ్ ధర్

అనువాదం :

కోవెల సంపత్కుమారాచార్య



సాహిత్య అకాడెమి

*Kalhanudu*—Telugu translation by Kovela Sampath Kumaracharya of Somnath Dhar's monograph 'Kalhana' in English. Sahitya Akadami, New Delhi—(1983
SAHITYA AKADEMI
REVISED PRICE Rs 10 00



First Published: 1983

సాహిత్య అకాదెమీ
ప్రధాన కార్యాలయం:
రవీంద్ర భవన్, న్యూ ఢిల్లీ - 110 001.

ప్రాంతీయ కార్యాలయాలు:
29, ఎల్డామ్స్ రోడ్డు, తేనాంపేట, మద్రాసు-600 018.
బ్లాక్ V-బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా-700 029.
172, ముంబయీ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, బొంబాయి-400 014.

SAHITYA AKADEMI
REVISED PRICE Rs 10 00

*Printed at :*
Weldun Press, 68, Mannappa Mudali Street, Madras - 600 021.

# విషయసూచిక

# అవతారిక

ప్రామాణికమైన సమాచారాన్ని తెలిపే గ్రంథాలు లేకపోవటంవల్ల అతి ప్రాచీనమైన భారతదేశ చరిత్ర మరుగున పడిపోయింది. రాజులనూ, పురాణ పురుషులనూ, వారి విజయాలనూ, వైభవాలనూ వర్ణించటమే 'చరిత్ర' అనే భావం ప్రాచీన భారతదేశంలో వ్యాపించి ఉన్నట్లుగా కన్పిస్తుంది. ఉదాహరణకు పురాణాలనే తీసుకుందాము. ఆర్యులు రావటానికి పూర్వం భారతదేశాన్ని పరిపాలించిన రాజులనూ, వారి వంశ క్రమాలనూ పేర్కొంటూ, ఆయా రాజుల విజయాలను పురాణాలు విస్తారంగా వర్ణించినవి. అయితే, గమనించవలసిన అంశమేమిటంటే, శాస్త్రీయ పద్ధతిలో 'చరిత్ర' రచనకు ఉపయోగకరంగా ఈ రాజులకు సంబంధించిన వాస్తవాలు కొన్ని కొన్ని ఈ పురాణాలలోనే లభిస్తున్నవి. ఏ దేమైనా, మొత్తంమీద, సంస్కృత వాఙ్మయ కాలంలో విమర్శనాత్మక దృక్పథంగల చరిత్రకారుడుగా చెప్పదగిన రచయిత కన్పించడు.

క్రీస్తుశకం ఆరవ శతాబ్దం తరువాతగాని భారతదేశంలోని ప్రసిద్ధులైన రాజులను గూర్చిన చరిత్రగ్రంథాలు లభించటం లేదు. బాణుని హర్ష చరిత, కల్హణుని రాజతరంగిణి; ఇంకా, ఆయీన్ - ఏ - అక్బరీ, అక్బర్ నామా మొదలైనవి ఆ విధమైన చరిత్రగ్రంథాలు. ఈయా గ్రంథాలు రచింపబడిన ఆయా కాలాలలో వెలసిన సాహిత్య గ్రంథాలూ, శాసనాలూ, నాణాలూ మొదలైనవాటివల్ల లభించే చారిత్రక సామగ్రితో ఈ చరిత్ర గ్రంథాల్లోని వివిధాంశాలను పోల్చి చూసుకొని వాస్తవాలకు సంబంధించిన నిర్ణయాలు చేయవచ్చు. కాగా, గడిచిన వేలకొలది సంవత్సరాలలో వ్యాపించి ఉండిన చరిత్రను గ్రంథస్థం చేసుకున్న గౌరవం భారతదేశం మొత్తంలో కాశ్మీరుకు మాత్రమే కలిగింది. దానికి ఆ గౌరవం సంపాదించిన కల్హణుడు అన్ని విధాలుగా అభినందనీయుడు.

కల్హణ పండితుడు రచించిన 'రాజ తరంగిణి' కాశ్మీరు యొక్క అతిప్రాచీన చరిత్ర. క్రీ. శ. 1148-50 లలో రచింపబడిన ఈ అసాధారణ చారిత్రక కావ్యంలో భారతదేశానికి, ప్రత్యేకించి, కాశ్మీరుకు సంబంధించి

రాజకీయంగా, సామాజికంగా ఇంకా ఇతర విధాలుగానూ లభించే సమాచారం చాలా విలువైనది. ఇప్పటివరకు లభ్యమవుతున్న సంస్కృత సాహిత్య గ్రంథాలలోకల్లా అనేక చారిత్రక వాస్తవాలను తెలుపుతున్న కారణంగా కల్హణుని ఈ చారిత్రక కావ్యం అత్యంత విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నది. అనేకమంది ప్రాచీన భారతీయకవులు, తత్త్వవేత్తల కాలాన్ని నిర్ణయించటంలో ఈ గ్రంథం ఎంతగానో ఉపయోగపడుతున్నది. కాగా, ప్రాచీన భారతీయ చరిత్ర పునర్నిర్మాణానికి అడుగడుగునా రాజతరంగిణివల్ల లభించే సహకారం ఎంతో విలువైంది.

అనంతరకాలాన సంస్కృతంలో రచింపబడిన చారిత్రక గ్రంథాల్లోని విషయాలు చాలావరకు అసమగ్రంగా ఉన్నవి. వాటిని సరియైన పద్ధతిలో వ్యాఖ్యానించి, వివరించగల అవకాశం రాజతరంగిణి వల్ల లభించే ప్రామాణిక సమాచారం ఆధారంగా ఈనాడు మనకు లభిస్తున్నది. ఈ విధంగా, కాశ్మీరు ప్రాచీన చరిత్ర-సంస్కృతి మరుగున పడిపోకుండా రక్షించటమే కాక, తరువాతికాలపు చరిత్ర గ్రంథాల్లో చెదురు మదురుగా లభించే అంశాలను సమన్వయించుకోవటంలోనూ చారిత్రకులకు కల్హణుడు ఎంతగానో సహాయ పడినాడు. ఒక్కమాటతో చెప్పితే కల్హణుడి కారణంగా ఈనాడు కాశ్మీరు చరిత్రకారుడు భారతదేశంలోని ఇతర ప్రాంతాల చారిత్రకు లందరి కన్నా గూడా అధికంగా, సంతృప్తికరంగా గతంతో పరిచయం సంపాదించ గల స్థితిలో ఉన్నాడు.

రంజత్ సీతారామ పండితుడు (ఆర్. ఎస్. పండిత్) రాజతరంగిణిని ఆంగ్లంలో వచనరూపంగా అనువదించినాడు. ఆ అనువాదానికి సుదీర్ఘంగా 'ముందు మాటలు' వ్రాసినవారు జవహర్‌లాల్ నెహ్రూ. రాజతరంగిణిలోని కథ, అందులో వర్ణింపబడిన ఆచార వ్యవహారాలూ; కల్హణుడు సాధికారంగా తననాడూ, తనకు పూర్వమూ నెలకొని ఉన్న సాంఘిక, రాజకీయ జీవితాన్ని చిత్రించిన తీరు తెన్నులనూ విపులంగా సమీక్షిస్తూ నెహ్రూ ఈ విధంగా అన్నారు:

> రాజతరంగిణి ఒక చరిత్ర. ఒక కావ్యం కూడ. నిజానికి ఈ రెండూ కలిసి ఉండగలగటం ఇబ్బందే. ఈ అనువాదంలో ఆ కల యిక ఇరుకున పడిందని గమనించ వచ్చు. ఎందుకంటే, కవిత్వం

లోని సంగీతాన్నిగానీ, కల్హణుని ఉదాత్త మధుర భాషాసౌందర్యాన్ని గానీ అనుభవించే అవకాశం ఇందులో మనకు లభించదు .. ఇది మధ్య యుగాల నాటి చరిత్ర. దీనిని చదువుతూ ఉన్నప్పుడు తరుచుగా మనస్సు బాధ పడుతుంటుంది. రాజగృహాల్లోని కుట్రలూ, రాజ ద్రోహాలూ, తిరుగుబాట్లూ, అంతర్యుద్ధాలూ, పీడనలూ ఇందులో విప రీతంగా కన్పిస్తున్నవి. ఇది నిరంకుశత్వాన్నీ, యుద్ధోన్మత్తుల రాజ్యాధికార దాహాన్నీ చిత్రించే కథ ... ఇది రాజుల, రాజవంశాల, కులీనుల కథే తప్ప సామాన్య ప్రజలది కాదు. అయినాగూడా, రాజుల కార్యకలాపాలను వర్ణించే అనేక గ్రంథాలకన్నా ఇది కొంత భిన్న మైనది. సామాజిక, రాజకీయ వ్యవస్థలకూ, కొంతవరకు ఆర్థిక వ్యవస్థకు కూడా సంబంధించిన వివిధ సమాచారాలకు ఈ గ్రంథం ఒక నిధి. మధ్యయుగాలలోని భూస్వామ్య వీరుల యుద్ధవేషాలూ, వారి ఆడంబరాలూ ఇందులో వర్ణించబడినవి. అంతేకాదు, కుట్రలూ, కుతంత్రాలూ, కొట్లాటలూ, కాట్లాటలూ చిత్రింపబడినవి. ఇందులో రాణుల కీచులాటలూ, విచిత్ర కామప్రవృత్తులూ, వ్యభిచారాలూ ఉన్నవి. కేవలం అంతఃపురాలలోనే కాకుండా రాజ సభలలోనూ, రణరంగాల్లోనూ స్త్రీలు, ప్రముఖపాత్ర నిర్వహించినట్టు కన్పిస్తుంది. కొన్ని కొన్ని సందర్భాలలో మానవుల సహజ సంబంధాలూ; ప్రేమ, ద్వేషం, విశ్వాసం, అసహ్యం, ఉత్సాహం, ఉద్రేకం మొదలైన మానవ మౌలికానుభూతులూ ఈ కథల్లో మెరుపుల్లా దర్శనమిస్తవి. సుయ్యుడనే రాజు నిర్వహించిన గొప్ప యాంత్రిక నిర్మాణాలనూ, వ్యవసాయం కోసం ఆయన విరివిగా సమకూర్చిన నీటి వనరులను గూర్చి మనకు తెలుస్తుంది. లలితాదిత్యుడు సుదూర ప్రాంతాలకు కూడా వెళ్ళి సాగించిన యుద్ధాలనూ, సాధించిన విజయాలనూ; అంతే కాదు, యుద్ధవిజయాల ద్వారా అహింసను వ్యాపింప జేయాలనే మేఘ వాహనుని వింత ప్రయత్నాలనూ గూర్చి మనం చదువుతాము. ఆలయ నిర్మాణాలూ, సన్యాసుల కోసం ఆశ్రమ నిర్మాణాలూ; వీటిపై విశ్వాసం లేనివారూ; విగ్రహ విధ్వంసకులూ; ఆలయాదులను ధ్వంసం చేసి వాటి ఆస్తులను, నిధులను రాజ్యకోశాగారానికి కలుపుకోవటాలూ —ఇట్లాంటి రకరకాల విచిత్రాంశాలు ఈ గ్రంథం ద్వారా మనకు

తెలుస్తున్నవి. ఇంకా, ప్రజలను విపరీతంగా నాశం చేయటమే కాకుండా బతికి బయటపడ్డ వాళ్ళను అత్యంత దయనీయ స్థితికి దిగజార్చిన కరువులూ, కాటకాలూ, వరదలూ, అగ్నిప్రమాదాలూ, దోపిడీలూ ఈ గ్రంథంలో మనకు కళ్లకు గట్టినట్లు కన్పిస్తున్నవి.

ప్రాచీన ఆర్థిక వ్యవస్థ చితికిపోతున్న కాలమది. భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో మాదిరిగానే, కాశ్మీరులోనూ పూర్వపు విధానాలు మారిపోతున్నవి. ఆసియా, పశ్చిమ గ్రీకు-రోమన్, ఈరాన్, తూర్పు మంగోలియా మొదలైన భిన్న భిన్న సంస్కృతులకు కాశ్మీరు కూడలిగా మారిపోయింది. అయితే, ప్రాచీన ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నం కావటంతో పూర్వపు హిందూ-ఆర్య రాజ్యవ్యవస్థ యొక్క పునాదులు కూడా బీటలు వారిపోయినవి. అంతర్గత సంక్షోభాలలో, విదేశీయుల ఆక్రమణలలో కాశ్మీరు చిక్కుకున్నది. ప్రాచీన హిందూ ఆదర్శాలు రేఖలు రేఖలుగా ఇంకా కన్పిస్తూనే ఉన్నా గూడా, మారుతున్న పరిస్థితులలో అవి ఎందుకూ కొరగాకుండా పోయినవి. యుద్ధవీరుల విజయయాత్రలలో ప్రజావిధ్వంసం విపరీతంగా జరిగింది. తరుచుగా రాజులు మారిపోతూ ఉండటం, కొత్త కొత్త రాజులు వస్తూ ఉండటం ఎక్కువైంది. తిరుగుబాటుల విజృంభణలతో నిండిన దేశంగా కాశ్మీరును కల్హణుడు వర్ణించినాడు. ఈ తిరుగుబాట్లను సాహసికులూ, సేనాపతులూ తమ రకరకాల స్వార్థాలకు బాగా ఉపయోగించుకున్నారు.

రంజిత్ సీతారామ పండితుడు అనువాదం చేసే నాటికే రాజతరంగిణి రచింపబడి చాలా శతాబ్దాలు గడిచినవి. ఈ సుదీర్ఘ కాల వ్యవధానంలో రాజతరంగిణి కావ్యవస్తువు వ్రాతప్రతుల సంప్రదాయ మార్గాన పొందిన క్రమవ్యాప్తి అసక్తిని రేకెత్తించే విధంగా ఉన్నది. రాజతరంగిణి రచన అరంభించి, పూర్తిచేసిన తిథులనూ సంవత్సరాలనూ కల్హణుడు అసందిగ్ధంగా పేర్కొన్నాడు. ఆ కారణంగా, ఆ రచనలోని వివిధాంశాలు చెదరిపోకుండా ఉండగలిగినవి. అయినా కూడా, మూలరచనకూ, ఛందస్సుకూ సంబంధించిన లోపాలు, ప్రధానంగా గ్రంథపు చివరి భాగాల్లో, కన్పిస్తూనేఉన్నవి. వీటినిబట్టి, బహుశః కల్హణుడు ఈ చివరి భాగాలను పునఃపరిశీలన చేసి ఉండక పోవచ్చుననిపిస్తుంది. ముఖ్యంగా గ్రంథంలోని చివరి ఆరువందల

పద్యాల్లో అర్థంలేని భాగాలూ, గ్రంథపాతాలూ ఈ లోపాలను మరింతగా స్పష్టపరుస్తున్నవి.

ఈ లోపాల మాట ఎట్లా ఉన్నా, అతిప్రాచీనమూ సమగ్రమూ అయిన ఈ కాశ్మీరు చరిత్ర గ్రంథం అనంతర కాలాన చరిత్రకారులలో విపరీతంగా ఆసక్తిని రెచ్చగొట్టింది. రాజతరంగిణిలోని ఒక భాగం కాశ్మీరు ప్రభువైన జైన్-ఉల్-అబిదిన్ (క్రీ. శ. 1421-1472) ఆజ్ఞ ప్రకారం మొదటి సారిగా పర్షియను భాషలోకి అనువాదం చేయబడింది. ఈ అనువాదం పేరు బహల్-ఉర్-అస్మార్ (కథా సముద్రం). ఆ తరువాత కాశ్మీరును తన సామ్రాజ్యంలో కలుపుకున్న అక్బరు చక్రవర్తి క్రీ. శ. 1594 లో ఈ అనువాదాన్ని అబ్దుల్ ఖాదిర్ అల్-బదౌనీ ద్వారా పూర్తి చేయించినాడు. అబుల్ ఫజల్ తన అయిాన్-ఏ-అక్బరీ అనే గ్రంథంలో కాశ్మీరు ప్రాచీన చరిత్ర సారాన్ని చేర్చి, ఈ భాగానికి కల్హణుని రాజతరంగిణియే ఆధారమన్నాడు. జహంగీర్ చక్రవర్తి రాజ్యకాలాన-క్రీ. శ. 1617 లో మలిక్ హైదర్ పర్షియను భాషలో రాజతరంగిణికి ఒక సంక్షిప్తరూపాన్ని సంతరించినాడు. డాక్టర్ ఫ్రాన్సిస్ (క్రీ. శ. 1665) తన పారడైజ్ ఆఫ్ ఇండీజ్ గ్రంథంలో మలిక్ హైదర్ ప్రతిని ప్రస్తావించినాడు. మలిక్ హైదర్ పద్ధతిలోనే ఫాదర్ టీఫెన్ థాలర్ అనే ఆయన రాజతరంగిణి సంక్షిప్తసారాన్ని సిద్ధం చేసినాడు.

యూరోపులో సంస్కృత పరిశోధనకు, అధ్యయనానికి నాంది పలికిన మనీషి సర్ విలియం జోన్స్. పందొమ్మిదవ శతాబ్దారంభంలో ఆయన సంస్కృతభాషా గ్రంథాలు ఆధారంగా భారతదేశ చరిత్రను రచించాలనుకుంటున్నట్టు 'ఏషియాటిక్ రీసెర్చెస్'లో ప్రకటించినాడు. కాని, ఆయన తాననుకున్న చరిత్ర రచనకు అవసరమైన సమాచారాన్ని, సామగ్రిని సేకరించేదాకా గూడా జీవించలేదు. క్రీ. శ. 1805 లో కోల్‌బ్రూక్ రాజతరంగిణి యొక్క ఒక అసమగ్ర ప్రతిని సంపాదించినాడు. అయితే, ఆ ప్రతికి సంబంధించిన వివరాలు మాత్రం క్రీ. శ. 1825 లో కాని వెలుగులోకి రాలేదు.

రంజిత్‌సింగ్ మహారాజు అనుజ్ఞతో క్రీ. శ. 1823 లో శ్రీనగర్ చేరిన మూర్‌క్రాఫ్ట్ అనే ఆయన ఉన్నంతలో మంచిపాఠాలుగల రాజతరంగిణి ప్రతి నొకదాన్ని సంపాదించినాడు. ఆయన సంపాదించింది శారదా లిపిలో ఉన్న వ్రాత ప్రతి ఆధారంగా దేవనాగరి లిపిలో వ్రాయ

బడిన ప్రతి. ఈ ప్రతి ఆధారంగా క్రీ. శ. 1835 లో 'బెంగాలు ఏషియాటిక్ సొసైటీ' పక్షాన రాజతరంగిణి ప్రచురింపబడింది. స్టెయిన్ అనే పరిశోధకుడు పై వ్రాతప్రతిని, కాశ్మీరులో లభించే వ్రాత ప్రతులన్నింటికీ ప్రాగ్రూపం—మూలరూపమని అభివర్ణించినాడు. అయితే, ఇందులో వ్రాత దోషాలకు కొదువేమీ లేదు. కాశ్మీరు భౌగోళిక స్వరూపంతోనూ, అక్కడి ఆచార వ్యవహారాల సంప్రదాయాలతోనూ అంతగా పరిచయం లేని కలకత్తా పండితులు మూలపాఠాన్ని నిర్ణయించటంలో అనుచితమైన స్వాతంత్ర్యాన్ని అవలంబించటం కూడా ఈ దోషాలకు ఒక కారణం.

ఈ మధ్యలో-అంటే, ఒక దశాబ్దం ముందే డాక్టర్ హొరాస్ హైమన్ విల్సన్ ప్రచురించిన 'కాశ్మీర్ హిందూచరిత్ర' అనే వ్యాసం పరిశోధకులకు ఆశ్చర్యం కలిగించింది. రాజతరంగిణిలోని మొదటి ఆరు అధ్యాయాల్లోని విషయం ఆ వ్యాసంలో క్లుప్తంగా వ్రాయబడింది. యూరోపులోని చరిత్ర కారులకు రాజతరంగిణిలో పరిచయం మొదటిసారిగా కలిగింది ఈ వ్యాసం ద్వారానే. సంస్కృత పండితుడైన విల్సన్ అసమగ్రమైన మూడు దేవనాగరి వ్రాతప్రతుల ఆధారంతో స్వేచ్ఛానువాద పద్ధతిలో ఈ వ్యాసం రచించి నాడు.

సమగ్రమైన అనువాదం కోసం మొదటిసారిగా రాజతరంగిణి మూల సంస్కృత ప్రతి సమగ్రంగా తయారుచేయబడి, దాని అనువాదం ఫ్రెంచి భాషలో-సుప్రసిద్ధమైన ఏషియాటిక్ సొసైటీ పక్షాన క్రీ. శ. 1852 లో ప్యారిస్‌లో ప్రచురింపబడింది. అనువాదకుడు ఏ. ట్రాయర్ - ఫ్రాన్సు దేశీయుడు, కలకత్తాలోని సంస్కృత కళాశాలకు అధ్యక్షుడు. తన అను వాదం కోసం ట్రాయర్ తయారుచేసుకున్న మూలప్రతి క్రీ. శ. 1835 నాటి కలకత్తా ప్రతిమీద ఆధారపడింది. ఆయనకే కాదు, జోగీశచంద్రదత్తు చేసిన అనువాదానికి కూడా అదే ఆధారం. దత్తు తన అనువాదాన్ని— 'కాశ్మీరు రాజులు: కల్హణ పండితుని సంస్కృత కృతి రాజతరంగిణికి అనువాదం' అని వ్యవహరించినాడు. ఇది క్రీ. శ. 1879–'87 మధ్య కాలాన కలకత్తాలో వెలువడింది. కొన్ని అంశాల్లో ట్రాయర్ అనువాదం కన్నా మెరుగే అయినా, కలకత్తా ప్రతిలోని దోషాలు దత్తు అనువాదానికి సంక్రమించినవి. ప్రాచీన కాశ్మీరు భౌగోళిక స్వరూపంలో అనువాదకునికి పరిచయం లేకపోవటం : కాశ్మీరు సంప్రదాయాలనూ, అక్కడి వివిధ

వ్యవస్థలకు సంబంధించిన అంశాలనూ సమన్వయపరచడంలో అనువాదకుని అసమర్థత కూడా ఈ దోషాలకు తోడైంది.

అయితే, రాజతరంగిణిపై పండితుల ఆసక్తి ఇప్పటికీ రవ్వంతైనా తగ్గిపోలేదు. డోగ్రా పరిపాలన ఏర్పడిన తరువాత కాశ్మీరును సందర్శించిన జనరల్ (ఆనాడు కెప్టన్) ఏ. కన్నింగ్‌హామ్ రాజతరంగిణి విషయంలో సాగించిన కృషి అవిస్మరణీయం. ఆ గ్రంథంలో కాలక్రమాన్ని పాటించిన విధానాన్ని గూర్చి, నాణాల సాక్ష్యాలను గూర్చి, అనేకాంశాలను ఆయన స్పష్టీకరించినాడు. కల్హణుడు చిత్రించిన సంఘటనల, నాటి రాజుల కాలాలను కచ్చితంగా నిర్ణయించినాడు. అంతేకాకుండా, ప్రధాన సంఘటనలకు సంబంధించిన అనేక సాక్ష్యాధారాలను గూడా ప్రదర్శించినాడు. ఇప్పటి కింకా నిలిచిఉన్న హైందవ యుగ శిల్పాలను, కట్టడాలను గూర్చి గాఢంగా అధ్యయనం చేసినాడు. ప్రాచీన కాశ్మీరు భౌగోళిక స్వరూపాన్ని నిర్ధారించే ప్రధాన స్థలాలను నిర్ణయించటంలో ఆ అధ్యయనం ఈ పండిత యోధునికి ఎంతగానో ఉపయోగించింది.

పాశ్చాత్యుల దృష్టిని కల్హణుని ఈ చరిత్ర గ్రంథం ఇంకా ఆకర్షిస్తూనే ఉన్నది. ప్రొఫెసర్ లాసిన్ జర్మన్ భాషలో రచించిన ప్రసిద్ధ 'విజ్ఞాన సర్వస్వం'లో రాజతరంగిణిలోని చారిత్రకాంశాల విశ్లేషణ విపులంగా చేయబడింది. లాసిన్ పాండిత్యం గొప్పదే, సందేహం లేదు. కాని, డాక్టర్ విల్సన్, జనరల్ కన్నింగ్‌హామ్ చెప్పిన అంశాలను మించి ఏ విశేషమూ ఆయన సమీక్షలో కన్పించదు.

క్రీ. శ. 1875 లో ఆనాటి బొంబాయి విద్యాశాఖకు చెందిన పండితుడు ప్రొఫెసర్ బుహ్లెర్ కాశ్మీరును సందర్శించి ఒక సుదీర్ఘమైన నివేదికను సిద్ధం చేసినాడు. కాశ్మీరు భౌగోళిక స్వరూపాన్ని నిర్ణయించటానికి అందులో ఒక చక్కని పద్ధతి సూచింపబడింది. కల్హణుని గ్రంథాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోవటంలో ఈ పద్ధతి ఎంతగానో ఉపకరిస్తున్నది. పురాణచరిత్ర పరిశోధకుడైన ఈ పండితుని కాశ్మీరుయాత్ర సంస్కృత భాషాశాస్త్ర నిర్మాణంలోనూ సంస్మరణీయమైనది. కాగా, రాజతరంగిణికి సంబంధించినంతవరకు అనేకాంశాలు స్పష్టం కావటానికి, 'నీల మత పురాణం' వంటి అనంతరకాలీన చరిత్ర గ్రంథాలను గూడా

అధ్యయనం చేయవలసి ఉంటుందని ప్రొఫెసర్ బ్యూహ్లెర్ సూచించినాడు. పైగా, దేవనాగరి ప్రతులన్నింటికన్నా కాశ్మీర ప్రతులే నిర్దుష్టాలనే అంశాన్ని స్థిరపరచినాడు. బ్యూహ్లెర్ సూచనలూ, నిర్ణయాలూ రాజతరంగిణి మౌలిక ప్రతిని విమర్శాత్మకంగా పునర్నిర్మాణం చేయటానికి మార్గాన్ని సుగమం చేసినవి. కాశ్మీరు చరిత్రకోసమేగాక, తక్కిన భారతదేశ చరిత్ర రచన కోసం గూడా రాజతరంగిణిని ఉపయోగించుకోవటంలో మార్గదర్శక సూత్రాలను గూడా ప్రసిద్ధమైన బ్యూహ్లెర్ నివేదిక ప్రతిపాదించింది. ప్రొఫెసర్ బ్యూహ్లెర్ పరిశోధనలతో ఉత్తేజం పొందిన డాక్టర్ ఇ. హల్ట్‌సెక్ 'ఇండియన్ ఆంటిక్వెరీ' (సంపుటం-18, 19)లో కల్హణుని గ్రంథాన్ని గూర్చి ఉపయోగకరమైన విమర్శాత్మక వ్యాసాన్ని క్రి. శ. 1885 లో ప్రచురించినాడు. ఈవిధంగా రాజతరంగిణిలోని వివిధాంశాలను గూర్చి ప్రాచ్య-పాశ్చాత్య పండితులు పందొమ్మిదవ శతాబ్దం చివరిదాకా అధ్యయనం చేస్తూ, వివేచన సాగిస్తూనే ఉన్నారు.

ఈ మధ్యలోనే ఎం. ఏ. స్టెయిన్ అనే మరొక గొప్ప పండితుడు పురాచరిత్ర పరిశోధనే ధ్యేయంగా చాలా సారులు కాశ్మీరులో పర్యటనలు చేసినాడు. ఆ పర్యటనలలో ఆయనకు రాజతరంగిణియొక్క ప్రాచీన మూల ప్రతి ఒకటి లభించింది. ఇది రాజానక రత్న కాంత పండితుడు వ్రాసుకొన్న ప్రతి. ఈ పండితుడు బహుశః పదిహేడవ శతాబ్దం మూడవ పదికి చెందిన వాడు కావచ్చు. స్టెయిన్‌కు లభించే నాటికే ఆ ప్రతిలో ప్రధానమైన కొన్ని "వ్యాఖ్య"లు, కొన్ని దిద్దుబాట్లు వ్రాయబడి ఉన్నవి. ఈ ప్రాచీన సంస్కృత ప్రతిలోని పాఠాలను శ్రీనగర్ నివాసియైన గోవింద కౌల్ అనే పండితుని సహకారంతో స్టెయిన్ అధ్యయనం చేసినాడు. అంతేకాదు, సమున్నత పర్వత పంక్తులు కారణంగా మిగిలిన భారతదేశంతో వేరుపడ్డట్టుగా కన్పించే కాశ్మీరు లోయప్రాంతంలో ప్రత్యేక తరహాలో పెంపొందిన సంప్రదాయాలను, ఆచార-వ్యవహారాలను గూడా అధ్యయనం చేసినాడు. దీనివల్ల కల్హణుని రచనను సమగ్రంగా అవగాహన చేసుకోగల అవకాశం లభించిందాయనకు.

దాదాపుగా అదే సమయంలో కాశ్మీరుకు చెందిన దుర్గాప్రసాద పండితుడు తాను సిద్ధంచేసిన రాజతరంగిణి సంస్కృత మూలప్రతిని బొంబాయిలోని నిర్ణయసాగర్ ప్రెస్ పక్షాన ప్రచురించినాడు. అయితే, స్టెయిన్ కూడా

ఆ వెనువెంటనే(క్రీ. శ. 1900) రాజతరంగిణిని ఆంగ్లంలో వచనరూపంగా అనువదించినాడు. ఇందులో బుహ్లెర్ అనువాద విధానం అనుసరింపబడింది. అంతేకాదు,—'మూల గ్రంథంలోని అంశాలను స్పష్టంగా, సుగమంగా చెప్పటమేకాక, తనకు లభించిన ప్రతినిబట్టి గ్రంథనిర్మాణం గురించిగానీ గ్రంథంలో అంతర్లీనమై వివరింపదగిన అంశాలను గానీ పరోక్షంగా వ్యాఖ్యాత సూచించటానికి అనువైన విధానం గూడా ఇందులో పాటింపబడింది[1]. చిరస్మరణీయమైన ఈ స్టెయిన్ప్రతి రెండు భాగాలుగా ఉన్నది. బహుళంగా పలువురు పేర్కొనే ఈ గ్రంథం మొదటిసారిగా రాజతరంగిణి లోని విషయాలను విస్తారంగా స్పష్టపరచింది.

స్టెయిన్ అనువాదం తరువాత ప్రముఖంగా పేర్కొనవలసిన రాజతరంగిణి అనువాదం ఇదివరకే ప్రస్తావింపబడిన ఆర్. ఎస్. పండితుని అనువాదం. ఈయన చాలావరకు స్టెయిన్ సంస్కృత ప్రతినే అనుసరించినా గూడా, తరుచుగా దుర్గాప్రసాద పండితుని సంశోధిత ప్రతి ప్రస్తావనలుగూడా ఇందులో ఉన్నవి. 'స్టెయిన్ అనువాద విధానం మూల గ్రంథాన్ని అధ్యయనం చేయజాలని పాఠకులకు రాజతరంగిణి ఒక కావ్యం అనే భావాన్ని కలిగింపజాలదు' అని ఆర్. ఎస్. పండితుని అభిప్రాయం. కాని, తన అనువాదం 'మూలంలోని గ్రంథ పాఠాలను మినహాయిస్తే, వివిధమైన మార్పులూ లేని సమగ్ర స్వరూపం.'

ఆర్. ఎస్. పండితుని అనువాదానికి జవహర్లాల్ నెహ్రూ వ్రాసిన 'ముందు మాటలు' లోని భాగం ఇదివరకే కొంత ఉదాహరించబడింది. క్రీ. శ. 1934 జూన్లో నెహ్రూ డెహరాడూన్ జైలులో ఉన్నప్పుడు ఆ 'ముందు మాటలు' వ్రాసినాడు. 'భారత దేశంలో కనుగొన్న గ్రంథాలలో చరిత్రగా చెప్పుకోదగిన గ్రంథం రాజతరంగిణి' అని ఆనాటికి దాదాపు యాభై ఏండ్ల క్రితమే ఎస్. పి. పండితుడన్న మాటలను ఉటంకిస్తూ – 'ప్రాచీన భారతీయ చరిత్ర-సంస్కృతులలో ఆసక్తిగల అధ్యేతలకు ఇట్లాంటి గ్రంథం చాలా ముఖ్యమైనది' అన్నారు నెహ్రూ. ఆర్. ఎస్. పండితుని అనువాద విధానాన్ని ప్రస్తావించి ఆయనే - 'ఈ అనువాదం ప్రతిపదానువాద పద్ధతి నెన్నుకున్నది. దీనివల్ల అక్కడక్కడ భాషా సౌందర్య,

---

1. సూఫీ., జి. ఎం.డి., కాశ్మీర్. ఆముఖం.

సౌకుమార్యం, మాధుర్యాలకు అఘాతం కలిగినా కూడా, ప్రామాణికత్వమే ప్రధానమైన ఇట్లాంటి గ్రంథాలకు ఈ పద్ధతే ఉచితమనుకుంటా' నన్నారు. అనేక సూచనలు, అనుబంధాలతోబాటు-'వైదిక, బౌద్ధ, బ్రాహ్మణ యుగాల కాశ్మీరు చరిత్ర మనకు ప్రదానం చేసిన వివిధాంశాలను స్పష్టంగా వెలువరించిన' కారణంగా స్టెయిన్ వంటివారి అనువాదాలతో పోల్చి చూస్తే ఆర్. ఎస్. పండితుని అనువాదంయొక్క గొప్పదనం బోధపడుతుంది. అంతేకాదు, ఇది కాల పరీక్షకు ఎదురొడ్డి నిలిచింది కూడా.

కల్హణుని ఒకే ఒక విపుల రచన రాజతరంగిణి. భారతీయ సాహిత్య నిర్మాతలలో ఒకడుగా ఆయన ఉన్నత స్థానాన్ని అది సుప్రతిష్ఠితం చేస్తున్నది. రాజతరంగిణి ఉదాత్త ప్రతిభాఫలమైన ఒక కావ్య కళాఖండమవుతూనే, ఒక గొప్ప ప్రామాణిక చరిత్ర గ్రంథంగా కూడా రాణిస్తున్నది. అయితే, ఇంతటి రాజతరంగిణి రచించిన కల్హణుని గూర్చి మాత్రం వలసినంత సమాచారం లభించటం లేదు. కాని, ఆయన కాలం, జీవితం, కృషికి సంబంధించి కొద్దిపాటిగానైనా లభిస్తున్న కొన్ని వివరాలు, వాస్తవాలు ఆధారంగా భారతీయ సాహిత్యానికి ఆయన విశిష్ట సేవల విలువను వివరించే ప్రయత్నం రాబోయే అధ్యాయాలలో గమనించదగినది.

# కల్హణుడు: ఆయన కుటుంబం

కల్హణుని గూర్చి మనకు లభించే సమాచారం చాలా స్వల్పం. ఆయన సమకాలిక - పూర్వరచయితల సంగతయినా అంతే. కాశ్మీరు ప్రాచీన చరిత్రను అనేక వివరాలతో ప్రయోజనకరంగా చిత్రించి మన చారిత్రక పరిజ్ఞానాన్ని విశేషంగా విస్తరింపజేసిన చారిత్రక - కవి కల్హణుడు. ఆ మహా రచయితను గూర్చి, ఆయన జీవిత విశేషాలను గూర్చి అధికారికమైన లిఖితాధారాలు ఎక్కడా లభించకపోవటం విచారకరం. అయితే, కల్హణుని చారిత్రక కావ్యాన్ని ఓపికగా పరిశోధించటంవల్ల ఆయన జీవితాన్ని గూర్చి కచ్చితమైన సమాచారం కొంత తెలుస్తున్నది. ఈ విధంగా తెలిసే సమాచారం కాళిదాసు వంటి మహాకవిని గూర్చి లభించే దానికన్నా ఎక్కువే. అయితే, కాళిదాసును గూర్చి తెలిసే అనేకాంశాలు ఈనాటికీ వివాదాస్పదంగానే ఉన్నవి కాని, కల్హణుని గూర్చి తెలిసినవి మాత్రం కచ్చితమైనవి.

రాజతరంగిణిలో ఎనిమిది తరంగాలు (సర్గలు, లేక అధ్యాయాలు) ఉన్నవి. ప్రతి తరంగాంత గద్యలో కల్హణుని పేరు కన్పిస్తున్నది. 'శ్రీకాశ్మీరిక మహామాత్య శ్రీచంపక ప్రభు కుమారుడైన కల్హణుడు' రాజతరంగిణి రచించినట్లు ప్రతి తరంగాంత వాక్యం ధ్రువపరుస్తున్నది. కల్హణుని తండ్రి చంపకుడు. కాశ్మీరు రాజపురుషుడు. ఆయన 'ద్వారపతి' పదవిని, లేదా సరిహద్దు రక్షకసేనాపతి పదవిని హర్ష మహారాజు కాలంలో నిర్వహించినాడు. కల్హణుడు తన కావ్యాన్ని క్రీ.శ. 1148-49లో ఆరంభించి తరువాతి సంవత్సరంలో పూర్తి చేసినాడు. ఈ రచనా సంవత్సరాలను బట్టి, హర్షుని వద్ద ప్రధానపదవి నిర్వహించినట్లుగా చంపకుని గూర్చిన ప్రస్తావనలు కావ్యంలో ఉండటాన్ని బట్టి చంపక - కల్హణుల మధ్య తండ్రి - కొడుకుల సంబంధం నిశ్చిత మవుతున్నది. కల్హణుడు 'ద్వారపతి' అని ఎంతో గౌరవంగా చంపకుని పలుమార్లు పేర్కొన్నాడు. సరిహద్దు ప్రాంతంలో దరదుల తిరుగుబాటును విజయవంతంగా అణచివేసినందుకు, హర్ష మహారాజును అత్యంత కష్టదశలో కూడా విడనాడకుండా విశ్వాసపాత్రంగా వెంటవున్న కొద్దిమంది అధికారులలో ఒకడుగా ఉన్నందుకు

కల్హణుడు చంపకుని ఎంతగానో కీర్తించినాడు. హర్షునికి విపత్తు సంభవించిన సమయాన, నిజానికి, చంపకుడు రాజువద్ద లేడు. రాజాజ్ఞపై అవసరమైన ఒక దండయాత్ర నిర్వహించటానికి వెళ్ళినాడు. వెళ్ళటానికి ముందు చంపకునికీ-ఆ రాజుకూ (అనంతర కాలాన ఆ రాజు తప్పనిసరిగా రాజధానిని వదిలి పారిపోవలసి వచ్చింది) మధ్యసాగిన సంభాషణ, హర్షుని విషాదకరమైన మరణానికి సంబంధించిన సన్నివేశం-వీటిని చిత్రించటంలో కల్హణుడు ప్రదర్శించిన ఆత్మీయత చంపక-కల్హణుల సంబంధాన్ని మరింత స్థిరపరుస్తున్నది. అయితే, చంపకునికి హర్షమహారాజుమీద ఉన్న ప్రేమాభిమానాల రీతిని మాత్రం కల్హణుడు పంచుకోలేకపోయినట్లు తెలుస్తుంది. కాగా, చంపకుడు (8వ తరంగం, 2365 శ్లో.) క్రి. శ. 1136 ప్రాంతంలో జీవించి ఉన్నట్లు భావించవచ్చు.

కల్హణుని మరొక దగ్గరి బంధువును గూర్చి కూడా ఈ చరిత్ర గ్రంథంలో ఉన్నది. ఆయన పేరు కణకుడు, చంపకుని సోదరుడు. హర్షమహారాజు అనుగ్రహం సంపాదించినవాడు. హర్షుడు గొప్ప సంగీత ప్రియుడు. ఆయన వద్ద కణకుడు సంగీతంలో మెలకువలు తెలుసుకున్నాడు. రాజుగారు కణకుని అభిమానించి లక్ష బంగారు నాణాలు బహూకరించి గౌరవించినాడు. ఉదారమైన ఈ బహుమతిని బట్టి కల్హణుని కుటుంబానికి గల గౌరవస్థాయిని ఊహించవచ్చు. ఈ ఊహనుబట్టి, చారిత్రక గ్రంథంలో వ్యక్తమయ్యే అనేకాంశాలనుబట్టి కల్హణుడు తన బ్రతుకుదల కోసం ఏపాటూ పడలేదనీ, అతనికి ఏ లోపమూ కలుగలేదని స్పష్టపడుతుంది.

కణకుడు హర్షుని మరణానంతరం, ఆయన మీది గౌరవంతో మరే రాజునూ ఆశ్రయించలేదు. తన శేషజీవితాన్ని భగవద్ధ్యానంలో శాంతంగా గడపటానికి కణకుడు వారణాసికి వెళ్లినట్టు రాజతరంగిణిలో చెప్పబడింది. ఇదిట్లా ఉండగా, చంపకునికి సంబంధించినంత వరకు పూర్వ పరిచయమంటూ ఏమీ లేకుండానే కల్హణుడు డాయనను హఠాత్తుగా ప్రవేశపెట్టినాడు. (7 తరం. 954 శ్లో.) చంపకుడు చాలా ప్రసిద్ధుడు. తన కాలం వారికి ఆయనను గూర్చి ప్రత్యేకంగా పరిచయం చేయనవసరం లేదని కల్హణుడు భావించి ఉండవచ్చు. అంతేకాదు, ఆయన తన తండ్రి కాబట్టి, ఆయనను గూర్చి ఎక్కువగా చెప్పటం కూడా బాగుండదని అనుకొని ఉండవచ్చు. ఈధోరణి కల్హణునికి చంపకునితోడి సంబంధాన్ని బలపరచటమేకాక, కల్హణుని

వాక్సంయమనాన్ని కూడా వ్యక్తపరుస్తుంది. చంపకుని ప్రస్తావించిన శ్లోకంలో 'చంపకుడు నందిక్షేత్రంలో ప్రతి సంవత్సరం ఏడు రోజులుండి, ఆ సంవత్సరంలో తాను సంపాదించిన ధనాన్ని (దానాలద్వారా) సఫలం చేసినాడు' అని చెప్పబడింది. ఈ తీర్థ క్షేత్రాన్ని కల్హణుడు రాజతరంగిణిలో కళ్ళకు కట్టినట్లు వర్ణించినాడు. ఇంకా ఇతర క్షేత్రాలను కూడా ఈ విధంగానే చిత్రించినాడు. దీనినిబట్టి, పరమభక్తుడైన తన తండ్రితోపాటు కల్హణుడు తన బాల్యంలో ఈ నందిక్షేత్రాన్నీ, ఇతర క్షేత్రాలనూ దర్శించి ఉంటాడనిపిస్తుంది. మరి, కల్హణునిది బ్రాహ్మణ కుటుంబమనటంలో సందేహంలేదు. సంస్కృత భాషాపాండిత్యం ఆనాడు ప్రధానంగా బ్రాహ్మణ కుటుంబాల సొత్తు. అది కల్హణునికి ఉన్నది. ఇంకా గమనిస్తే, రాజతరంగిణి ద్వారా వ్యక్తమయ్యే గంభీరమైన కల్హణుని బహుశాస్త్రజ్ఞత కూడా దీనికి మరొక ఉదాహరణ. ఇదిట్లా ఉండగా, కల్హణునికి మూడు శతాబ్దాల తరువాతివాడైన జోనరాజు[1] కల్హణుని 'ద్విజుడు' అని పేర్కొన్నాడు.

కల్హణుని జన్మస్థలాన్ని గూడా రాజతరంగిణిని బట్టి తెలుసుకోవచ్చు. కల్హణుని పినతండ్రి అయిన కణకుని జన్మస్థానం పరిహాసపురం.[2] అక్కడ బ్రహ్మాండమైన ఒక బుద్ధ విగ్రహం ఉండేది. ఒక సందర్భంలో హర్షుడు మూర్ఖంగా ఆ విగ్రహాన్ని ధ్వంసం చేయబూనినప్పుడు కణకుడు అడ్డుపడి, రాజును సమాధానపరచి ఆ విగ్రహాన్ని రక్షించినాడు. తన పినతండ్రి చేసిన ఈ మహాకార్యాన్ని కల్హణుడు కీర్తించినాడు. ఈ ఘట్టాన్ని కల్హణుడు వర్ణించిన తీరును గమనిస్తే, కణకుడు ఏదోవిధమైన ఒకానొక బౌద్ధ సంప్రదాయారాధకుడనిపిస్తుంది. అంతేకాదు, కల్హణునికి బౌద్ధంపై సానుభూతి ఉండటానికి కారణాన్ని కూడా సూచిస్తుంది. ఈ ఘట్టాన్ని వర్ణించటంతోపాటు, పరిహాసపుర నిర్మాణాన్నీ, ఆ నగర భౌగోళిక స్వరూపాన్నీ, అక్కడి వారినీ వివరంగా, ఉత్సాహపూర్వకంగా రాజతరంగిణిలో చిత్రించటంవల్ల, పరిహాసపురమే కల్హణుని కుటుంబానికి మొదట నివాసస్థానమని, కల్హణుని జన్మస్థానమనీ స్పష్టపడుతుంది.

1. జోనరాజు (క్రి. శ. 1383) 'ద్వితీయ రాజతరంగిణి' కర్త. ఈయనను గూర్చిన వివరాలు పదకొండవ అధ్యాయంలో చెప్పబడినవి—అనువాదకుడు.

2. కర్కోట వంశీయుడైన ముక్తాపీడ లలితాదిత్యుడు నిర్మించిన నగరం 'పరిహాసపురం' చూ. తొమ్మిదవ అధ్యాయం. —అను.

కల్హణుని కుటుంబ సంప్రదాయం చాలా ఉదాత్తమైనది. తండ్రి జీవిత విధానం, వ్యక్తిత్వం కల్హణుని అతిగాఢంగా ప్రభావితం చేసినవి. తాను ఆయన కుమారుడు కావటం ఎంతో గర్వించదగిన అంశంగా కల్హణుడు భావించినాడు. ఉత్తమ బ్రాహ్మణ వర్గానికీ, శైవ సంప్రదాయానికి చెందినా గూడా, కల్హణుడూ, ఆయన కుటుంబమూ బౌద్ధమత సహనం కలవారు. బ్రాహ్మణుడుగా కల్హణుడు శైవ మహాసిద్ధాంతం తోటీ, దానికి సంబంధించిన తాంత్రిక విధానంతోటీ గాఢమైన అనుబంధం కలవాడు. కలట్టుడనే ఆయనను గౌరవపూర్వకంగా కల్హణుడు ప్రస్తావించటం ఈ అంశాన్ని నిరూపిస్తుంది. భట్ట కలట్టుడు కాశ్మీర శైవ సంప్రదాయ వ్యాప్తికి దోహదం చేసినవారిలో ప్రధానవ్యక్తి. ఇదిట్లా ఉండగా, కల్హణుడు తన గ్రంథాన్ని శివ నమస్కారంతో ఆరంభించినాడు. శివుడు తనకు భూషణాలైన పాముల పడగల మీద రత్నాల రకరకాల కాంతుల సమూహంతో అందమైనవాడుగా భావించి, అర్ధనారీశ్వర స్వరూపాన్ని స్మరిస్తూ 'ఆయన (శివుని)లో సగభాగం ఆయన భార్యతో ఏకీకృతమైనది' అని కల్హణుడన్నాడు. కల్హణుని కాలంలో శైవం వ్యాప్తిలో ఉన్నదని నిర్ధారణ అయినందువల్ల, ఆయన చేసిన ఈ శివప్రార్థన ఒక ప్రత్యేకతను సంతరించుకుంటున్నది.

తనకూ, తన కుటుంబానికి బ్రాహ్మణ శైవ సంప్రదాయంతో ఇంతటి గాఢ సంబంధమున్నాగూడా, తన గ్రంథ మందంతటా బౌద్ధం విషయంలో కల్హణుడు అపారమైన స్నేహ సౌహార్దాలను ప్రదర్శించినాడు. అశోక చక్రవర్తి నాటినుండి తన నాటిదాకా బౌద్ధమత ప్రచారం కోసం నిర్మించబడిన అనేక స్తూపాలను, విహారాలను[3] ఆయన అభినందించినాడు. రాజులే గాక, ప్రజలు నిర్మించిన వాటిని గూడా ఆయన ఎంతో ఉత్సాహంగా వర్ణించినాడు. "బోధిసత్త్వుని, లేదా బుద్ధుని సర్వజీవుల దుఃఖ నివారకునిగా, ఉదారమూర్తిగా, ఉదాత్తాశయునిగా తన గ్రంథంలో పలుమార్లు ప్రస్తావించటానికి కల్హణుడు ఏ మాత్రమూ సంకోచించలేదు. ఆయన దృష్టిలో వారు (బోధిసత్త్వులు) మంచితనం మూర్తీభవించినవారు. పాపుల విషయంలో కూడా వారికి కోపమనేది లేదు. పాపులపై సర్వదా దయావర్షం

3. కాశ్మీరును క్రీ॥శ॥ 759 లో దర్శించిన చీనా యాత్రికుడు ఔ-కాంగ్ కాశ్మీరులో 300 బౌద్ధ విహారా లున్నాయన్నాడు.

కురిపించేవారు"[4] కల్హణుని రచనారీతిని గమనిస్తే, ఆయనకు బౌద్ధమతానికి చెందిన పారిభాషిక పద సముదాయంతోనూ, విశేషాలతోనూ, సంప్రదాయాలతోనూ గాఢమైన పరిచయమున్నట్లు స్పష్ట పడుతుంది. 'నీలమత పురాణం' వంటి గ్రంథం ఆవిర్భవించిన ప్రాంతంలో ఈ విధమైన ధోరణి వ్యాప్తిలో ఉండవచ్చుననే అనిపిస్తుంది. కాశ్మీరు లోయ ప్రాంతంలో నీల మత పురాణం బ్రాహ్మణ సంప్రదాయానికి సంబంధించి మతపరంగా ప్రాచీన మైన ప్రామాణిక గ్రంథం. అయితే ఈ విధమైన గ్రంథంలో గూడా బుద్ధ జయంతిని ఒక విశేషపర్వంగా - పండుగగా ఉత్సవాలు చేయవలెననీ, ఆ ఉత్సవాలలో బుద్ధ విగ్రహాలనూ, చైత్యాలనూ విశేషంగా అలంకరించ వలెననీ చెప్పబడింది. కల్హణుని సహనభావం ఇంకా ముందుకు సాగింది. విగ్రహారాధన నిరసించేవారి విషయంలోనూ ఆయన సహనం ప్రదర్శించి నాడు. చారిత్రకుడుగా ఆయన స్వతంత్రుడు. నిష్పక్షపాత పరిశీలకుడు.

కల్హణునికి కర్మసిద్ధాంతంమీద ఉన్న విశ్వాసం బౌద్ధమతానికి ఉన్నంతటిది. ఈ విశ్వాసం ఆయన గ్రంథంలో సర్వత్రా ప్రముఖంగా కన్పి స్తుంది. విధి, అదృష్టం. ఈశ్వరుడు మొదలైన ప్రస్తావనలు మాటిమాటికి దర్శనమిస్తున్నవి. ఆశ, ఉద్రేకం, నేరం మొదలైనవాటికి సంబంధించిన మౌలికశక్తులు మనుష్యుల ప్రవర్తనలను ప్రోత్సహిస్తూ ఉంటున్నవి. పరస్పరం సంఘర్షించుకొంటూ ఒకదానిని మరొకటి ఆక్రమిస్తూ పరిక్ర మిస్తున్నవి. అయినా కూడా ప్రతియుగంలోనూ ప్రళయం సంభవిస్తున్నదని పించే స్థితిలోనూ ఆదర్శం ఉటికివస్తూనే ఉంటుందని కల్హణుడు భావించి నాడు. అందువల్లనే కల్హణుడు తనకావ్యం ప్రతిరంగంలోనూ, మొదటి పద్యంలో మానవజీవిత రహస్యాలనూ, సృష్టివైచిత్ర్యాలనూ ప్రస్తావించి నాడు. ప్రకృతిని సర్వతోముఖంగా చిత్రిస్తూ, ఆ సందర్భంలోనూ సమ స్తానికి అనువర్తించే తాత్త్వికాంశాలను వ్యక్తం చేస్తూ ఉంటాడు. తరచుగా కల్పాంత ప్రళయ ప్రస్తావన కన్పిస్తుంటుంది.

కల్హణుని సహనశీలత కేవలం మతాలవరకే పరిమితం కాదు. అది చాలా విస్తృతమైనది. వైయక్తికంగా ఆయన సంకుచితమైన అంధవాదాలకు

4. స్టెయిన్, ఎం.ఏ., కల్హణుని రాజ తరంగిణి అనువాదం ప్రథమ సంపుటం ప్రస్తావన.

అతీతుడు. జాతీయవాదం ఆయన దృష్టిని సంకుచితం చేయలేదు. ఆయన బెంగాలు యోధులను మెచ్చుకొనటం ఇందు కొక ఉదాహరణ. తమరాజును కాశ్మీరులోయలో త్రిగామీవద్ద క్రూరంగా చంపినందుకు ప్రతీకారం చేయటానికి ఆ యోధులు అనేక కష్టనష్టాలను లెక్కచేయకుండా కాశ్మీరుకు అతి ప్రయాసలు పడుతూ కూడా వచ్చినారు. తమ రాజుకోసం జీవితాలను బలిచేసిన 'సాహసికులైన గౌడుల'ను (బెంగాలీయులను) ఆయన ముక్త కంఠంతో కీర్తించినాడు. 'తమ ప్రభువుపట్ల వారికి గల భక్తి విశ్వాసాలను వారి రక్తవర్షం సముజ్జ్వలితం చేసింది. భూమిని పవిత్రం చేసింది' అన్నాడు కల్హణుడు.

కల్హణుడు ఏ వ్యక్తికీ, నాయకుడికీ ఆరాధకుడు కాడు. రాజతరంగిణిలో అతిలోకంగా కీర్తింపబడిన రాజులుగానీ, రాణులుగానీ ఎవరూ లేరు. కల్హణునికి స్వవర్ణ పక్షపాతం కూడా ఏమీ లేదు. పురోహిత వర్గాన్ని, వారి లోపాలను ఆయన తీవ్రంగా విమర్శించినాడు. రాజ్యవిషయాలలో ఆ వర్గపు అనవసరమైన జోక్యాన్ని గూర్చి తన తిరస్కార భావాన్ని ఆయ నెక్కడా దాచుకో లేదు. ఒక పదవిని నిర్వహించటానికి ఒక వర్ణంకానీ, వర్గం కానీ, జన్మ కానీ, అర్హతను సంపాదింపజాలదనే అభిప్రాయాన్ని ఆయన పలుమార్లు వ్యక్తీకరించినాడు. ఆ పదవి పౌరాధికారానికి చెందింది కావచ్చు, సైన్యాధికారానికి చెందిందైనా కావచ్చు అవర జాతివారైన డోంబులే కాక, అగ్రజాతి వారైన బ్రాహ్మణులు కూడా సైన్యంలో పనిచేసినారు. జాతి వివక్షత లేకుండా పదాతి పదవి మొదలుకొని సేనాపతి పదవి దాకా ఎదిగిన వారెందరో ఉన్నారు. ఒక మహాయోధుడైన రాజు రోహతక్ ప్రాంతానికి చెందిన బనియాస్త్రీని పెండ్లి చేసుకొన్నట్టు కల్హణుడు చెప్పినాడు. బౌద్ధయుగం పుణ్యమా అని అస్పృశ్యత అంతరించి పోయింది. ఈ విధమైన ఉదార సంప్రదాయం ఈనాటికీ కాశ్మీరు లోయప్రాంతంలో సాగుతూనే ఉన్నది. తన స్థాయినిబట్టీ తన కుటుంబ స్థాయినిబట్టీ రకరకాల అధికారులతో ఆత్మీయత కలిగియుండి కూడా కల్హణుడు వారి విషయంలో ఎక్కడా పక్షపాతం ప్రదర్శించలేదు. బ్రాహ్మణ వర్ణానికి చెందిన కాయస్థుల దుర్మార్గాలను కూడా ఆయన బట్టబయలు పరచినాడు.

కల్హణుడు తనను గూర్చి చెప్పుకొనటంలో ఎంత మౌనంగా ఉన్నా కూడా, ఆయన విశాల విజ్ఞానానికి సాక్ష్యమిచ్చే అంశాలు ఈ గ్రంథంలో

కోకొల్లలుగా ఉన్నవి. సాంప్రదాయికంగా అనేక విజ్ఞాన శాఖలలో ఆయన పండితుడు. రఘువంశం, మేఘదూతం వంటి ప్రామాణిక కావ్యాలతో గాఢపరిచయం ఉండటమేకాదు; రామాయణం, మహాభారతం వంటి ఇతిహాస గ్రంథాలను గూడా ఆయన లోతుగా అధ్యయనం చేసినాడు. ఆ రెండు మహాగ్రంథాల పోలికలు రాజతరంగిణిలోని అనేక ఘట్టాల చిత్రణలో స్ఫురిస్తున్నవి. కౌరవ పాండవుల యుద్ధం, దాని నంటిపెట్టుకున్న అనేక గాథలు, వాటికి సంబంధించిన పౌరాణికత; తన పూర్వీకులకు, సమకాలికులకూ అనిపించినట్లుగానే, ఆయనకు గూడా ఒక చరిత్ర మాదిరిగానే అనిపించింది. స్టెయిన్ అన్నట్లుగా[1]—"చారిత్రక యుగాలలోని సంఘటనల కన్నా ఈ మహా గ్రంథాలలోని కథలను భారతీయులు గొప్ప వను కోవటానికి, వారికి సాహసికత్వం మీది ఆకర్షణ, వాటిని ప్రామాణికులైన ఋషులు రచించటం కారణం. అందువల్ల కల్హణుడు తన కావ్య విషయాన్ని ఎన్నుకోవటంలో ఈ రెండు ఇతిహాస కావ్యాల అధ్యయనం ఎంతగానో ప్రభావం నెరపిందని మనం నిస్సంశయంగా చెప్పవచ్చు."

కవిగా, చారిత్రకుడుగా ఏకకాలంలో తన బాధ్యతను నిర్వహించ టానికి కల్హణుని సమర్థుని చేసిన సాహిత్య శిక్షణ గొప్పది. దానికి కావలసి నంత సాక్ష్యం రాజతరంగిణిలో లభిస్తుంది. ఆ శిక్షణ కేవలం కాశ్మీరు చరిత్ర—సాహిత్యాల మీదనేగాక, మొత్తం భారతీయ చరిత్ర—సాహిత్యాల మీద కూడా చెరగని ముద్రవేసింది. తన గ్రంథంలో కల్హణుడు పేర్కొన్న పూర్వ - సమకాలీన కవుల - పండితులను బట్టి ఆయన జ్ఞాన భూమిక ఎంత విస్తృతమైన దనేది స్పష్టపడుతుంది. సంస్కృత సాహిత్య విద్యార్థులకు ఈ కవులు - పండితుల ప్రస్తావనలు ఎంతో విలువైన సమాచారాన్ని సమకూరుస్తున్నవి. తనతోటి కాశ్మీర కవి అయిన బిల్హణుని 'విక్రమాంక దేవ చరిత'ను కల్హణుడు అధ్యయనం చేసినాడనేది నిశ్చయమే. ఈ విక్రమాంకదేవ చరిత పదకొండవ శతాబ్దం ఎనిమిదవ పదిలో రచింపబడింది. మంఖ కవి రచించిన శ్రీకంఠచరితలో కల్యాణ కవి ప్రస్తావన ఈ సందర్భంలో ప్రముఖంగా గమనించదగింది. ఈ మంఖుడు కల్హణునికి సమకాలీనుడు. బిల్హణుని కవితాశిల్ప సమగ్రత్వాన్ని కల్యాణ కవి కవితా

1. స్టెయిన్, ఏ. ఎం., తమ రాజతరంగిణి అనువాదం ప్రస్తావనలో.

శిల్పం అద్దం మాదిరిగా ప్రతిఫలింప జేస్తుందన్నాడు మంఖ కవి. పురాణాలనూ, జానపద కథలనూ, అధ్యయనం చేయటంలో కల్యాణ కవికి గల ఆసక్తిని, ఉత్సాహాన్ని మంఖుడు ప్రస్తావించినాడు. మంఖుడు ప్రస్తావించిన ఈ కల్యాణుడు, నిజానికి, కల్హణుడే. 'కల్హణ' అన్న ప్రాకృత భాషా పదాన్ని సంస్కృతీకరిస్తే 'కల్యాణ' పదం నిష్పన్నమైనది. తన శ్రీకంఠ చరిత వ్యాఖ్యానంలో జోనరాజు కల్హణునికి కథలంటే గాఢమైన ఆసక్తి అన్నాడు. ఆ కథలు మహాభారతంలోనివీ, తదితర మైనవి కూడా. కాగా, కల్హణ - కల్యాణులు ఒకరేననీ, కల్హణపదం నుండి కల్యాణ అన్న సంస్కృతపదం నిష్పన్న మైనదనే అంశం కల్హణుని పాండిత్యాన్నీ, ఉదార మైన కుటుంబ భూమికను నిర్ధారిస్తున్నది.

ఆయన రచననుండి సేకరించబడిన ఈ విశేషాంశాలన్నీ, కల్హణుడు జీవించివుండిన దేశకాల పరిస్థితులనుబట్టి ప్రశ్యేకతను సంతరించుకొంటున్నవి. సమకాలీన సంఘటనలను అధ్యయన పూర్వకంగా అవగాహన చేసుకున్న రీతి, ఆయన స్వతంత్ర రాజకీయాభిప్రాయాలు అభినందనీయ మైనవి. యుద్ధతంత్రానికి సంబంధించి ఆయన వ్యక్తీకరించిన విషయాల స్పష్టత కల్హణునికిగల యుద్ధనీతి పాండిత్యాన్ని స్పష్టపరుస్తుంది. రాజతరంగిణిలో వ్యక్తమయ్యే కల్హణుని భౌగోళిక పరిజ్ఞాన వైశద్యాన్ని గమనిస్తే, ఆయన విస్తృతంగా విరివిగా దేశపర్యటన చేసినట్లు మనకు తెలుస్తుంది. అన్నింటికన్నామించి వివిధవ్యక్తులను, సంఘటనలను అధ్యయనం చేయటంలో, అంతర్యాన్ని అవగాహన చేసుకుని స్పష్టంగా వ్యక్తీకరించటంలో కల్హణుని స్వతంత్ర దృక్పథం చాలా గొప్పది.

# కల్హణుడు: ఆయన కాలం

రాజతరంగిణిలోని అత్యధిక భాగం కల్హణుని సమకాలీన సంఘటనల చిత్రణే. అవన్నీ ఆయన చూచినవి, విన్నవి. తన అద్భుతమైన జ్ఞాపక శక్తితో వాటిని ఆయన చిత్రించిన తీరువల్ల ఆనాటి రాజకీయ-సామాజిక పరిస్థితులు స్పష్టంగా తెలియవస్తున్నవి. ఆయనకు సమకాలికంగా కానీ, అంతకు పూర్వంగానీ మరి ఏ భారతీయ రచయిత గూడా ఇంత స్పష్టంగా ఈ అంశాలను చిత్రించి ఉండడు. కాశ్మీరు లోయప్రాంతానికి సంబంధించి రాజతరంగిణిలో సువ్యక్తమయ్యే కల్హణుని భౌగోళిక స్వరూప పరిజ్ఞానం చారిత్రకులకూ, భౌగోళిక శాస్త్రజ్ఞులకూ ఒక బంగారు గని. తననాటి వ్యక్తులనూ, వారి ప్రవృత్తులనూ గూర్చి కల్హణుడు వ్యక్తం చేసిన అంశాలూ, అభిప్రాయాలూ ఆయన వ్యక్తిత్వాన్నీ, వైయక్తిక సంబంధాలనూ అర్థం చేసుకొనటానికి ఎంతగానో ఉపకరిస్తున్నవి.

రాజతరంగిణి రచనా కాలం నాటికే కల్హణుడు గొప్ప ప్రపంచానుభవం కలవాడని పలు సంఘటనలను ఆయన చిత్రించిన తీరు స్పష్టపరుస్తుంది. క్రి. శ. 1148 - 50 లలో కానీ రాజతరంగిణి రచించినట్లు ఆయనే వ్రాసుకున్నాడు. ఆయన గ్రంథరచనారీతి—ఉదాహరణకు, సుస్సలుని రాజ్యకాల (క్రి. శ. 1112 - 29) సంఘటనలను చిత్రించినతీరు ప్రజలనూ, వారి ఆశలనూ, ఆశయాలనూ పరిశీలించి అవగాహన పరచుకోవటంలో కల్హణునికి గల పరిణత ప్రజ్ఞను సూచిస్తుంది. కాగా, ఆ శతాబ్దారంభం కల్హణుని జన్మకాలంగా భావించబడుతున్నది.

కాశ్మీరు చరిత్రలో అంతర్యుద్ధాలతో, రాజకీయ కక్షలతో, కుతంత్రాలతో నిండిన సుదీర్ఘ కాలంలో కల్హణుని జీవితంలోని చాలాభాగం గడిచింది. పన్నెండవ శతాబ్దం ప్రారంభమవుతూనే దేశరాజకీయ జీవితాన్ని కల్లోలపరచిన ఒకానొక ప్రధానమైన అనువంశిక విప్లవం చెలరేగింది. హర్షుని రాజ్యకాల (క్రి. శ. 1089-1101) ప్రారంభంలో వైభవమూ, సుఖ శాంతులూ రాజ్యంలో నెలకొని ఉన్నవి. కాని, ఆయన అవక తవక ప్రవర్తనకే అవన్నీ బలి అయిపోయినవి. డమరుల భూస్వామ్యాధికారాలను

కఠినంగా అణచివేయటం వల్ల తనకు వ్యతిరేకంగా చెలరేగిన విప్లవంలో హర్షుడు హతమారినాడు. లోహరా ప్రాంతానికి చెందిన ఉచ్చలుడు, సుస్సలుడు బలవంతంగా అధికారాన్ని హస్తగతం చేసుకుని దేశాన్ని పంచుకున్నారు. వీరిద్దరు అన్నదమ్ములు, పెద్దవాడు ఉచ్చలుడు. ఆయన లోయ ప్రాంతానికి పరిపాలకుడు కాగా; లోహరా, దాని చుట్టుప్రక్కల పర్వత ప్రాంతాలు తమ్ముడు సుస్సలుని భాగానికి వచ్చినవి. అయితే, కొద్ది నాళ్ల లోనే ఈ ఇద్దరు రాజకుమారులూ కాశ్మీరు సింహాసనాధిపత్యం కోసం పోటీపడ సాగినారు. ఉచ్చలుని రాజ్యకాల (క్రీ.శ. 1101 - 1111) మంతా దేశపు ఆర్థిక వ్యవస్థను దెబ్బతీసిన రాజకీయ కల్లోలాలతో, రాజ్యానికి తామే వారసులమని చెప్పుకొనే కొంతమంది రెచ్చగొట్టిన అల్లర్లతో కల్లోలితంగా గడిచింది. మరి, ఉచ్చలుడు హత్య కావింపబడినాడు. రకరకాల వారసులు అధికారానికి వచ్చినారు. కాని, అంతలోనే డమరుల నాయకుడైన గర్గ చంద్రుని సాయంతో తాను కాశ్మీరు రాజు కావలెననే ప్రగాఢవాంఛను సుస్సలుడు సఫలం చేసుకున్నాడు. ఆయన పరిపాలన సిరంకుశత్వాని కేమీ తీసిపోలేదు. కాగా, రకరకాలైన కుట్రలూ, కుతంత్రాలూ రాచనగరులోనే మొదలై రాజ్యంలోకి ప్రసరించ సాగినవి. తన ప్రయత్నాలూ, ఎత్తులూ ఎదురు తిరుగటంతో సుస్సలుడు కొన్ని నెలలపాటు లోహరా ప్రాంతానికి పారిపోక తప్పలేదు. కాని డమరులలోని అనైక్యం ఆసరాగా సుస్సలుడు మళ్లీ రాజ్యాధికారం సంపాదించినాడు. ఆ తరువాత ఏడేళ్ళదాకా అంత ర్యుద్ధం అప్రతిహతంగా సాగింది. హర్షుని మనుమడూ, రాజ్యానికి వారసుడూ అయిన భిక్షాచరుని చంపటానికి సుస్సలుడు కుట్ర పన్నినాడు. అయితే, ఆ కుట్ర వికటించి క్రీ. శ. 1128 లో తానే హతుడైనాడు. వెంటనే, ఆయన కుమారుడైన జయసింహుడు రాజ్యానికి వచ్చినాడు. డమరులమీద 'విభజించి పాలించు' విధానాన్ని ప్రయోగించి రాజ్యంలో ఎంతో కొంత శాంతిని సాధించినాడు. కాని అది తాత్కాలికమే. ఎడతెగని కుట్రలతో, కూహకాలతో ఈ మాత్రపు శాంతికూడా విచ్ఛిన్నమై పోయింది. రాజ్యం అస్తవ్యస్తంగా తయారైంది.

రాజ తరంగిణిలో చిత్రితమైన చివరి సంవత్సరాల (క్రీ.శ. 1148 - 49) పరిస్థితులను బట్టి, పూర్వులతో పోల్చిచూస్తే, జయసింహుడు కొంత శాంతిని అనుభవించినాడనే చెప్పవచ్చు. ఆయన తన పెద్ద కొడుకైన

గుల్హణుని లోహరాకు రాజుగా పంపినాడు. క్రీ.శ. 1130 లో భిక్షాచరుడు బంధింపబడి హతుడైనాడు. రకరకాల వారసులు గూడా నిహతులైనారు. ఈ కాలంలో జయసింహుడు నెలకొల్పిన కొన్ని పవిత్ర నిర్మాణాలను, కట్టడాలను; వాటి ననుసరించి ఇతర మంత్రులు, రాజకుటుంబీకులూ సాగించిన నిర్మాణాలనూ కల్హణుడు రాజతరంగిణిలో వివరించినాడు.

ఈ విధంగా పలు సంఘటనలను బట్టి చూస్తే, కల్హణుని జీవితమంతా దాదాపుగా అంతఃకలహాల కాలంలోనే గడిచిందని స్పష్టమే. అయితే, ఇవేవీ ఆయన రచనా వ్యాసంగాన్ని ఏ విధంగానూ ఆటంకపరచలేదు. రాజకీయ సంఘటనల్లో నిరంతరంగా వస్తున్న మార్పులు కల్హణుని జీవితాన్ని, కార్యక్రమాన్ని ఏ విధంగా ప్రభావితం చేసినవనే పరిశీలన ఆసక్తికరమైనదే. ఈ రాజులను సేవించిన అధికారులలో కల్హణుని తండ్రి చంపకుని పేరు విన్పించదు. ఇదివరకే చెప్పుకొన్నట్లుగా చంపకుడు హర్షుని రాజ్యకాలంలో ఒక ఉన్నతాధికార పదవిని నిర్వహించినాడు. అయితే, హర్షుని మరణం తరువాత చంపకుడు తనంతట తానే పదవినుండి విరమించుకున్నాడా, లేదా అనేది మాత్రం రాజతరంగిణిలో స్పష్టంగా ఎక్కడా లేదు.

కల్హణుడు ఏరాజు వద్దకూడా, ఏ విధమైన అధికార పదవిని గూడా చేపట్టలేదనే అంశం రాజతరంగిణి స్పష్టంగా తెలియపరుస్తుంది. రాజసభలతో ఆయనకు అత్యంత పరిచయమున్నాగూడా ఏ రాజు పరిపాలనలోనూ ఆయన ఏ విధమైన అధికారాన్ని అనుభవించలేదు. రాజులను పొగడటమనే అనూచాన సంప్రదాయాన్ని ఆయన పాటించినట్లు సూచనగా కూడా రాజతరంగిణిలో లేదు. జయసింహుని రాజ్యకాలంలో రాజతరంగిణి రచన సమాప్తమైనది. కాని, ఆ రచన జయసింహుని ఒత్తిడివల్ల గానీ, పూర్వుల ఒత్తిడి వల్లగానీ జరిగిన సూచన కూడా ఎక్కడా లేదు. జయసింహుడు సాధించిన, నిర్వహించిన కార్యాలను కల్హణుడు ఉదాత్త పదజాలాన్ని ప్రయోగిస్తూ చేసిన 'పొగడ్త' ఉచితమే ననిపిస్తుంది. జయసింహుని పొగడినా కూడా, ఆయన తండ్రి సుస్సలుని లోపాలను వెల్లడించటంలో కల్హణుడు ఏ మాత్రమూ వెనుకాడలేదు. అంతేకాదు, జయసింహునికీ, ఆయన తండ్రికి గూడా శత్రువైన భిక్షాచరుని పరాక్రమాన్ని కీర్తించటానికి కూడా సంకోచించలేదు. "క్లిష్టపరిస్థితులలోనుంచి తన సేనలను రక్షించుకోవటంలో ఆయన (భిక్షాచరుడు) ఎప్పుడుకూడా అలసిపోలేదు.

తనను తా నెప్పుడుకూడా పొగడుకోలేదు. ఎన్నెన్నో కష్టాలు పడ్డాడు. మహా సాహసికుడు. నిజానికి, భిక్షాచరునివంటి వాడెక్కడా కన్పించడు" (VIII-1017) అన్నాడు కల్హణుడు. ఇంకా ఇట్లా అన్నాడు: "అరాచకత్వం సాగినకాలంలో ఆయన ఎవరికైతే ఉరిత్రాడుగా మారినాడో, ఆ కారణం గానే ఎవరి సర్వ వినాశానికి కారణమైనాడో వారే ఆయన పరాక్రమాన్ని అసక్తికరంగా పొగడినారు" (VIII-1776). రాజ్యవారసులమని చెప్పుకొనే ఇతరులందరిలోనూ కల్హణుని సానుభూతి పొందగలిగినవాడు భోజు డొక్కడే.

కాశ్మీరీయులను అధ్యయనం చేయటానికి విస్తృతావకాశం లభించిన కల్హణుడు అతిశయోక్తులేవికూడా లేకుండా వారిని వాస్తవికంగా చిత్రించినాడు. ఆయన కేవలం చారిత్రకుడు మాత్రమే కాదు, వివిధ వనమయమైన ఆ లోయప్రాంతాన్ని, అక్కడ హిమకిరీటాలు ధరించి సమున్నతంగా నిలిచిన పర్వతశిఖరాలనూ, అందమైన పచ్చిక బయళ్ళనూ, స్వచ్ఛమైన సెలయేళ్ళనూ, నదులనూ, సుమసంపదలనూ అమితంగా ప్రేమించిన కవికూడా. తన నాటి మనుష్యులనూ, మర్యాదలనూ జీవం తంగా చిత్రించినాడు. అందుకే ఆయన రచించిన చరిత్ర కావ్యం ద్వారా గడిచిన ఆ కాలమంతా ఈ నాటికీ మనకు సజీవంగా దర్శనమిస్తున్నది.

సునిశిత పరిశీలకుడైన కల్హణుడు తన నాటి కాశ్మీరీయుల శారీరక, నైతిక బలహీనతలను గుర్తించటంలో విఫలుడు కాలేదు. ప్రధానంగా సమాజంలోని అట్టడుగు వర్గాలవారి విషయంలో మరింత శ్రద్ధ వహించి నాడు. కాశ్మీరుయోధుల అంతస్సత్వం లేని ఆత్మస్తుతిని బహిరంగపరచి నాడు. కొందరు యోధులు తురుష్కులను చూచి గజగజ వణికిపోయినారు. వెనుదిరిగి పారిపోయినారు. కొన్ని సందర్భాలలో సైన్యాలన్నీ దిక్కా మయంగా చెదరిపోయినవి. అంతేకాదు, (VIII-324) సేనాపతి "కుక్క వలె, దానితోకవంటి కత్తిని ముడుచుకొని పారిపోయినాడు." కల్హణుడు దేశీయమైన సేనల పరాక్రమాన్ని అంత గొప్పదిగా అంచనా వేయలేదనే అనిపిస్తుంది. పైగా, తన కాలంలో యుద్ధాలుచేస్తూ రాజులూ, రాజ కుమా రులూ కలిగించిన దేశక్షోభతో కల్హణుడు విసిగిపోయినాడు. ఇదిట్లా ఉండగా, మరొకవైపు, ఈ యుద్ధాలు చేసే రాజకుమారులకు భారత

దేశంలోని అన్యప్రాంతాలలోనుంచి వచ్చి తోడ్పడిన రాజపుత్రవీరుల శౌర్యాన్ని, కూలిసైనికుల పరాక్రమాన్ని ఘనంగా కీర్తించినాడు.

మరి, రాజ్యాధికారం కోసం పాలకుల–పాలనాశాపరుల మధ్యసాగే కుట్రలూ, కుతంత్రాలూ, యుద్ధాలనుగూర్చి సామాన్య ప్రజానీకానికి పట్టింపు లేకపోవటం కూడా కల్హణుడు గమనించినాడు. ఆయన డమరులను నిశితంగా విమర్శించినాడు. భూస్వాములైన ఆ డమరులే హర్షుని పతనానికి కారకులు. కల్హణుని కాలంలో కాశ్మీరులోయ ప్రాంతమంతటా వ్యాపించిన రాజకీయ విపర్యయాలన్నింటికీ వెనుక ఒత్తాసుగా డమరులున్నారు అవంతివర్మ, డిడ్డుడువంటి సమర్థులైన పరిపాలకులు విచ్చలవిడిగా వ్యవహరించే డమరులను అణచివేయటానికి చేసిన ప్రయత్నాలు పాక్షికంగా మాత్రమే ఫలించినవి. అయినా కూడా, నిజానికి, వారి జీవనాధారం భూస్వామ్యవర్గాల ఆర్థిక విధానంమీదనే ఆధారపడింది. భూమి దున్నే రైతు భూస్వామికి కౌలుదారుగా ఉండే సమాజంలో భూస్వామ్యవర్గాధికారం శక్తిమంతం కాక తప్పదు. భూస్వాములు న్యాయాన్యాయాలతో నిమిత్తం లేకుండా పన్నులు, కౌళ్లు వసూలుచేసి సంవత్సరాని కొకసారి కొంతభాగం రాజుకు చెల్లిస్తుంటారు. కొందరు డమరులు తమ భూములమీద వచ్చే కౌళ్లద్వారా విస్తృత సంపదను పెంచుకున్న విధానాన్ని కల్హణుడు స్పష్టంగా వివరించినాడు. హృదయం లేని కఠినులైన భూస్వాముల మొరటుదనాన్నీ, అనాగరక చర్యలనూ కల్హణుడు బట్టబయలు చేసినాడు. అంతేకాదు, చిన్నచిన్న అధికారాలు నిర్వహించే కాయస్థుల అణచివేతలను గూడా బహిరంగపరచినాడు. రాజకీయంగా నిశితబుద్ధులైన పురోహిత బ్రాహ్మణులు తాము వాంఛించిన పనులను బలహీనులైన పరిపాలకుల ద్వారా నెరవేర్చుకొనటానికి చేసే ప్రాయోపవేశాల స్వరూపాలనుగూడా కల్హణుడు గమనించినాడు. వీరి పిరికితనంతోగూడిన ఆత్మస్తుతిని అనేక సందర్భాలలో వెక్కిరించినాడు.

లలితాదిత్యుని వంటి శక్తిమంతులైన రాజుల పరిపాలనలో కూడా ప్రజలు బానిసలుగానే బతికినారు. ఇదివరకే చెప్పినట్లుగా, డమరులు ప్రాతినిధ్యం వహించే భూస్వామ్య వర్గంవారు, అట్లాంటి మరికొందరూ జీవితంలో ఉత్తమపదార్థాలన్నీ అనుభవించేవారు, రాజపురుషులు, ఉన్నతాధికారులు ప్రసిద్ధమైన కాశ్మీరు వంటకాలను రాజభోగంగా అనుభవించేవారు. 'వేయించిన మాంసం,' 'మంచుతో శీతలీకరించి పూలతో సువాసితం చేయ

బడిన తేలికపాటి మద్యం' వారికి విరివిగా లభించేవి. మద్యపానం అతి ప్రాచీనకాలంనుంచీ వస్తున్నదే. ఉత్సవ సందర్భాలలో మద్యపానం సాగే దని 'నీలమత పురాణం'లో చెప్పబడినది. ఇక, సామాన్యప్రజలకు బియ్యం, హాఖా (ఒకానొక కాశ్మీర ధాన్యం) ప్రధానాహారం. కరువు రోజులలో అవి కూడా చాలామందికి దొరికేవి కావు. బీదలను, సాంఘిక-రాజకీయ దుర న్యాయాలకు గురిఅయిన వారినిగూర్చి కల్హణునికున్న అపారమైన సానుభూతి రాజతరంగిణిలో స్పష్టంగా కన్పిస్తుంది. క్రూరుడూ, కామావిష్టుడూ అయిన వరాదిత్యునిగూర్చి (IV-392-94) కల్హణుడు వ్రాసినాడు. వరాదిత్యుడు 'మ్లేచ్ఛులకు[1] మనుష్యులను అమ్మేవాడు'. బానిస వ్యాపారం ప్రత్యేకంగా 'మ్లేచ్ఛులకే తగినదిగా' చేసినాడు.

చుట్టు ప్రక్కలనున్న పర్వత ప్రాంతాల మీద కాశ్మీరు అధిపత్యం సాగినంతకాలం (7 నుండి 9 వ శతాబ్దం చివరివరకు) విదేశాలతో కాశ్మీరు వ్యాపారం ఉచ్చదశలో ఉండేది. ఆనాడా వ్యాపారమార్గాలు మధ్య ఆసియా దాకా సాగినవి. అయితే, విదేశ వ్యాపారంతో కూడా ముడిపడిన దేశీయ వ్యాపార వైభవం క్రమంగా పదవ శతాబ్దారంభంనుంచి క్షీణించ సాగింది. దాని ఫలితంగా, కల్హణునికి చాలా కాలానికి ముందే, కాశ్మీరులో ధన సమృద్ధితో శక్తిమంతంగా ఉండే వ్యాపారవర్గ ప్రాధాన్యం తగ్గటం మొదలు పెట్టింది. వర్తకులు 'స్వాభావికంగా మోసగాండ్రు' అని రాజ తరంగిణి వ్యక్తీకరిస్తుంది. 'తమ వద్ద దాచపెట్టిన సొమ్మును అన్యాయంగా అపహరించే వర్తకులు పవిత్రగ్రంథపు వచనాలను వినటంలో ఎక్కువ ఆసక్తి ప్రదర్శిస్తా'రని వారి ప్రవృత్తిని కల్హణుడు వ్యంగ్యంగా అధిక్షేపించి నాడు. డమరులు వ్యాపారరంగంలో కూడా ప్రవేశించటం వల్ల వర్తకులు మోసా లవలంబించి ఉంటారు.

---

1. 8 వ తరంగంలో కూడా మ్లేచ్ఛుల ప్రస్తావన ఉన్నది వారు సరిహద్దుల లోని కొండజాతి తెగలకు చెందినవారు. భోజునికి వారు సహాయం చేసే వారు. ఆనాడు మ్లేచ్ఛులను అంత గొప్పగా చెప్పుకొనేవారు కాదు. ఈ నాటికీ కాశ్మీరు పండితులు అపరిశుభ్రంగా, మోటుగా, నాస్తికులుగా ఉండేవారిని గూర్చి మ్లేచ్ఛపదాన్ని ఉపయోగిస్తూ ఉండటం ఈ అంశాన్ని సూచిస్తుంది. అయితే కల్హణుడు గ్రీకులను గూడా ఈ పదంతో వ్యవహరించి ఉంటాడు.

వ్యవసాయం, వాణిజ్యం సాగించేవారేగాక, సమాజాన్ని ప్రయోజన వంతంగా సేవించే ఇతర వర్గాలు కూడా ఎన్నో ఉన్నవి. ఉపాధ్యాయులు, జ్యోతిష్కులు, వైద్యులు, కూలీలు, వృత్తిపనులవారు, నీటిపనివారు, కార్మికులు మొదలైనవి వర్గాలు. సైనికులుకూడా అనేకమంది. ఇదికూడా ఒక వృత్తి. ఈ వృత్తి పనివాళ్ళలో వర్గాలు, ఉపవర్గాలుకూడా ఉండేవి.

పాలనా వ్యవహారాలకు సంబంధించి రాజోద్యోగాలలోని అధికారులను రెండు ప్రధానవర్గాలుగా విభజించవచ్చు-పాలనా నిర్ణయాలు చేసేవారు; ఆ నిర్ణయాలను అమలుపరిచేవారు. ఈ రెండవ వర్గంవారిని 'కాయస్థులు' అని వ్యవహరించేవారు రాజ్యంలోని ఉన్నతాధికారులు, పెద్ద మొత్తాలలో వేతనాలు పొందేవారు కొందరు పెద్ద పెద్ద ఆస్తులను కూడా సంపాదించుకొనేవారు. గృహకృత్యాధిపతి లేదా మహత్తమ, పరిపాలక, మార్గేశ లేదా మార్గపతి, శౌల్కిక, నియోగి, నగరదివిర, గ్రామదివిర మొదలైన ఉద్యోగులు కాయస్థవర్గీయులు. ప్రధానంగా ఈ వర్గంపని పన్నులు వసూలు చేయటం. కాయస్థులు తమ వేతనాలను రాజకోశంనుండే పొందేవారు. అయినా, తప్పుడు దారుల్లో తమ ఆదాయాలను పెంచుకునేవారు. జయాపీడుని రాజ్యకాలంలో బలహీనులైన పాలితులనుండి తాము అపహరించిన ఆస్తులలో చాలా తక్కువ మొత్తాలనే రాజుకు అందించేవారని కల్హణుడంటాడు. ఇతరుల రాజ్యకాలాలలో గూడా వీరు ప్రజాపీడన సాగిస్తూనే ఉండేవారు. దానికి కారణం ఆ రాజ్యకాలాలలో తరచుగా రాజులు మారుతూ ఉండటంవల్ల రాజకీయ అస్థిరత్వం నెలకొని ఉండటమే. రాజు మారినప్పుడల్లా, రాజుకు అభిమానపాత్రులైనవారు ఎప్పటికప్పుడు క్రొత్తగా నియమింప బడేవారు.

రాజతరంగిణి మొదటి మూడు తరంగాలలో కాయస్థుల ప్రస్తావన కన్పించదు. నాల్గవ తరంగం మొదలుకొని వారి విషయాలు విపులంగా, క్రొత్త క్రొత్త పదవీనామాలతో తెలియవస్తున్నది. జనాభా పెరుగుదల కారణంగా భూమిమీద ఎక్కువ ఒత్తిడిపడటంతో వ్యవసాయానికి యోగ్యమైన భూమిని ప్రజలకు పంచిపెట్టటానికీ; రాజస్వాన్ని, పన్నులనూ వసూలు చేయటానికీ అధికారులను అధికసంఖ్యలో రాజు నియమించవలసి వచ్చేది. కర్కోటుల రాజ్యపతనానంతరం అన్నివిధాలుగా విదేశాలతో, ఇతర ప్రాంతాలతో వర్తక వ్యాపారాలు పూర్తిగా స్తంభించిపోయినందువల్ల కేవలం భూమి

మీది రాబడి, పన్నులమీదనే రాజ్యం ఆధారపడవలసి వచ్చింది. భూమి ఆస్తులను పర్యవేక్షించటం, వాటిమీద రాజ్యస్యాన్ని సాధ్యమైనంత అధికంగా నిర్ణయించి వసూళ్లు చేయటంవంటి పనులకోసం కాయస్థుల నెక్కువగా ఉద్యోగాల్లో నియమించవలసివచ్చేది.

కాయస్థులు బ్రాహ్మణులని కల్హణుడనటం విచిత్రమైన అంశం. ఎందుకంటే – ప్రాచీన కాశ్మీరు దేశంలో 'కాయస్థ' పదం ప్రత్యేకించి ఏ కులానికీ, వర్గానికీ చెందింది కాదు. కులాలతో, తెగలతో, వర్గాలతో నిమిత్తం లేకుండా 'కాయస్థ' అనేది ఒక పదవిగా, ప్రజలందరూ పొందదగిన ఉద్యోగంగానే అనిపిస్తుంది. ఒక తోటమాలికూడా 'కాయస్థుడు' కావచ్చు (VII-39, 40). ఒక చిన్న పదవిని నిర్వహించే కాయస్థుడు అంతకన్నా పెద్ద పదవిని పొందటానికి అర్హుడే.

ఉచ్చలుడన్న రాజు 'ప్రజాక్షేమానికి అంకితమైనవాడు'. అంతేకాదు; "ఐశ్వర్య సంపాదన విషయంలో స్వాభావికంగా దురాశాపరుడు కాడు" (తరంగం-VIII) ప్రజాపీడన పరాయణులైన కాయస్థుల బారినుండి ప్రజలను రక్షించటానికి, పీడకులైనవారిని ఉద్యోగాలలో నుంచి తొలగించటం వంటి అనేక చర్య లాయన తీసుకున్నాడు. ఒక సందర్భంలో కాయస్థులను గూర్చి కల్హణుడు ఇట్లా వివరించినాడు: (తరంగం-VIII):

> నిజానికి ప్రపంచాన్ని అతి వేగంగా హతం చేయగల కలరా మొదలైన రోగాలు, జూదాలు మొదలైనవాటివలె అధికారులు కూడా ప్రజలకు అంటువ్యాధులుగా తయారైనారు. 88
>
> ఎండ్రకాయ తండ్రిని చంపుతుంది. చెదపురుగు తల్లిని నాశం చేస్తుంది. కాని, కృతఘ్నుడైన అధికారి పదవిలోకి రాగానే ప్రతి ఒక్కరినీ నాశం చేస్తాడు. 89
>
> ...చిత్రమేమిటంటే, పాలనోద్యోగి - విషవృక్షం తాము అభివృద్ధి చెందిన స్థానాన్నే నాశం చేస్తారు. వారి దరి చేరటం అతి ప్రమాదకరం. 91
>
> తమ దుష్కృత్యాలు కారణంగా ఉద్యోగాలలో నుండి తొలగింపబడిన సుహేలు డనేవాడిని, ఇంకా ఇతరులను కారాగారాల్లో ఉంచి, బలవంతంగా వారికి రాజు నారచీరలను కట్టించినాడు. 93

ఆ రాజు మరొక ఉద్యోగికి తల సగం గొరిగించి, సున్నం పూయించి, బట్టలు విడిపించి, బండికి కట్టించి వీధులవెంట లాగించినాడు. 97
ఖోడతలల నలంకరించి, వాళ్ల నింద్యమైన వెక్కిరింత పేర్లను డప్పులమీద పలికిస్తూ ఉండే ఆ అధికారులు సర్వత్రా అపకీర్తి పాలైనారు. 98

అయితే, కాయస్థులందరూ ఇట్లాంటివారేనని కాదు. విచక్షణా జ్ఞానంతో బాధ్యతాయుతంగా ప్రవర్తించే ఉత్తములైన కాయస్థులుకూడా చాలామంది ఉన్నారు. ఒకసారి లలితాదిత్యుడు (తరంగం-IV) తన రాజధానియైన పరిహాసపురంలో పానగోష్ఠిమగ్నుడై ఉన్నాడు. పాతనగరమైన ప్రవర పురం దీపాలతో ప్రకాశిస్తూ కన్పించిం దాయనకు. ఆ నగరాన్ని వెంటనే తగులబెట్టవలసిందిగా తన మంత్రుల నాజ్ఞాపించినాడు. అయితే, వారు గుట్టిపుదండును పంపి దూరంగా గడ్డివాములను తగులబెట్టించినారు. అది చూచి తాగినమైకంలో ఉన్న రాజు తన అజ్ఞ పాటింపబడిందని సంతోషించి నాడు. కాని, మరునాడు లలితాదిత్యుడు అసలు విషయం తెలిసి, మంత్రులు చేసినపనికి వారిని అభినందిస్తూ-"తాగిన మైకంలో ఉండి నోటిమాటగా ఇచ్చే నా ఆజ్ఞలను ఎప్పుడూ అమలు చేయగూడదు" అన్నాడు. ఈ సందర్భంలో పరిశీలనాపూర్వకమైన కల్హణుని మాటలు ఈనాటి పాలకోద్యోగులకు కూడా ఎంతో ఉద్బోధకమైనవి :

తమ ప్రయోజనాలనూ, లాభాలనూ, సౌకర్యాలనూ సాధించుకొనటానికి స్త్రీవ్యసనంగల ప్రభువును అమర్యాదకరమైన వినోదాలకు ప్రేరేపించే ఉద్యోగులు పరమ నీచులు. తప్పుదారిపట్టిన ప్రభువును తమ జీవితాలనుగూడా లక్ష్యంచేయక, బలవంతంగానైనా సక్రమ మార్గానికి మళ్లించే ఉద్యోగులవల్లనే భూమండలం పవిత్రంగా ఉంటుంది. 321

కులాలంటూ ప్రత్యేకంగా ఏవీ లేకపోయినా గూడా, రాజతరంగిణిలో ఎన్నో అవరకులాలు పేర్కొనబడినవి. నిషాద, కిరాత, కైవర్త, డోంబ, స్వపాక, చండాల-మొదలైనవి ఆ అవరకులాలు. ఇతర ప్రాంతాలనుండి ఈ లోయప్రాంతానికి వచ్చిననాటినుండి కూడా అన్నిరకాల గౌరవాదరాలు పొందుతూ, విశేషాధికారాలను అనుభవిస్తున్నది బ్రాహ్మణవర్గం. ఈ

వర్గంలో చాలామంది పవిత్ర గ్రంథాధ్యాపకులుగా, పురోహిత కార్యాలను నిర్వహించేవారుగా తమ జీవితం గడిపేవారు. అయినా, సైన్యంలోనూ రాజకీయ వృత్తులలోనూ చేరినవారు చాలామంది ఉండేవారు. పురోహిత-పూజారులకు అధిక గౌరవం లభించేది. దేవమాన్యాలమీద వచ్చే ఆదాయాలను వారు స్వేచ్ఛగా అనుభవించేవారు. ఆ మాన్యాలమీద పన్నులు పడేవి కావు (II-132, V-58-62). కొన్ని సందర్భాలలో వారు పూలూ, ధూప ద్రవ్యాలూ అమ్మేవారు మరికొందరు యాత్రికులకు దేవదర్శనాదులలో సహకరిస్తూ ఉండేవారు.

నిషాదులు ఆదిమ తెగలకు చెందినవారై ఉండిఉంటారు. మరొక అవరజాతివారైన కిరాతులు అడవులలో జంతువులను వేటాడుతూ బతికేవారని కల్హణుడన్నాడు. డోంబులను తరుచుగా దాసజాతికి చెందినవారనీ, అప్పుడప్పుడు చండాలురతో[1] కలిసిపోయిన జాతివారనీ కల్హణుడు అన్నాడు. డోంబులు గాయకులు, సంగీతజ్ఞులని కూడా అన్నాడు. జానపదగాయకులుగా వారు తమ జీవితం గడిపేవారు

భారతదేశంలో ప్రసిద్ధమైన చాతుర్వర్ణ్య విభాగం కాశ్మీరు ప్రాంతానికి తెలియదు. క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణాలక్కడ లేవు. కాశ్మీరీయులలో వృత్తులను బట్టి వర్గవిభజన జరిగింది. భూవ్యవహారాలతో సంబంధించి ఉండే డమరులను గూర్చి ఇదివరకే ప్రస్తావించుకున్నాము. పరిశ్రమలు, వాణిజ్యం వర్తకుల అదుపులో ఉండేవి. వారినిగూర్చి కూడా ఇంతకుముందే వివరించుకున్నాము. సంపద పంపిణీ విధానంమీద ప్రభుత్వ అజమాయిషీ ఉన్నాగూడా, ప్రాచీన కాశ్మీరదేశంలో వ్యాపార విషయంలో గాని, ఆస్తుల విషయంలో గాని, ప్రభుత్వం జోక్యం దాదాపుగా ఉండేది కాదు. అయితే సంపదను ఉత్పత్తి చేసేవారు వారి శ్రమ ఫలితాన్ని సంపూర్ణంగా వారుమాత్రమే అనుభవించే అవకాశం మాత్రం లేదు. కొంతమంది విశేషాధికారం గల వ్యక్తులకు అందులో కొంతభాగం లభించేది. ఇదంతా సంపద పంపిణీ విధానంమీద ఆధారపడి ఉండేది.

---

1. చండాలురకు సంబంధించినంతవరకు, వారు కిరాయి హంతకులుగా ఉండేవారని కల్హణుడు, అల్బెరూని కూడా అన్నారు. ఈనాటికి చండాల పదం అపరిభ్రంగా, తుచ్ఛంగా జీవించే వ్యక్తిని గూర్చి కాశ్మీరు వ్యవహారంలో ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఆసియనులు క్రైస్తవ మతయుద్ధాలలో మునిగి ఉన్న కాలాన తన రచన సాగిస్తున్న కల్హణుడు - బ్రాహ్మణ సమూహం, రాజోద్యోగులు, 'చంద్రవదనలైన' స్త్రీలు పరివేష్టించి రాగా పాత రాజధానియైన ప్రవరసేన పురానికి దగ్గరగా అశోకుడు నెలకొల్పిన శ్రీనగరానికి రాజు వేంచేసిన సంఘటనను చిత్రించినాడు. ఆ నగరం సరిహద్దులు పేర్కొన్నాడు. అవి ఈనాటి పాఠకునికి గూడా గడిచిన కాలాన, కేవలం దేవాలయాల్లోనూ మతసంస్థలలోనూ తప్ప, అంతటా అలుముకున్న అంతఃకలహాలనూ, రాజ సభలలోని కుట్రలనూ గుర్తుకు తెస్తున్నవి. ఆ నగరానికి సరిహద్దులు - గోప గిరి (ప్రస్తుతం 'తసీకార్' అని వ్యవహారం), శారికపర్వతం (హరి పర్వతం), ఇంకాముందు 'అత్యద్భుతమైన మార్తాండ దేవాలయం.'

కాశ్మీరు స్త్రీల జీవనరీతినిగూర్చి స్పష్టమైన చిత్రణ రాజతరంగిణిలో కన్పిస్తుంది. స్త్రీకి బాల్యంలో పుట్టింట నిరాటంకంగా, ఉదారంగా విద్యాభ్యాసం సాగేది. స్త్రీలు సంస్కృత ప్రాకృత భాషలలో అనర్గళంగా మాట్లాడగలిగే వారు. రాణులు, ఇంకా మరికొందరు స్త్రీలు ప్రజాజీవన రంగంలో సాధిం చిన విజయాలను గమనిస్తే, దానికి తగిన శిక్షణ వారికి లభించినట్లు చెప్ప వచ్చు. రసిక ప్రవృత్తిగల కల్హణుడు తన ధోరణిలో స్త్రీ స్వరూపాన్ని మెచ్చుకొనేవాడే. స్త్రీ శరీర నిర్మాణంలోని సౌందర్యాన్ని ఆయన ప్రేమించి నాడు. ప్రధానంగా కాళిదాసువలె స్త్రీ భుజసౌందర్యాన్ని అభిమానించేవాడు. మొదటి తరంగంలో నాగరాజు కూతురును ప్రస్తావించి 'అత్యద్భుత సౌందర్యవతి అయిన ఆ అమ్మాయి చేతులు పద్మాలవలె ఉన్న'వని అంటాడు. బ్రాహ్మణుని భార్య అందమైన చిన్నిచిన్ని బొమ్మలు చిత్రించ బడిన అరచేతి బంగారు ముద్రను నారునిమీదవేసి అతనిని మోహపరవశుని చేసిందంటాడు. ఎనిమిదవతరంగం, 366 వ శ్లోకంలో ఉచ్ఛలుని రాణిని వర్ణిస్తూ ఈ విధంగా అన్నాడు : "ఓహో! అతిగూఢ హృదయలైన స్త్రీ లెంతటివారు! అలలవంటి కేశాలలోని వక్రత్వం, కన్నులలోని అద్భుతమైన వగలు, గుండ్రనిస్తనాలలోని కాఠిన్యం - ఇవన్నీ వారి గుండెల్లో గూడు కట్టుకొని ఉన్నవి. వారి నెవరూ అర్థం చేసుకోజాలరు." స్త్రీ మాయను చిత్రించిన పలువురు గొప్పకవుల ధోరణిలో ఆ రాణులనుగూర్చి కల్హణు డింకా ఇట్లా అంటాడు: "ఎంతగా అవిశ్వాస్యలైనాసరే, తమ భర్తలను చంపినవారైనా సరే, చివరకు వారు (స్త్రీలు) అతిసునాయాసంగా అగ్నిలో

ప్రవేశించగలరు. కాగా, ఎవరుకూడా స్త్రీల విషయంలో ఏమీ నిశ్చయం చేయ జాలరు!"

కేవలం స్త్రీల సౌందర్యాన్ని మాత్రమే మెచ్చుకుంటూ కల్హణుడు ఉండిపోలేదు. వారిని గూర్చి చాలా అంశాలు చెప్పినాడు. స్త్రీలు స్వతంత్రలు. స్త్రీలకు ఆర్యు లంగీకరించిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం పన్నెండవ శతాబ్దందాకా అమలు జరుగుతూనే వచ్చినవి. కాశ్మీర స్త్రీలకు కొన్ని ఆస్తి హక్కులు, స్వతంత్ర న్యాయప్రతిపత్తి ఉండేవనిపిస్తుంది. మగ వారి కుదృష్టులనుంచి స్త్రీలను కాపాడే 'పర్దా'కు సరియైన పర్యాయపదం సంస్కృతభాషలో కన్పించదు. భారతదేశంలో పరదా పద్ధతిని ముస్లిములు అమలులోకి తెచ్చినారు. 'హారెమ్' (అంతఃపురమని తాత్పర్యం) అనే పదానికి కూడ సంస్కృతంలో సమానపదం లేదు. భారతదేశంలోని ఇతర ప్రాంతాల రాజులవలెనే కాశ్మీరు రాజులుకూడా పలువురు స్త్రీలను వివాహమాడేవారు. ఆ స్త్రీలు అంతఃపురం (లోపలి నివాస భూమి), లేదా శుద్ధాంతం (దోషరహితమైన అంతర్భాగం) లో ఉండేవారు. రాజతరంగిణిని గమనిస్తే స్త్రీలను విడిగా ఉంచటం, లేదా వేరుచేసి నిలువెల్లా ముసుగులు వేయటం వంటి పద్ధతులు ఏ రూపంలోనూ ఉండేవి కావని తెలుస్తుంది. ప్రాచీన న్యాయ సంప్రదాయం ప్రకారం పట్టాభిషేకవేళ రాజుతోబాటు రాణినిగూడా పవిత్ర నదీజలాలతో అభిషేకించేవారని కల్హణుడు వ్రాసినాడు. రాణులకు గూడా వారివారి సలహాదారులు ప్రత్యేకంగా ఉండేవారు. కొన్ని నిధులు కూడా వారికి ప్రత్యేకించి కేటాయింపబడి ఉండేవి, డబ్బు ఉండేది. తన సలహాదారుల సహకారంతో రాజ్య వ్యవహారాలలో గూడా రాణి క్రియాశీల పాత్ర నిర్వహిస్తూ ఉండేది. దిద్ద, సగంధ, సూర్యమతివంటి రాణులు పురుషులతో సమంగా రాజ్యపాలనలో వ్యవహరించేవారనటంలో ఆశ్చర్యమేమీ లేదు. రాణికంటె తక్కువస్థాయి స్త్రీలుగూడా రాజ్య వ్యవహారాల్లో ప్రముఖ పాత్ర నిర్వహించేవారని గూడా తెలుస్తున్నది. అట్లాంటి కొందరిని కల్హణుడు పేర్కొన్నాడు. రాజులు రాణులనుగా భార్యల నెన్నుకొనటంలో వర్ణ, వర్గ వివక్షణకూడా ఏమీ ఉండేదికాదు. చక్రవర్మ (క్రి. శ. 923 - 933) అవర జాతిదైన డోంబస్త్రీని వివాహమాడి ఆమెను 'పట్టపురాణి'గా ప్రకటించినాడు. రాజ స్త్రీలమధ్య మెలగుతూ, వింజామరలతో వీవబడే విశేష గౌరవాలను ఆమె (V-387) అనుభవించింది. ఆమె రాజ్యంలోకి ఎట్లా వచ్చిందో,

శ్రీనగర సమీపంలోని పవిత్రమైన రామస్వామి దేవాలయంలోకి ప్రవేశం ఆమెకు ఏవిధంగా లభించిందో, ఆమె బంధువులు మంత్రులుగా ఏ రీతిలో నియమింపబడినారో - ఈ అంశాలన్నీ కల్హణుడు వివరించినాడు. ఈ వివాహాన్ని సమర్థించి వివిధ పదవులు పొందినవారు అనంతర కాలీన రాజుల వద్దకూడా మంత్రులుగా సాగినారు. విజయాదిత్యుడు, ఆయన సోదరుడు చంద్రాపీడుడు - భర్తకు విడాకులిచ్చి వచ్చిన స్త్రీ వలన రాజుకు కలిగిన సంతానం. ఆమె ఢిల్లీ సమీపంలోని రోహతక్ ప్రాంతానికి చెందిన బనియా స్త్రీ. అయినా, ప్రసిద్ధులైన ఈ రాజకుమారులను కల్హణుడు నిందాపూర్వకంగా ఒక్కమాట గూడా అనలేదు, ఆక్షేపించలేదు.

వితంతువు పవిత్ర, నిస్సంగ జీవితం గడుపవలెనని వాంఛించేవారు. ఏ విధమైన ఆభరణాలుగానీ, పరిమళ ద్రవ్యాలుగానీ, విలాసాలుగానీ అనుభవించే అనుమతి ఆమెకు ఉండేదికాదు. ఆమె భర్తయొక్క స్థిరాస్తికి కొడుకులకు బదులుతానే వారసురాలవుతుందని చెప్పబడింది. భర్త మరణించగా సహగమనం(సతి) చేయని స్త్రీలనుగూర్చి కల్హణుడు ఏ అభిప్రాయమూ వెలువరించలేదు. 'సతి' (సహగమనం - మరణించిన భర్తతోపాటు అగ్నికి ఆహుతి కావటం) అనే ఆచారం చాలా ప్రాచీనకాలంనుండే ఉండేదంటా డాయన. శంకరవర్మ మరణించినప్పుడు ఆయనతోబాటు సహగమనంచేసిన సురేంద్రవతి, మరొకరిద్దరు రాణుల విషయం ఈ సందర్భంలో ఉదాహరించినాడు (V-266). ఆ విధంగానే ఆచరించిన త్రైలోక్యదేవి, సూర్యమతి, కుముదలేఖలనుగూర్చికూడా వ్రాసినాడు. ఉచ్చలుడు మరణించి, అతని దహనం జరిగిన తరువాత కొన్నాళ్లకు ఆయన భార్య జయమతి చితిలో ప్రవేశించింది. ఈ 'సతి' సంప్రదాయం రాజస్త్రీలకు మాత్రమే పరిమితం కాదు. వేశ్యలు, ఉంపుడుగత్తెలు కూడా వారిని పోషించిన, ఉంచుకొన్న వ్యక్తులు రాజులైనా సరే, మంత్రులైనా సరే, లేదా ఉన్నతాధికారులైనా సరే, వారిననుసరించి 'సతి' అయిన కొన్ని సందర్భాలను కల్హణుడు ప్రస్తావించినాడు. ఈ సతీసంప్రదాయ పరిశీలనలో, దిల్హభట్టారిక తన సోదరునితో బాటు 'సతి' అయినదని చెప్పబడిన (VIII-448) అంశం నిజంగా ఆసక్తికరమైనదే.

స్త్రీలనుగూర్చి ఇప్పటిదాక చెప్పబడినదంతా ఒక పార్శ్వం కాగా, దీనికి రెండవ పార్శ్వం కూడా ఉన్నది. కొన్ని తరగతుల స్త్రీలలో విప

రీతంగా వ్యాపించిన అవినీతిని విశదపరిచే అంశాలు రాజతరంగిణిలో కోకొల్లలు. ఆడపిల్లలను దేవదాసీలుగా దేవాలయాలకు అంకితం చేసే భారతీయ సంప్రదాయం ఒకటి కాశ్మీరులోకూడా అమల్లో ఉండేది. ఈ దేవదాసీలను దేవాలయాలలోనుండి తమ అంతఃపురాలలోనికి మార్చుకునే ప్రత్యేకాధికారాన్ని రాజు లనుభవించేవారని కల్హణు డంటాడు.

స్త్రీలను నిశితంగా గమనించిన కల్హణుడు వారి చెడులను నిర్దాక్షిణ్యంగా బయటపెట్టినాడు. తమ తమ కోరికలను బట్టి, వాటిని నెరవేర్చుకొనటానికి వ్యభిచారిణులుగా మారి కొందరు సాగించిన రహస్య కామకలాపాలను గూడా ఆయన బహిరంగపరచినాడు. యౌవనమత్తుడైన సుగంధాదిత్యుడు రాజుగారి ఇద్దరు రాణులను 'ఆడగజ్జాల గుంపును మగగజ్జంవలె' సంతృప్తిపరచినాడు (తరంగం-V):

ఈ ఇద్దరు రాణులను ఒకరి తరువాత ఒకరినిగా వారి సుఖానుభవాన్ని అధికం చేయటంకొరకు – ఇద్దరు దరిద్రస్త్రీల మధ్య ఉన్న ఒకే ఒక అన్నప కంచంవలె – ప్రతిదినమూ సేవించినాడు. 285
తమ తమ కుమారులకు రాజ్యం సంపాదించటానికి ఈ ఇద్దరు రాణులు పరస్పరం పోటీపడి తమ మంత్రికే సంభోగ సుఖంతో పాటు రకరకాలుగా ధనాన్ని గూడా ఇచ్చినారు. 286

దిద్దారాణి రకరకాల వైరుధ్యాల పుట్ట. ఆమె అనేక 'విహారాల'ను నిర్మింపజేసింది. కాని ఈవిధమైన భక్తి నిష్ఠాపరకార్యాలన్నీ ఆమెలోని 'సుఖదాహానికి', అధికారదాహానికి అంటుగొమ్మలు (తరంగం-VI). ఆమె తన మనుమని 'చేతబడి' చేయించి చంపించిన సందర్భంలో కల్హణుడు తన అసహ్యాన్ని పట్టలేక ఈ విధంగా అన్నాడు:

పవిత్ర నదిలో నివసిస్తూ, మౌనవ్రతాన్ని పాటిస్తూ ఉండికూడా 'తిమి' తనవంటివాటిని తినటానికే అలవాటుపడింది. మబ్బునుంచి జారిపడే నీటిబిందువులను త్రాగుతూ జీవించేదే అయినా, నెమలి పాములను రోజూ మ్రింగుతూనే ఉంటుంది. జపం చేస్తున్నట్లు కన్పించే కొంగ, తనను నమ్మి దరిజేరిన చేపలను తింటుంది. కాగా, పవిత్రంగా ప్రవర్తిస్తున్నట్లు కనిపిస్తున్నా గూడా పాపిష్ఠులు పాపాలు చేయరనే నిశ్చయమేమీ లేదు. 309

కలశుని మరణం (తరంగం-VII) తరువాత ఆయన ప్రియురాలు 'కావ్య' మతిమాలిన ఒకానొక పల్లెటూరి బైతుకు లొంగిపోయింది. 'నీచబుద్ధి గల స్త్రీలకు సిగ్గుచేటు' అని కల్హణుడు తీర్మానించినాడు :

> ఆమె శరీరం రాజభోగయోగ్యమైనది. విలాసజీవనంలోని రకరకాల అలవాటులవల్ల ఆ శరీరం దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. ఆ విధమైన ఆమె తన సుఖానుభవానికి ఒక పల్లెటూరిమనిషిని విషయంగా చేసుకొన్నది. ఈ నీచబుద్ధిగల స్త్రీలు ఎంత నింద్యలు!

'అతి చతురమతి అయిన భార్య' ప్రోత్సాహంతో అనేక ప్రణాళికలు సాధించిన అనంత మహారాజు (VII తరంగం) స్త్రీనిగూర్చి తన అభిప్రాయాలను ఈ విధంగా వెలిబుచ్చినాడు :

> ఆత్మగౌరవం, వైభవం, ప్రభుత్వం, శక్తి, తెలివితేటలు కలిగిఉన్న నేను భార్యావిధేయుడిని కావటంవల్ల, అయ్యో, పోగొట్టుకోనిదేమున్నది? VI-423
>
> పురుషులు స్త్రీలను తమ సహచారిణులుగా భావించటం తెలివిమాలినతనం. నిజానికి పురుషులు స్త్రీల చేతులలో కీలుబొమ్మలు. 424
> కొందరు స్త్రీలు తమ భర్తలను అందంతో, మాయ మంత్రాలతో మోసగిస్తారు. కాగా, కొందరు పురుషులు శక్తిని, కొందరు వివేకాన్ని, కొందరు మగతనాన్ని, కొందరు జీవితాన్నే కోల్పోతారు. 426

ఈ చెప్పబడిన అంశాలవల్ల కల్హణుడు స్త్రీ ద్వేషియేమో అనే అభిప్రాయం కలిగే అవకాశమున్నది. కాని అది సరికాదు. కాళిదాసుతో పోల్చదగిన విధంగా కల్హణుడు చేసిన స్త్రీ వర్ణన ఒకదానిని ఇక్కడ ఉల్లేఖిస్తున్నాము :

> బంగారపు కేతకి పత్రాలంకారంతో, పొడవైన దండలతో అలంకరింపబడిన కొప్పు, రెపరెపలాడే తిలక పుష్పాలు అదుముకున్న అందమైన పాపట, కనుగొనలను చెవులదాకా విస్తరింపజేస్తున్న కాటుక రేఖ, వాలుగా కొప్పుల చివర కట్టబడిన జలతారు దారాలు, నేలను చుంబిస్తూ వ్రేలాడే దండలు, భుజాల పై భాగాలను కప్పివేసి

స్తనాంచలారను స్పష్టపరుస్తున్న రవికెలు, కర్పూర పరాగంవంటి
చిరునవ్వుల కాంతులు, అదురుతున్న నాజూకైన కనుబొమ్మలు—
వీటితో వారు మగదుస్తులు ధరించినప్పుడు మారువేషం వేసిన
మన్మథుని సౌందర్యాన్ని సంతరించుకొంటారు. VII-928-31.

భారతదేశంలోని ఇతర ప్రాంతీయులలో అనేకులకన్నా కాశ్మీరీయులు అంధ విశ్వాసాలు కలవారనేది ప్రసిద్ధ విషయమే. మనుష్యుల ప్రాణాలకు హాని కలిగించే రకరకాల మంత్రవిద్యలను వారు నమ్మేవారు. ప్రాచీన కాశ్మీర దేశంలో మంత్రవిద్య ఎంత అధికంగా వ్యాపించిందో రాజతరంగిణి ఋజువుపరుస్తుంది. తాంత్రిక విద్యలకు బలిఅయిన రాజులను గూర్చి కల్హణుడు వ్రాసినాడు. దయ్యాలు, భూతాల ఉనికిని గూర్చిన విశ్వాసం కల్హణునికి గూడా ఉన్నట్లే అన్పిస్తుంది. వివిధ సంఘటనలకు సంబంధాలు కల్పించి ఆయన చిత్రించిన తీరు ఆయనకున్న ఈ విశ్వాసాన్ని స్పష్టపరుస్తుంది.

# కవిగా కల్హణుడు

ప్రాచీన కాశ్మీరుదేశాన్ని గూర్చి అనేకమైన వివరాలను మన కందిస్తున్న రాజతరంగిణి చరిత్రగా చాలా ప్రధానమైన గ్రంథం. అయితే కల్హణుడు రచించిన ఈ చారిత్రక గ్రంథం వాల్టయిర్ రచించిన 'రష్యా చరిత్ర' (History of Russia) వంటిది గానీ, గిబ్బన్ రచించిన 'రోమన్ సామ్రాజ్య క్షీణ-పతనాలు' (Decline and fall of the Roman Empire) వంటిది గానీ కాదు. చరిత్రకు కల్హణుని గ్రంథం ఎంతో విలువైనదే. కాని, ప్రధానంగా అది ఒక కావ్యం. అయన కేవలం చారిత్రకుడు మాత్రమే కాదు, ద్రష్ట అయిన ఉత్తమ కవికూడా. కావ్యారంభ తరంగంలో తన కార్యాన్ని నిర్వచిస్తూ కల్హణు డిట్లా అన్నాడు:

> నిజమైన కవులయొక్క శక్తి వంద్యమైనది. తేనెవాకల నధిగమించ గల ఆ శక్తివలన ఆ కవుల, తదితరుల కీర్తి శరీరాలు అమరత్వం పొందుతున్నవి. ప్రజాపతుల వంటి కవులు తప్ప గతాన్ని కళ్లకు కట్టించే అందమైన (కావ్య) రచన మరెవరు చేయగలరు?

కల్హణుడు కావ్యారంభంలోనే కవి లక్షణాలను విశదీకరిస్తాడు. దాని వలన కవిగా తన కళకూ, తాను విస్తృతంగా చిత్రీకరింపవలసిన విషయ వస్తువుకూ ఉన్న సంబంధాన్ని ఆయన దర్శించిన రీతి స్పష్టపడుతుంది.

కల్హణుడు సాహిత్యంలో గాఢమైన శిక్షణ పొందినాడు. ప్రాచీన సారస్వతాన్ని విస్తృతంగా అధ్యయనం చేసినాడు. వ్యాకరణ-సాహిత్య శాస్త్రాలలో ప్రావీణ్యం సంపాదించినాడు. రామాయణ-మహాభారతేతి హాసాలమీదా, ఇంకా ఇతర ప్రాచీన చారిత్రక గ్రంథాలమీదా ఆయనకున్న ఆదరం అపారం. ఇతర మహాగ్రంథా లన్నింటికన్నా మహాభారతం నుండి అధికంగా అనేకాంశాలను తన గ్రంథంలో ఉదహరించినాడు. కన్నోజ మహారాజయిన హర్షుని పరాక్రమాలను వర్ణిస్తూ బాణభట్టు రచించిన 'హర్ష చరిత్ర', బిల్హణుని 'విక్రమాంక దేవచరిత' కల్హణుని అధికంగా ప్రభావితం చేసినట్టు కన్పిస్తుంది. అయన తన గ్రంథంలో ప్రాచీన కవి పరంపరకు, ఆ కవులనుండి వారసత్వంగా పొందిన విజ్ఞానానికి కృతజ్ఞత ప్రకటించినాడు.

'నిజమైన కవుల అనిర్వచనీయమైన ప్రతిభ నమస్కార యోగ్యమైనది. మాధుర్యంలో, అమరత్వంలో అమృతప్రవాహాన్ని మించిందది. ఆ కవులు తమ కావ్య ప్రతిభతో తమ, ఇతరుల కీర్తి శరీరాలను అజరామరం చేస్తారు'' అంటాడు కల్హణుడు.

కల్హణునికి ప్రాచీన కథల అధ్యయనంలో ఉన్న శ్రద్ధాసక్తులకూ, ఉత్సాహానికీ అంతులేదని ఆయన సమకాలీన కవి అయిన మంఖుడంటాడు. కల్హణునికి రాజనీతిశాస్త్రం, అర్థికశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, కామశాస్త్రంతో సహా ఇంకా ఇతర శాస్త్రాలతో, కళలతో గాఢమైన పరిచయమున్నది. అయితే, చారిత్రకుడుగా కల్హణుడు కళ-మానవత్వాల అధ్యయనానికి అర్థిక జీవితానికన్నా అధిక ప్రాధాన్యమిచ్చినాడు. అయినా గూడా, ఆయన గ్రంథంలో ఆహారపదార్థాల ధరలు, నాణాలూ, పన్నులూ కరువులు మొదలైన వాటిని గూర్చి కావలసినంత కచ్చితమైన వివరణలున్నవి. ప్రాచీన భారతీయ పౌరాణిక గాథలయిన గంగావతరణం, సముద్రమథనం మొదలైనవాటి ప్రస్తావనలు గూడా ఎన్నో ఉన్నవి. రాజతరంగిణిలో మామిడి, తాడి మొదలయిన కొన్నిరకాల వృక్షజాతులకూ సింహాలు, మొసళ్లు మొదలయిన జంతువులకూ సంబంధించిన ప్రస్తావనలున్నా అవి భారతదేశంలోని తక్కిన భాగాలలోనే తప్ప కాశ్మీరులో కన్పించవనీ, వాటి ప్రస్తావనలనుబట్టి కల్హణుడు భారతీయ సాంప్రదాయిక గ్రంథాల అధ్యయనాన్ని ఎంత తీవ్రంగా చేసినాడో తెలుస్తుందనీ అర్. ఎస్. పండితుడు అభిప్రాయపడినాడు.

రూపాన్ని, స్వభావాన్ని బట్టి రాజతరంగిణి ఒక కావ్యం. అందులో సర్గలు, లేదా అధ్యాయాలు-ఎనిమిది వీటిని 'తరంగాలు' అన్నాడు కల్హణుడు. ఈ ఎనిమిది తరంగాలలో మొత్తంమీద దాదాపు ఎనిమిదివేల శ్లోకాలున్నవి. అతి ప్రాచీనకాలంనుండి తననాటిదాకా కాశ్మీరును పరిపాలించిన అనేక రాజవంశాల విశేషాలను—మధ్యలో ఎక్కడా ఎడబాటు లేకుండా కల్హణుడు మనకందించినాడు. ఈ ఎడంలేని కారణంగా రాజతరంగిణి ఇతర చారిత్రక గ్రంథాలన్నింటికన్నా గూడా విశిష్టంగా రూపొందింది. విస్తృతమూ, గాఢమూ అయిన పాండిత్యం, విలక్షణమైన కావ్యప్రతిభ, ఇతిహాసాల ప్రధాన లక్షణమైన మానవ మనఃప్రవృత్తుల నిశిత పరిశీలనా విధానంపైగల అసక్తి సమృద్ధంగా గల కల్హణుడు ప్రసిద్ధులైన మహాకవుల మార్గాన తన దేశచరిత్రను చిత్రించే మహాకార్యాన్ని చేబట్టినాడు. కేవలం అభివ్యక్తి రూపం

గానే కాదు, సమకాలీనమైన సాహిత్యానికీ-చరిత్రకూ సమన్వితరూపంగా తన కావ్యరచనా విధానాన్ని రూపొందించుకున్నాడు. తన ఈ చారిత్రక కావ్యాన్ని సందర్భానుసారంగా, ఉచితరీతిలో రకరకాల సాహిత్యాలంకారాలతో అందగించినాడు.

మొత్తంమీద గమనిస్తే రాజతరంగిణిలో విసుగెత్తించే విధంగా సుదీర్ఘమైన ఋతువర్ణనలుగానీ, ప్రకృతి వర్ణనలుగానీ, ఎడతెగని ఉపమానాల సమూహాలుగానీ కన్పించవు. అవసరమైనా కాకున్నా, ఈవిధమైన అంశాలు మహాకావ్యానికి కృతకంగా తయారైన లక్షణాలు. అనవసరమైన అలంకార భారం లేకుండా సూటిగా నిరాడంబరమైన భాషలో రాజతరంగిణిలోని అత్యధికభాగం సాగింది. అంగీకృత సాహిత్య సంప్రదాయాలను తాను కావాలని బుద్ధిపూర్వకంగా త్రోసి రాజనటంలేదని కల్హణుడు స్పష్టపరచినాడు. కవితా 'విస్తృత కథన' చాతుర్యాన్ని గూడా ఆయన అంతగా వాంఛించ లేదు. సాంప్రదాయిక సాహిత్యాలంకారాలను ఉచితరీతిలో ప్రయోగిస్తూనే తన కావ్య విషయ వస్తువును, దాని సహజమైన విలువను, దాన్ని కావ్యంగా మలిచే అవకాశాలన్నింటినీ చాలా మెలకువగా ఉపయోగించుకున్నాడనే అంశాన్ని మనం ప్రధానంగా గమనించవలసి ఉన్నది. "కథనం దృష్ట్యా విస్తరణకు ఉపయోగించే కావ్యసాధనాల ద్వారా వైవిధ్యం సంపాదింపబడదు. అయినా సహృదయులను ఆనందపరిచే లక్షణం అందులో ఉండనే ఉన్నది." కాగా 'సుదీర్ఘవస్తు కథనంపై దృష్టి' నిలిపిన కారణంగా హర్షచరిత, విక్రమాంకదేవచరితలలో కన్నా రాజతరంగిణిలో శాఖాచంక్రమణం చాలా తక్కువ. "వివిధ విషయాలపై పలు భారతీయ రచనల మాదిరిగానే రాజతరంగిణి కూడా పద్యాలలోనే రచించబడింది. అయితే, ఒక కావ్యంగా శైలిదృష్ట్యా, రసదృష్ట్యా కూడా రాజతరంగిణిలో ఎన్నో ఉత్తమ ఘట్టాలున్నవి" అన్నాడు డాక్టర్ హెచ్. హెచ్. విల్సన్.[1] రాజతరంగిణిని గూర్చి 'ఏషియాటిక్ రీసర్చెస్'లో డాక్టర్ విల్సన్ క్రి. శ. 1825 లోనే ఎంతో మెప్పుదల ప్రదర్శించినాడు. "ఇప్పటిదాకా తెలియవచ్చిన సంస్కృత సాహిత్యం మొత్తంమీద కాశ్మీరు చరిత్రరూపమైన రాజతరంగిణి ఒక్కటి

1. విల్సన్, హెచ్. హెచ్., ది హిందూ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్. సుశీల్ గుప్త కలకత్తా (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, వారిచే 1960 లో పునర్ముద్రితం.

మాత్రమే ఏ ప్రమాణాలను బట్టి చూచినా 'చరిత్ర' అనిపించుకొనటానికి అర్హమైన సంస్కృత గ్రంథం'' అన్నా డాయన.

కవిగా తన కృతిని విషయవస్తు కథనరీతి ప్రభావితం చేసిందని కల్హణుడు అంగీకరించినాడు. రసనిర్వహణ కావ్యానికి ఆత్మభూతమైన విషయంగా భారతీయ సాహిత్యశాస్త్రం నిర్ణయించింది. మమ్మటుడు ప్రసిద్ధ సాహిత్య విమర్శగ్రంథమైన 'కావ్యప్రకాశ' కర్త. కాశ్మీరుకు చెందిన గొప్ప సాహిత్యవేత్త. ఆయన తన 'కావ్యప్రకాశ'లో 'వ్యవహారవేత్తృత్వం' కావ్య ప్రయోజనాలలో ఒకటిగా పేర్కొన్నాడు. 'రసాత్మకమైన వాక్యమే కావ్య' మని నిర్వచింపబడింది.[1] శృంగారం, హాస్యం, కరుణం, రౌద్రం, వీరం, భయానకం, బీభత్సం, అద్భుతం అని రసాలు ఎనిమిది. వీటిలో ఏదైనాసరే, ఒకటి కావ్యాత్మగా నిర్వహింపబడుతుంది. రసాలకు సంబంధించినంతవరకు కల్హణుడు మమ్మటునే అనుసరించినాడు కాని, 'శాంత'మనే మరొక రసాన్ని అదనంగా ఆయన చేర్చినాడు[2]. తన కావ్యాన్ని పరిపాలించే ఈ రసాన్ని గూర్చి ప్రస్తావిస్తూ కల్హణుడు ''ప్రతివాడూ భావించలేని అంశాలను కవి తన ప్రతిభావైభవంతో గమనించగలిగితే, ఆ కవి దివ్యతేజాన్ని పొందినా డనటానికి వేరే సూచన ఎందుకు?'' అని అంటాడు. ఆయన తన కావ్యపాఠకులను తొందరపడి నిర్ణయాలు చేయవద్దనీ, ఓపిక పట్టమనీ కోరినాడు.

---

1. రసాత్మకమైన వాక్యమే కావ్యమని నిర్వచించిన ఆలంకారికుడు విశ్వనాథుడు, 'సాహిత్యదర్పణ' కర్త. పదమూడవ శతాబ్దానికి చెందినవాడు – అను.

2. నిజానికి, మమ్మటుడు శాంతాన్ని రసంగా అంగీకరించి పేర్కొన్నాడు. 'నిర్వేదము స్థాయి భావముగా గల శాంతము తొమ్మిదవ రసము' అన్నా డాయన. (కావ్యప్రకాశ, నాల్గవ ఉల్లాసం). అష్టరసవాదం నాట్యశాస్త్ర కర్త అయిన భరతునిది. కాని అనంతరకాలాన శాంతం నవమరసంగా ప్రతిపాదింపబడింది. కాశ్మీరీయులైన ఆనందవర్ధన – అభినవగుప్తులు దాన్ని సిద్ధాంతీకరించినారు. వీరు మమ్మటునికి పూర్వులు. 'నవరసా'లన్నది ఆనాటికే స్థిరపడింది. కాగా, కల్హణుడు కొత్తగా మమ్మటుని రససంఖ్యకు శాంతాన్ని చేర్చలేదని గమనించటం అవసరం – అను.

కల్హణు డెన్నుకున్న కావ్యస్వరూపం ఆయన చరిత్ర రచనాశైలిని నిర్ణయించింది. రూపకం, ఉపమ, శ్లేష మొదలైన అలంకారాలు కవి చాతుర్యాన్ని వ్యక్తంచేస్తూ రాజతరంగిణిలో విరివిగానే కన్పిస్తవి. సందర్భానుసారంగా, అధ్యాయా (తరంగా) ల చివరలలోనూ వృత్తాలు మారినవి. కావ్యంలో యుధిష్ఠిరుని ప్రవాసం, చక్రవర్మ లేదా సుస్సలుడు విజయాలు సాధించి రాజధానికి తిరిగి రావటం, భిక్షాచరుని చివరియుద్ధం, హర్షుని శోచనీయ మరణం మొదలైన ఘట్టాలను చిత్రీకరించటంలో కల్హణుని సాలంకార కథన చాతుర్యం బహుముఖంగా సువ్యక్తమవుతున్నది. ఆశ్చిలస్ లేదా హోమర్ కవులతో పోలుస్తూ ఆర్. ఎస్. పండితుడు పొగడిన రీతికి కల్హణుడు అర్హుడేనని చెప్పవచ్చు. కల్హణుడు 'వాస్తవిక, సార్వదేశికకవి' అన్నాడా పండితుడు. కల్హణుని చిత్రణలో కాశ్మీరు వైభవోపేతంగా ప్రాణం పోసుకున్నది. పునస్సృష్టి పొందింది. కాశ్మీరుచరిత్ర విస్మృతి సముద్రంలో మునిగిపోకుండా రక్షింపబడిందంటే, దానికి కారణం కవిగా కల్హణుని చాతుర్యం. ఆయన కావ్యంలోని అద్భుతమైన శక్తి.

కల్హణుని అద్భుతమైన కథన చాతుర్యాన్ని తెలుసుకొనటానికి రాజతరంగిణిలో నుండి[1] ఇంతకుముందే పేర్కొన్న నాటకీయ సంఘనలకు చెందిన కొన్ని అంశాలను ఉదాహరిస్తున్నాము:

సింహాసనాన్ని పరిత్యజించమని మొదటి యుధిష్ఠిరుని ఆయన మంత్రులు ఒత్తిడి పెట్టినారు. ఆయన "స్వదేశాన్ని వదలిపోవటానికి వారు అనుమతించినారు." సపరివారంగా స్వదేశాన్ని విడిచి ఆ రాజు ప్రవాసం వెళ్లే ఘట్టం మొదటి తరంగంలో ఈవిధంగా చిత్రించబడింది:

> అందమైన కొండల దారులలో నడిచి నడిచి అలసిపోయిన ఆ రాజు చెట్లక్రింద కొంతసేపు విశ్రమిస్తూ, మరల నడుస్తూ, మరల విశ్రమిస్తూ మార్గాయాసాన్ని మరచిపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నంలో ఆయన కన్నంటుకున్నది. అంతలోనే అడవిలోని రకరకాల ధ్వనులకు మేల్కొంటున్నాడు. ఆయన చింతిస్తున్నట్టు కన్పి

1. ఇక్కడ, ఇంతకుముందు, ఇకముందుగూడా రాజతరంగిణిలోనివని ఉదాహృతభాగాలు ఆర్. ఎస్. పండితుని ఆంగ్లవచనానువాదం నుంచి గ్రహింపబడినవి.

స్తాడు. ఆయన మనస్సు కొండవాగు వంటి విచారంలో మునిగి ఉన్నది. 369

రకరకాల పూలతీవెల, ఔషధులతో సువాసితమైన అడవులను, పాకురుపట్టిన జారుడు గుండ్రాళ్ళతో నిండిన కొండవాగులను దాటి దాటి అలసిపోయిన పద్మసుకుమార దేహాలైన ఆయన రాణులు ఆయన ఒడిచేరి మూర్ఛితలైనారు. 370

సరిహద్దులోని కొండల చరియలమీద నిల్చి దూరమైపోతున్న తమ దేశాన్ని చూస్తూ, చూస్తూ నిట్టూర్పులు విడుస్తూ స్వదేశానికి వీడ్కోలుగా పుష్పాంజలులు సమర్పించినారు. ఆ కొండలమీది చెట్లపై గూళ్ళలో ఉన్న పక్షులు ఆ రాణుల స్థితిని చూచి రెక్కలల్లార్చుకుంటూ, ముక్కులతో పొడుచుకుంటూ నేలమీద పడి ఏడ్చినవి. 371

జారిపోతున్న తలలమీది ముసుగులను రొమ్ములమీద బిగిస్తూ, దూరమైపోతున్న తమ మాతృభూమిని చూస్తూ, చేతులతో తలలు కొట్టుకుంటూ ఏడుస్తున్నారు. వారి కన్నీరు వాగులుకట్టింది. 372

ఇంపైన పదాల కూర్పుతో మాధుర్య – సౌకుమార్యగుణాలను సంతరించుకున్న మూలశ్లోకాలలోని అందం – ఆకర్షణ ఈ వచనానువాదం[1] లో లోపించి ఉండవచ్చు. అయినా గూడా, ఏ సంస్కృత కావ్య – నాటక కవులతో పోల్చి చూచుకున్నా, షేక్స్‌పియర్‌తో పోల్చి చూచినా గూడా ప్రభావోత్పాదకమైన ఈ కరుణ రసచిత్రణ తలెత్తి నిలువగలిగి ఉందనే అంశం గమనించే అవకాశం కలిగిస్తున్నది. మనస్సును మిక్కిలిగా సమార్ద్రపరచే ఈవిధమైన కరుణరసచిత్రణ ఏడవ తరంగంలో హర్షుని దయనీయమైన మరణాన్ని వర్ణించే సందర్భంలో గూడా ఉన్నతస్థాయిలో సాగింది. ఆ సందర్భమిది:

రాజు (హర్షుడు) విసిరే ఆయుధాలను తప్పించుకుంటూ, రాజు ఏమరుపాటుగా ఉండగా ఆ ఆయుధపాణులు రాజు గుండెలో కత్తితో రెండుమార్లు పొడిచినారు. 1711

'హా! మహేశ్వరా!' అంటూ ఆ రాజు ప్రాణాలు విడిచినాడు.

1. ప్రస్తుత తెలుగు వచనానువాదానికి ఆర్. ఎస్. పండితుని ఆంగ్లవచనానువాదంతోబాటు కల్హణుని మూల శ్లోకాలు కూడా ఆధారం. —అను.

మొదలు నరుకబడిన చెట్టువలె ఆ రాజు శరీరం నేల కూలింది. 1712

చక్రవర్తి అయిఉండి కూడా దొంగలు పారిపోయి దాగుకొనటానికి ఉపయోగపడే గుడిసెవంటి గుడిసెలో, అయనకు అవిధమైన మరణం సంప్రాప్తించింది. 1713

ఈ కాలంలో ఆయనవంటి వైభవోపేతుడైన మరొక రాజు కన్పించడు. అంతేకాదు. ఆయనకు కలిగినట్లుగా నింద్యమైన మరణం కూడా మరెవరికీ కలిగి ఉండదు. 1714

బహుశః సంగ్రామ విముఖత అనే ఒకే ఒక అంశంవల్లనే ఆ ఉన్నతాత్మునియొక్క సర్వవిధ వైభవం విచ్ఛిన్నమై ఉండవచ్చు. 1715

.... పరివారమంతా వదిలిపోగా, వంశమంతా నశించిపోగా, నగ్నంగా, శోభాదరిద్రంగా ఉన్న ఆ రాజశవాన్ని కాష్ఠాగారాధికారి అయిన గౌరకుడనే ఒకడు దహనం చేసినాడు. 1727

'హర్షుని రాణులలో ఏ ఒక్కరు కూడా ఆయనకోసం ఏడ్వలేదు. ఆయన పరివారంలోని ఏ ఒక్కరూ ఆయనతో ప్రాణాలు విడువలేదు, దేశాలు పట్టిపోలేదు,' అని అంటూ కల్హణుడు ఆ తరంగంలోని ఉపధా (చివరిదానికి వెనుక) పద్యంలో మానవ జీవితానుభవంలోని అస్థిరత్వాన్ని భావిస్తూ తాత్త్వికమార్గాన ఈ విధంగా అంటాడు :

ఆరంభంలో ఏమీలేదు. ఆ తరువాత ఏదీ ఉంటుందని కూడా లేదు. మధ్యలో కష్టసుఖాలచే నియమితుడై ఒక నటునివలె తలా తోకా లేకుండా నటిస్తుంటాడు. మాటిమాటికీ తనకు నియతమైన నటన పూర్తిచేసి ఈ బ్రతుకు తెర వెనుకకు జీవుడు అదృశ్యమవుతుంటాడు. ఆ జీవు డెటు వెళ్తాడో తెలియదు. 1731

తంత్రిణుల కూలి సైన్యాలను ఓడించిన తరువాత, సాహసికుడైన ఒక రాజకుమారుని మోసంతో చంపిన తరువాత, విజయోల్లాసంతో రాజధాని అయిన శ్రీనగరంలోకి చక్రవర్మ ప్రవేశిస్తాడు. ఆ సందర్భాన్ని వర్ణిస్తూ (తరంగం-V) చేసిన వీరరస నిర్వహణ కవిగా కల్హణుని కళాచాతుర్యాన్ని ప్రదర్శిస్తుంది :

ఆ మరుసటి రోజు వీరుడైన శంఖువర్ధనుడు అప్పటికే చెల్లాచెదరై పోయిన తంత్రిణులను పునఃసమీకరించే ప్రయత్నంలో ఉన్నాడు. అప్పుడు, అంతలోనే, మంత్రులు, సామంతులు, ఏకాంగులు, ఇంకా పలువైపులనుండి వచ్చిన ఉత్సాహపూరిత సేనాదళాలు వెంటరాగా; అశ్వాల మధ్యంలో ఒక అశ్వాన్ని అశ్వశిక్షకులు నాట్యం చేయిస్తుండగా; గట్టిపు కళ్లెంపట్టిన చేతితో తలనుండి జారుతున్న శిరస్త్రాణాన్ని సరిచేసుకుంటూ; సూర్యుడు ప్రతిఫలిస్తున్న ఖడ్గాల కాంతులతో కర్ణ కుండలాలు మెరుస్తూ ఉండగా; కవచం బిగింపుతో దురద పెడుతున్న మెడను చెమటలు కారుతున్న మరొక చేతితో రాసుకుంటూ; బొమముడితో ముఖంలో గాంభీర్యం వ్యాపించగా; వీధులలో పడి దోచుకునేవారిని కేకలతో అదలించుతూ; బాధలతో భయపడిపోతున్న నగరవాసులకు శిరఃకంపనంతో, ప్రసన్నమైన చూపులతో ధైర్యం కలిగిస్తూ, సాంత్వన వాక్యాలు పలుకుతూ; భేరీభాంకారాల ధ్వనులు మార్మోగుతూ ఉండగా; సేనా విజయంతో ఉత్సాహ ప్రపూర్ణుడైన చక్రవర్మ శ్రీనగరంలో ప్రవేశించినాడు. ౩41-47

విజయోత్సాహంతో ఆయన సింహాసనం అధిష్ఠించగానే శంఖువర్ధనుని బంధించి భూభటుడు ఎక్కడినుండో తీసుకుని వచ్చినాడు. 348

రాజుముందు తన రాజభక్తిని ప్రదర్శించుకొనటానికి ఆ దుష్టుడు ఒక చండాలునివలె, కత్తిదెబ్బ భయంతో వణికిపోతూ కళ్ళు మూసికొని నిలిచిఉన్న శంఖువర్ధనుని తల నరికివేసినాడు. 349

భిక్షాచరుని అంతిమ యుద్ధం అత్యున్నతస్థాయిలో వర్ణించబడింది. వీర-కరుణాలు రెండూ పొంగి పొరలినవి. ఈ క్రింద ఉదహరిస్తున్న భాగాలను ప్రాచ్య-పాశ్చాత్య ఇతిహాస కావ్యాలలోని ఏ ఘట్టాలతోనైనా పోల్చి చూచుకోవచ్చు:

మృగేంద్ర సమానుడైన భిక్షాచరుడు శరపంజరాన్ని భేదిస్తూ ఉండగా, పార్శ్వసౌధాలమీదినుంచి ఖశులు పాషాణవర్షం కురిపించినారు. VIII-1762

ఆ శిలా వర్షపాతంవల్ల శరీరమంతా గాయాలతో నిండి పరుగెత్తుతున్న ఆయన డొక్కలో ఒక బాణం దూసుకునివచ్చి ఆయన యకృత్పిండాన్ని చీలుస్తూ గుచ్చుకున్నది. 1763

అప్పుడాయన మూడడుగులు ముందుకువేసి, భూమిని కంపింపజేస్తూ, చాలాకాలంగా తనవల్ల శత్రువులలో పెరిగిపోతున్న భయం తొలగిపోయే విధంగా ఉన్నపాటున నేలగూలినాడు. 1764

ఎల్లప్పుడూ కులీనులతో పరివేష్టింపబడి ఉండే ఆ రాజు, పూలచెట్లతో విరాజిల్లే పర్వతశిఖరం అశనిపాతంతో కూలిపోయినట్లు పడి ఉన్నాడు. 1767

ఇంతటి రాజసమూహంలో హర్షవంశీయుడైన భిక్షునికి అవమానమేమీ కలుగలేదు. పైగా అత్యున్నత గౌరవస్థానం లభించింది. 1768

ఎప్పుడూ అతనికి విముఖంగానే ఉంటూ, చివరకు అంత్యకాలంలో కూడా ఆవిధంగానే ఆయనపట్ల ప్రవర్తించిన విధి తన ఓటమిని తానే అంగీకరించక తప్పలేదు. 1769

విస్తృతావకాశాలు, అదృష్టమూ గల పూర్వరాజులతో పోల్చినప్పుడు, పాపం! ఆయన ఎంత? కాని, చివరకు ఆయన ధైర్యసాహసాలతో పోల్చినప్పుడు వారందరూ ఎందుకూ కొరగారు. 1770

....కళ్ళల్లో మెరుపు, కనుబొమల విరుపు, పెదవులపై చిరునవ్వు అనేకక్షణాలదాకా చెదరని ఆ తల 'సజీవమా?' అన్నట్లే ఉన్నది. 1777

ఆయన సూక్ష్మశరీరం ఆకాశంలో అప్సరసలతో పరివేష్టితమై స్వర్గంలో ప్రవేశించింది. ఆయన స్థూలశరీరం భూమి, నీరు చల్లగా ఉంటాయని తెలిసి అగ్నిలో ప్రవేశించింది. 1778

అంతకు ముందునాళ్ళలో, సమయాన్ని బట్టి వేషాలు మార్చే సామంతులు, మంత్రులు, యోధులూ తనను ఒంటరివానిగా చేసినా లెక్కచేయకుండా, కాలం గడుపటంకోసమని పాచికలాడినాడు. 'హంతకులు చేసే ఆలస్యానికి ఇబ్బందిపడుతూ, సంఘర్షణోత్సుకత్వం' తో రాజిల్లినాడు. తన కాలం తీరిందని నిశ్చయంగా తెలిసిన ఆ సాహసికయోధుని చిత్రణ అవిస్మరణీయమైనది.

ఒత్తుగా నిగనిగలాడుతూ ఉండిన ఆయన తలవెంట్రుకలు అంతులేని విచారంవల్ల పలచబడినవి. ఆయన ధరించిన సైనికవస్త్రాల అంచుల కొనలు ఆయన ధ్వజవస్త్రంవలె రెపరెపలాడుతున్నవి. చెవులకు

వ్రేలాడే శుక్తిలోలకులు చెంపలమీద నాట్యమాడుతున్నవి. అహంకార పూర్ణమైన ఆయన చిరునవ్వువలె వీరచందనం పూత ప్రకాశిస్తున్నది. ఉదాత్తమైన తన జీవితంయొక్క చివరికాలాన కలుగనున్న ఓటమిని తన్నివేస్తున్నాడా అన్నట్టు కాళ్ళతో నేలను చరుస్తున్నాడు. ఆయన కత్తి, కన్నులు అగ్నికణాలను విరజిమ్ముతున్నవి. కుంకుమరంగు దండలు మెడలో వ్రేలాడుతుండగా, పెదవుల కొనల గట్టిబిగింపుతో వ్రేలాడే జూలుగల భయమెరుగని సింహంవలె కన్పిస్తున్నాడాయన. ఆయన తన కనుచూపులు కదులుతున్నంత వేగంగా, హుందాగా అంగలు వేస్తున్నాడు. తన ప్రభుత్వవైఖరి అంతా మూర్తీభవించి నట్లుగా కన్పిస్తున్నాడు. ఆత్మవిశ్వాసమే ఆభరణంగా, ఆత్మగౌరవమే గొప్ప అదృష్టంగా భావించే ఆ మహానుభావుడు ఏ మాత్రమూ తగ్గని అపారమైన శౌర్య గర్వరేఖతో ప్రకాశిస్తున్నాడు. కలుగబోయే పత నాన్నికూడా లెక్కచేయకుండా విరోధులను ఎదుర్కొనటానికి ముందు కురుకుతున్న ఆ భిక్షాచరుని చూస్తున్న ప్రజల చూపులు అతని మీది నుంచి మరోవైపు కదులలేకపోయినవి. 1744-50

క్రీ. శ. 1121 లో కాశ్మీరు సింహాసనాన్ని మరల స్వాధీనపరచు కొన్న సుస్సలుడు "విరోధులు ఊహించని విధంగా రాజధాని గవనులో ప్రత్యక్షమైనాడు" (VIII-947). విజేతగా ఆయన నగరప్రవేశం వీరరస నిర్వహణకు మరొక ఉదాహరణ:

మృత్యువువలె కోపంతో ఊడికిపోతున్నాడు. ఎండకు శరీరం కమిలి పోయింది. పొడవైన గడ్డంతో, దట్టమైన కనుబొమల ముడులతో ముఖం కమ్ముకుపోయింది. ఉద్రేకంతో కనుగ్రుడ్లు గిరగిర తిరుగు తున్నవి. ముకుపుటాలు అదురుతున్నవి. ఇట్లాంటి ఆకారంతో సుస్స లుడు శ్రీనగర వీధులను, నగర న్యాయస్థానాలనూ భయకంపితం చేసినాడు. అప్పటికప్పుడే. అక్కడికక్కడే అశ్వదళం బంధించి నడిపి స్తున్న విశ్వాసఘాతుకులైన సైనికులు కన్పించగానే, వారిని తిడుతు న్నాడు. వారినా విధంగా ప్రవర్తించటానికి ప్రేరేపించిన వారిని శపిస్తున్నాడు. రాజధానీవాసులు గుంపులుగట్టి జయజయధ్వానాలు చేస్తూ ఆయనమీద పూలవాన కురిపిస్తున్నారు. ఒకప్పుడు ఆయనను

> నిందించినవారే ఇప్పు డిట్లా చేస్తున్నారు జారుతున్న కవచాన్ని భుజం మీదికి సరిచేసుకుంటూ, వారిని నిర్లక్ష్యంగా చూస్తూ, తృప్తిగా నవ్వు కొన్నాడు. కిరీటంలోనుంచి క్రిందికి జారిన వెంద్రుకలు, కనురెప్పలు దుమ్ముగొట్టుకొని ఉన్నవి. కత్తిని ఒరలోపెట్టి తన యుద్ధాశ్వాన్ని విచ్చుకత్తులతో నున్న తన ఆశ్వికుల మధ్యకు దూకించినాడు. ఆకాశపు కప్పుక్రింద ప్రతిధ్వనించే విజయధ్వానాలతో, ఆటవికోత్సాహం వెల్లివిరిసిన సేనలతో, భేరీఖాంకారాలతో సుస్సలుడు శ్రీనగరంలో ప్రవేశించినాడు. 947-53

'సాహసికులైన గౌడదేశీయుల' మరొకవిధమైన పరాక్రమాన్ని కూడా కల్హణుడు మెప్పుదలతో కీర్తించినాడు. గౌడదేశ రాజును లలితాదిత్యుడు చంపించినాడు. అప్పుడా రాజుగారి అనుయాయులు - కల్హణుడు నాల్గవ తరంగంలో వివరించినట్లు - "గుంపులు గూడి దేవుని గర్భగృహాన్ని చుట్టు ముట్టినారు." వారి ప్రవేశాన్ని పూజారులు అనుమతించకున్నా, వారు అక్రమించినారు.

> పౌరుషంతో పొంగిపోతూ పరిహాసకేశవుడనే భ్రాంతితో రామస్వామి వెండి విగ్రహాన్ని నేలమీదకు త్రోసి పడగొట్టి పొడిపొడి చేసినారు. IV-327
>
> ఆ విగ్రహాల పొడిని అన్నివైపులా వెదజల్లుతూనే, అంతలో అక్కడికి అడుగడుగునా శ్రీనగరం నుంచి వచ్చి చుట్టుముట్టిన సైన్యాలను సంహరిస్తున్నారు. 328
>
> ఒడలంతా రక్తమయమై నేలకొరుగుతున్న ఈ నల్లటి మనుష్యులు ఎరుపు ధాతుజలంతో పూయబడిన నీలగిరి శిఖర ఖండాలవలె కన్పించి నారు. 329
>
> వారి రక్తపుజల్లులతో వారి అసాధారణమైన ప్రభుభక్తి ఉజ్జ్వలించింది. భూమి ధన్యమైంది. 330

తమ రాజును హత్యచేసినందుకు ప్రతీకారం తీర్చుకొనటం కోసం బెంగాలు నుండి ఇంతదూరం కాశ్మీరుకు వచ్చిన విశ్వాసమూర్తులగు ఆ రాజానుయాయుల పౌరుష, త్యాగాలను అభివర్ణించి కల్హణుడు చివర కిట్లా అన్నాడు:

పిడుగు ప్రమాదాన్ని వజ్రం తప్పిస్తుంది. పద్మరాగమణి ఐశ్వర్యాన్ని కలిగిస్తుంది. గరుడమణి అన్నివిధాల విష దోషాలను తొలగిస్తుంది. ఈవిధంగా ప్రతిరత్నమూ తనలో నిహితమైన శక్తివల్ల ఆయా ప్రత్యేక కార్యాలను మాత్రమే నిర్వర్తించగలదు. కాని, రత్నాలవంటి మనుష్యుల మహిమ అపరిమితమైనది అట్టివారికి అసాధ్యమంటూ ఏదీ లేదు. 331

"హఠాత్తుగా కలిగిన ప్రమాదం దుఃఖం కలిగిస్తుంది. అయితే, ఎడతెగని బాధ లనుభవించేవానికి ప్రత్యేకంగా దుఃఖమంటూ ఏమీ ఉండదు. నిండా మునిగినవానికి చలి ఏమిటి?" – యుద్ధాల బరువుబాధ్యతలను యుద్ధాల మధ్యకూడా నిర్వహించే సుస్సలుని గూర్చి కల్హణుని ఈ మాటలు ఆయన నిశితలోక పరిశీలనను సూచిస్తున్నవి. ఈ పద్యంకన్న ముందే ఒక పద్యం (1095) లో "యుద్ధాలు జరుగుతున్నప్పుడు ఆ రాజు అసంభ్రమంగా, ఆయా ప్రదేశాలలో – ఉత్సవాల సందర్భంలో మండపం మండపానికి తిరిగే బ్రాహ్మణునివలె – చరించినాడు" అని అంటాడు. తొందరపాటుగల రాజ్యాధినేతలకు ఆధునికకాలంలోనూ ఇది ఒక నీతిపాఠం కాగలదు.

# చారిత్రకుడుగా కల్హణుడు

బీదతనంవల్లనో, రకరకాల ఆశల ఒత్తిళ్ళవల్లనో తమ తెలివితేట లను, ప్రజ్ఞాప్రాభవాలను, చాతుర్యాన్ని వ్యర్థంగా రాజుల పాదాల ముందు సమర్పించే పలుమంది బ్రాహ్మణ పండితుల - కవుల కోవకు చెందినవాడుకాడు కల్హణుడు. సంప్రదాయం, లేదా ఆచారం పేరుతో ముఖ్యంగా ఆస్థాన కవుల - పండితుల రచనలు తమ పోషకులైన ప్రభువులను ఘనంగా, అమి తంగా కీర్తించేవి. కాని, రాజతరంగిణి ఈ తరహాకు విభిన్నంగా నిలద్రొక్కు కున్నది. మరొకటి. ఫిర్దౌసి రచించిన 'షానామా' వలె కల్హణుని ఈ చరిత్ర గ్రంథం జానపద, పౌరాణిక గాథల సంకలనం కాదు.

చారిత్రకుని బాధ్యతను లక్షించి కల్హణు డిట్లా అన్నాడు: "గతకాల సంఘటనలను వివరించటంలో న్యాయనిర్ణేతవలె అసందిగ్ధమైన భాష నుప యోగిస్తూ, పూర్వ నిశ్చితాభిప్రాయాలతో పక్షపాతపూరితంగా వ్యవహరించ కుండా ఉన్న శక్తిమంతుడే, నిజంగా, గణనీయుడు." కల్హణుని నిర్ణయానికి సార్థకత కలిగిస్తూ ఆ స్థాయికి ఎదిగి నిష్పక్షపాతంగా వ్యవహరించగల వాడే నిజమైన చారిత్రకుడు.

'మాంచెస్టర్ గార్డియన్' ద్వారా ప్రసిద్ధుడైన సి. పి. స్కాట్ 'యథా ర్థాంశాలు పవిత్రమైనవి' అన్నాడు. ఈ మాటలంటున్నప్పు డాయన దృష్టిలో పత్రికారచన ఉండి ఉంటుంది. పత్రికారచన అనేది, మహా అయితే, నడు స్తున్న చరిత్ర. కాని, ఈ స్కాట్ అనుశాసనం 'చరిత్ర' రచనకు మరింత కచ్చితంగా వర్తిస్తుంది. యథార్థాంశాలను గూర్చి కల్హణునికున్న గౌరవాద రాలను ఈ వాక్యాలు వ్యక్తంచేస్తున్నవి: 'రాగద్వేషాలకు అతీతంగా యథార్థాలను వెల్లడించటానికి మాత్రమే పరిమితంగా భాష నుపయోగించే శక్తి సామర్థ్యాలుగల కవియే నిజంగా అభినందనీయుడు' అన్నా డాయన.

దాదాపుగా 2,433 సంవత్సరాల కాశ్మీరు ప్రాచీన చరిత్ర కల్హణునికి వస్తువు. ఆయన అన్నేండ్ల సమాచారాన్ని సమీకరించుకున్నాడు. ఆ వస్తువు నంతా వివరించబోతున్నాడు. రాజతరంగిణి ప్రస్తావన శ్లోకాలలో ఈ

అంశం చెప్పబడింది. దానినే ఆర్. ఎస్. పండితు డీ విధంగా వచనంలో అనువదించినాడు[1] :

> విపులంగా రాజచరిత్రలు వస్తువుగా గల ప్రాచీనమైన విస్తృత గ్రంథాలు సువ్రతుని గ్రంథం కారణంగా అలభ్యమైపోయినవి. ఆ గ్రంథాలలోని విషయాలను సులభంగా గుర్తుంచుకొనటానికి వీలుగా క్లుప్తీకరించినాడు. ఆయన గ్రంథానికి కీర్తి అయితే వచ్చింది కాని, అది సులభంగా అర్థమయ్యే విధంగా మాత్రం లేదు. మరి, పాండిత్య ప్రకర్షా ప్రదర్శనం కారణంగా కఠినమైపోయింది.
>
> క్షేమేంద్రుని 'రాజావళి' కావ్యంగా ఉత్తమమైనదే అయినా, అశ్రద్ధ వల్ల కావచ్చు, అందులోని ఏ ఒక్క అంశం కూడా దోషరహితంగా లేదు. కాగా, నేను ఏ గ్రంథాలను నా రచనకు ఆధారంగా తీసుకున్నా నన్నది ప్రధానంగా గమనించవలసిన అంశం. ఆ ఆధారాలు రెండు విధాలుగా ఉన్నవి. ఒకటి: ప్రాచీన కాశ్మీరుచరిత్రకు సంబంధించిన పూర్వగ్రంథాలు. వీటిని పరిశీలించి, పరస్పరం పోల్చి చూచుకుని నిర్ణయాలు చేయుటం; రెండు: పూర్వరాజుల శాసనాలు, వంశవృక్షాలు, ప్రసిద్ధ వ్యక్తులకు సంబంధించిన స్మృతిగ్రంథాలు ఉపయోగించుకొనటం, రాజుల చరిత్రలను చెప్పే ప్రాచీన గ్రంథాలు పదకొండింటిని నేను పరిశీలించినాను. చతురమతియైన 'నీలు'ని గ్రంథాన్ని (నీలమతపురాణం) కూడా అధ్యయనంచేసినాను. గత విషయాలకు సంబంధించి పూర్వరాజుల చర్య, శిలాశాసనాలు, రాజవంశాల వివరాలుగల వందిమాగధుల కీర్తిపత్రాలు, ప్రసిద్ధవ్యక్తుల గూర్చిన స్మృతిగ్రంథాలు – ఈ మొదలైనవాటిని అన్నింటినీ నిశితంగా పరీక్షించటంవల్ల నాలోని అనేక భ్రాంతులు తొలగిపోయినవి.

ఆవిధంగా కల్హణుడు, నిజమైన చారిత్రకుడుగా, బాధ్యతాయుతంగా ప్రాచీన గ్రంథాలను సమీక్షించి ప్రస్తావించినాడు. కాశ్మీరు రాజుల చరిత్రలతో విపులమైన ప్రాచీన గ్రంథాలలో ఏదికూడా సమగ్రరూపంలో లభించటంలేదు. అవి అలభ్యం కావటానికి కారణాన్ని కల్హణుడు సువ్రతుని గ్రంథానికి ఆపాదించినాడు. సువ్రతునిది పూర్వుల చరిత్ర రచనలను క్లుప్తీక

1. ప్రస్తుత గ్రంథంలోనిది ఆ పండితుని ఆంగ్ల వచనానువాదానికి ఛాయానువాదం – అను.

రించిన చిన్న గ్రంథం. మరి, కాశ్మీరురాజుల చరిత్ర గురించి పదకొండో అంతకన్న ఎక్కువో గ్రంథాలుండగా, ఇక రాజతరంగిణి ప్రత్యేకత ఏమిటి? దీనికి కల్హణుని సమాధానమిది: మూడవ గోనందుని నాటినుండి అవిచ్ఛిన్నంగా సమగ్రమైన చరిత్ర ఏదీ లేదు. "అనేక విషయాలలో ముక్కలు ముక్కలుగా, విడి విడి భాగాలుగా, మధ్య అనేక వ్యవధానాలతో ప్రాచీనుల 'చరిత్ర కథనం' ఉండగా, నేను అవిచ్ఛిన్నరూపంగా, సమగ్రంగా రచింపదలచినాను." భారతదేశంలో 'సంక్షేపరీతి' ఒక విషయంమీద రచింపబడిన పూర్వగ్రంథాలు ఖిలం కావటానికి ఎట్లా తోడ్పడిందనేది స్పష్టమే. అనేక సంఘటనల చిత్రణద్వారా రాజులకూ, సామాన్యులకు గూడా నీతిమార్గం కల్హణుడు సూచించదలచినాడు. అందుకని "రసప్రవాహ మధురమైన రాజతరంగిణి ముత్యపు చిప్పలవంటి చెవులతో ఆస్వాదింపబడుగాక" అన్నాడాయన.

రాజతరంగిణి ఎనిమిది తరంగా (అధ్యాయా)లలో విభజింపబడి, సంస్కృత శ్లోకమయంగా ఉన్నది. అతి ప్రాచీన కాలంనుండి కల్హణుని కాలందాకా, సమకాలంలోనూ కాశ్మీరును పరిపాలించిన వివిధ రాజవంశాల చరిత్ర దీనిలో చిత్రింపబడింది. మొదటి మూడు తరంగాలలో కొన్ని సంఘటనలకు సంబంధించి కన్పించే పౌరాణిక లక్షణాన్ని మినహాయిస్తే, నిజానికి, కల్హణుడు ప్రాచీన కాశ్మీరు సంప్రదాయాన్ని నిజాయితీగా అనుసరించినాడు. క్రీ. శ. 1835 లో పూర్తిగా వెలుగులోకి వచ్చినప్పటినుండి కల్హణుని రాజతరంగిణి అనేక చారిత్రకుల పరిశీలనలకు, కాలపరీక్షకు తట్టుకొని నిలువగలిగింది. కల్హణుని సమకాలీన చరిత్ర చిత్రణ, ప్రధానంగా ఆయనకు తన సమకాలీనులయిన వివిధ ప్రముఖులతో, వ్యక్తులతో గల వైయుక్తిక సంబంధాలు ఆధారంగా సవివరంగా సాగింది. ఈ కారణంగానే అతి విస్తృతంగా రూపొందిన చివరి-ఎనిమిదవ తరంగం చరిత్రాధ్యయన పరులకు ఎంతో విలువైనది.

కల్హణుడు ప్రాచీన చరిత్ర పరిశోధకుడు కూడా కావటంవల్ల కాశ్మీరులో లభించగలన్ని రాజదానపత్రాలు, పట్టికలు, మౌలికచరిత్ర పత్రాలు సంపాదించి పరిశోధించినాడు. ఆలయాలలోని దానశాసనాల ద్వారా ఆయా దేవాలయాల నిర్మాణాల కచ్చితమైన కాలాన్ని, ఆయా పవిత్ర విగ్రహాలకు సంబంధించిన మౌలిక సమాచారాన్ని సంపాదించినాడు.

ఆధునికంగా చరిత్ర పరిశోధనలో అవలంబించబడుతున్న విమర్శాత్మక పద్ధతులను కల్హణుడు ఆనాడే గుర్తించగలిగినందుకు ప్రసిద్ధ చారిత్రకుడైన ప్రొఫెసర్ ఆర్. సి. మజూమ్దార్[1] కల్హణుని ఎంతగానో గౌరవించినాడు. "ప్రాచీన భారతీయ సారస్వతంలో 'చరిత్ర' అంటూ సార్థకమైన గ్రంథమేదైనా ఉన్నదంటే, అది రాజతరంగిణి ఒక్కటే. ఆనాటికి లభ్యమైన చరిత్ర గ్రంథాలు, ఇతరాధారాలనుంచి సమాచారాన్ని సేకరించటానికి అధికంగా శ్రమించటమేకాక, తన గ్రంథాదిలో చరిత్ర రచనా విధానాన్ని గూర్చి కొన్ని సామాన్యసూత్రాలు కల్హణుడు చెప్పినాడు. అవి, నిజానికి, తన తరువాత ఎంతో సుదూరకాలంలో విస్తరించబోతున్నవి. ఈ అంశాలలో చాలావరకు 19 వ శతాబ్దంనాటి వరకుగూడా అభివృద్ధి పొందలేదంటే, కల్హణుడు ప్రస్తుతీకరించిన ఆ అంశాల విశిష్టత బోధపడుతుంది" అన్నారు ప్రొఫెసర్ మజూమ్దార్.

రాజతరంగిణిలో కొన్నికొన్ని భాగాలకు సంబంధించి కొన్నికొన్ని లోపాలుండవచ్చు. అయినా, ఈ గ్రంథం కేవలం కాశ్మీరు చరిత్ర విషయంలోనే గాక, మొత్తం భారతదేశ చరిత్రకు సంబంధించి కూడా అతి ముఖ్య గ్రంథం. రాజతరంగిణికి తన అనువాదం పీఠికలో స్టైయిన్ వ్రాసిన వాక్యాలనుగూడా ఈ సందర్భంలో ఉదాహరించుకోవచ్చు: "భారతదేశ చరిత్ర విషయంలో కల్హణుని రాజతరంగిణి ఎంతో ఆసక్తికరమైనది. మధ్యయుగాలలో యూరపు చరిత్రకారులకు, తూర్పుదేశాల మహమ్మదీయుల చారిత్రక గ్రంథాలకు చాలా దగ్గరగా సంస్కృతంలో ఉండే చరిత్ర రచనా సంప్రదాయానికి రాజతరంగిణి ప్రాతినిధ్యం వహిస్తున్నది. అనంతర కాలంలోని చారిత్రకగ్రంథాలు కల్హణరచనను అనుసరించినవి. వాటికి అది ప్రాణం. గ్రంథరచనా ప్రణాళిక గానీ, రూపంగానీ తన సొంతమని కల్హణుడు ఎక్కడా చెప్పుకొనలేదు. పైగా, తనకు పూర్వరచసలైన ప్రాచీన కాశ్మీరు రాజుల చరిత్రలను ఉల్లేఖించే అనేక గ్రంథాలను తన గ్రంథాదిన ప్రస్తావించినాడు. అయితే, ఈ ప్రాచీన గ్రంథాలేవి కూడా మనదాకా జీవించి లేవు. భారతదేశంలో ఏ ప్రాంతానగానీ సంస్కృత సాహిత్యంలో, రాజతరంగిణివంటి చరిత్రగ్రంథాలేవీ జాగ్రత్త పరచబడలేదు. కాని, అట్లాంటివి ఉండేవన్న అంశం మాత్రం చాలాచోట్ల సూచింపబడింది."

1. మజూమ్దార్; ఆర్.సి. సంపాదితం. 'ది వేదిక్ ఏజ్.' పు. 49.

# కాలక్రమవిధానం

రాజుల, రాజవంశాదుల కాలాలను నిర్ణయించటంలో రాజతరంగిణి తీవ్రమైన లోపాలకు గురి అయింది. వివిధ రాజుల రాజ్యకాలాలలోని సంఘటనలను సుదీర్ఘంగా వర్ణించిన మొదటి మూడు తరంగాలలో కచ్చితమైన తేదీలు లేవు. ఇన్నిన్నేళ్ళు ఈయా రాజు పరిపాలించినాడని చెప్పబడిన సంవత్సరాల సంఖ్యకూ, ఆయా రాజవంశాల మొత్తం పరిపాలనా కాల సంవత్సరాలసంఖ్యకు తేడాలు కన్పిస్తున్నవి. అంకెలు పరస్పరం సరిపోవటం లేదు.

చిపాత-జయాపీడుని మరణం (క్రీ. శ. 813) దగ్గరినుండి, ఆపైన సరియైన తేదీలను కల్హణుడు సూచించినాడు. ఈ భాగం నాల్గవతరంగంలో 703 వ శ్లోకంలో ఆరంభిస్తుంది. ఈ సంవత్సరాలు లౌకికశకాన్నిబట్టి చెప్పబడినవి. ప్రాచీనకాలంనుంచి కూడా కాశ్మీరులో లౌకికశకం ఉపయోగంలో ఉన్నది. (ఈ లౌకికశకం సంవత్సరాలను క్రైస్తవశక సంవత్సరాలతో సరిచూసుకోవచ్చు.) తన రాజతరంగిణి అనువాద పఠనానికి 'ఆహ్వానం' అందిస్తూ ఆర్. ఎస్. పండితుడు-"లౌకిక సంవత్సరం 3883 (క్రీ. శ. 813-814) మొదటి సంవత్సరం. ఈ సంవత్సరం తరువాత కల్హణుని చరిత్రగ్రంథం కాలాల విషయంలో కచ్చితంగా ఉన్నదనటంలో సందేహం లేదు. ప్రాచీనకాలానికి సంబంధించిన కాలనిర్ణయంలోని లోపాలు అంతకుముందరి చరిత్రగ్రంథాలు కారణంగా సంభవించి ఉండవచ్చు" నన్నాడు.

అయిదవ తరంగంలో – ఉత్పలవంశం అధికారంలోకి వచ్చిన తరువాత, ప్రతి రాజ్యపాలనాకాలపు అవ్యంతాలు తిథి-మాస-సంవత్సరాల రూపాన వ్రాయబడినవి. మొత్తంమీద ఈ తేదీలు విశ్వసింపదగినవే నన వచ్చు. ఇవి సమకాలీన పత్రాలనుండి సంపాదింపబడి ఉండవచ్చు. అయితే, ఇవి కచ్చితమైనవే అనే అంశాన్ని నిర్ధారించటానికి ఉపయోగించే స్వతంత్ర సమాచారం ఏదీలేదు. కల్హణుడు 12 వ శతాబ్ద సంఘటనలవరకు వచ్చే దాకా రాజులు అధికారంలోకి రావటానికి సంబంధించిన కాలక్రమం గూర్చి

కచ్చితమైన సూచనలేవీ లేవు. సమకాలీన విషయాలను కల్హణుడు చిత్రిస్తున్న అనేక సందర్భాలలో కూడా తేదీలు కచ్చితంగా కాక అస్తవ్యస్తంగా ఉన్నవి. ఆయన చాలా ప్రధానమైనవిగా భావించి సుదీర్ఘంగా చిత్రించిన అనేక సంఘటనల విషయంలోనూ.కాలక్రమంలో వ్యవధానాలు కన్పిస్తున్నవి. కొన్ని సందర్భాలలో కల్హణుడు నెలల పేర్లు మాత్రమే చెప్పి సంవత్సరాన్ని పాఠకుల ఊహాకే వదిలివేస్తాడు.

కాశ్మీరు భౌగోళిక స్వరూపంతో గాఢ, సంపూర్ణ పరిచయం, అనుబంధం ఉండటంవల్ల కల్హణుడు వివిధ స్థలాలను గూర్చి ఇచ్చిన వివరాలు కచ్చితంగానూ, స్పష్టంగానూ ఉన్నవి. "ప్రాచీన కాశ్మీరు భౌగోళిక స్వరూపాన్ని సమగ్ర వివరాలతో ఈనాడు మనం తెలుసుకోగలుగుతున్నామంటే, అది కల్హణుని గొప్పదనమే. భారతదేశంలోని మరే ప్రాంతాన్ని గూర్చి కూడా అంతటి వివరాలు లభించవు" (స్టెయిన్). అందువల్ల, రాజతరంగిణి అధ్యయనానికీ, ఆ లోయ ప్రాంత భౌగోళిక స్వరూపానికీ అవినాభావ సంబంధం స్థిరపడింది.

కల్హణుడు వివిధ రాజవంశాలలోని రాజులక్రమాన్ని గూర్చి విశేష శ్రద్ధ ప్రదర్శించినాడు. ఆయా కాలాలలో ఆయా రాజులు, రాణులు ప్రాధాన్యం వహించిన సంఘటనల చిత్రీకరణలో ఆయా రాజుల, రాణుల కుటుంబాలు ఎక్కడనుండి ఏవిధంగా ఆరంభించి విస్తరించినది తెలియ జేయుటంలోని ఆవశ్యకతను కల్హణుడు గుర్తించినాడు. ఈ గుర్తింపువలన చివరి రెండు తరంగాలలో రాజ్యవిషయాలం దేర్పడిన క్లిష్టతను అధిగమించటంలో సౌలభ్యం కలిగింది. మిక్కిలి ప్రసిద్ధులైనవారి వంశ పరంపర చెప్పబడింది.

ఒకటి తరువాత ఒకటిగా భారతదేశంలో పలు ప్రాంతాలను జయించిన కర్కోట వంశీయుడు, కీర్తిమంతుడైన లలితాదిత్యుని వంశక్రమం మనకు సక్రమంగా లభించింది. లలితాదిత్యుని రాజ్య కాలపరిధి (క్రీ. శ. 724-761)ని కల్హణుడు పేర్కొన్నరీతినే కొందరు చారిత్రకు లంగీకరిస్తున్నారు. మరికొందరు కల్హణు డిచ్చిన తేదీలు కచ్చితమైనవని విశ్వసించలేక పోతున్నారు. నిజానికి, కాలాన్ని లెక్కగట్టటంలో కొంత లోపం ఉన్నదని లభిస్తున్న సమాచారాన్ని బట్టి స్పష్టపడుతుంది. ఈ లభిస్తున్న సమాచారాన్ని

ఆధారం చేసుకునే ఈ కాలపరిధి నిర్ణయించబడింది. ఈ సమాచార మిది: కల్హణుని (కావ్యరచనా) కాలం శక. 1071 (క్రీ. శ. 1148). మూడవ గోనందుడు ఈ శక సంవత్సరం కన్నా 2,330 ఏండ్లు పూర్వుడు. ఈ రెండు కాలబిందువుల మధ్య కాశ్మీరును పరిపాలించిన రాజుల పేర్లు, వారి రాజ్య కాలపరిధులు ఇమిడిపోవలసి ఉంటుంది. కల్హణుడు రాజతరంగిణిని రచించినట్లు చెప్పబడిన సంవత్సరం (క్రీ. శ. 1148-49) కచ్చితమైనదనే మనం విశ్వసించవచ్చు. కాని, మూడవ గోనందునికి కల్హణునికి మధ్య నున్న ఈ సుదీర్ఘ కాలంలో లలితాదిత్యునివరకు పరిపాలించిన రాజుల రాజ్య కాలాలకు సంబంధించినంతవరకు అంతగా విశ్వసించగల అవకాశం లేదు.

లలితాదిత్యుడు, తదనంతర కర్కోట వంశరాజుల కాలక్రమం— టాంగ్ వంశానికి చెందిన చైనీయ చారిత్రక పత్రాలను బట్టి గమనిస్తే తేడాలు చాలా కన్పిస్తున్నా గూడా - కల్హణుడు పేర్కొన్న విధంగానే చారిత్రకు లంగీకరిస్తున్నారు. అయితే, తేడా 25 సంవత్సరాలు వస్తున్నది. దీన్నిబట్టి, ఆ వంశపు రాజులను పాతికేళ్లు అనంతర కాలానికి జరుపవలెనని స్టెయిన్ నిర్ణయించినాడు. ఈ నిర్ణయం బాగానే ఉందని అనిపించినా, ఇది మరొక లోపానికి దారితీస్తున్నది. కర్కోట వంశీయుల రాజ్య కాలపరిధిని ముందుకు తీసుకొనివస్తే – క్రీ.శ. 880 అవుతున్నది. కాని, ఆ సంవత్సరంలో అవంతి వర్మ కాశ్మీరును పరిపాలిస్తున్నాడని మనకు తెలుస్తున్నది. కాబట్టి ఈ నిర్ణయం సరికాదు. కాగా, ఈ సమస్యా పరిష్కారానికి ఒకేఒక దారిఉన్నది. కర్కోటవంశ రాజుల రాజ్య కాలాలను అసలుకంటే కొంత ఎక్కువగా, దీర్ఘంగా కల్హణుడు చెప్పిఉంటాడు. అక్కడక్కడా కొందరు రాజుల రాజ్య కాలాలను కొంత కొంతగా కుదిస్తే ఈ పాతికేళ్ళ తేడా తొలగిపోతుంది. ఇట్లా కాకపోతే, ఈ తేడా సమస్య అపరిష్కృతంగానే మిగిలిపోతుంది.

రాజతరంగిణిలో కర్కోటరాజుల చరిత్రకు ముందుగా పేర్కొన్న చరిత్ర కొన్ని సందర్భాలలో పూర్తిగా విశ్వసనీయంకాదని చరిత్ర పరిశోధకు లందరు ఏకాభిప్రాయానికి వచ్చినారు. కొందరు రాజుల రాజ్య కాలపరిధులు (ఉదా: రణాదిత్యుని రాజ్య కాలపరిధి మూడువందల సంవత్సరాలు) ఏవిధంగానూ అంగీకారయోగ్యంగా లేవు. అద్భుతావహాలుగా చిత్రించబడిన అనేక సంఘటనలు కూడా అసంభావ్యాలుగానే ఉన్నవి. కాని, ఈ విష

యంలో ఆర్.ఎస్. పండితుని అభిప్రాయమిది:[1] "కల్హణుడు చెప్పిన వాటిలో కొన్ని లోపాలుండవచ్చు నన్పించినా కూడా - శాసనాలు, నాణాలు, చరిత్ర పత్రాలు, మరేవిధమైన స్వతంత్ర సాక్ష్యాలుకూడా కల్హణుడు చెప్పిన అంశాలను కచ్చితంగా నిరాకరించటం లేదు. కల్హణుడు తనకు పూర్వ, సమకాలీన గ్రంథాలను, ఇతర సమాచారాన్నీ ఉపయోగించుకున్న తరహాలోగూడా లోపాలున్నవని నిరూపించగల సాక్ష్యం కూడా ఏదీ దొరకటం లేదు."

అందువల్ల, కల్హణుడు పూర్వ-సమకాలీన చారిత్రక గ్రంథాలనూ, ఇతర సామగ్రినీ చాలా జాగ్రత్తగా, న్యాయంగా పరిశీలించినాడని మన మెరుగుదుము కాబట్టి, కల్హణుడు పేర్కొన్న రాజుల కాలపరిధులను మనం భగ్నం చేయగూడదని పలువురు వాదిస్తున్నారు. అయితే, ఒకరిద్దరు, లేదా అంతకన్న ఎక్కువమంది రాజులనుగూర్చి స్పష్టమైన సమాచారం లభించని కొన్ని సందర్భాలలో కల్హణుడు లెక్కలు ఉజ్జాయింపుగా చెప్పిఉంటాడని అనుకోవచ్చు. అనంతర తరంగాలలో-ప్రధానంగా 5,6,7,8 తరంగాలలో కల్హణుడు చెప్పిన కాలపరిధులు సక్రమమైనవేనని ఇతర స్వతంత్ర సమాచారం నిరూపిస్తున్నది. కాగా, అంతకు పూర్వపు (మొదటి నాల్గు తరంగాల లోని) ప్రాచీన రాజుల విషయంలో మాత్రమే కల్హణుడు పూర్వ చరిత్ర గ్రంథాలనూ, శాసనాలనూ, నాణాలనూ పూర్తిగా విశ్వసనీయాలని భావించి కాలనిర్ణయాలు చేసి ఉండవచ్చు. గోనందుని తరువాత కర్కోటులు క్రీ. శ. 596 లో అధికారంలోకి వచ్చినారని కల్హణుడు చెప్పిన అంశాన్ని హ్యూవాన్ సాంగ్ బలపరుస్తున్నాడు. (హ్యూవాన్‌సాంగ్ క్రి. శ. 631 లో కాశ్మీరు దర్శించినాడని జనరల్ కన్నింగ్‌హామ్ నిరూపణ). హ్యూవాన్‌సాంగ్ వ్రాతలను బట్టి కి-లి-టో (చైనీయులు కర్కోటులను ఈ విధంగానే పేర్కొనేవారు) ఈ లోయ ప్రాంతాన్ని గోనందుని రాజ్యకాలానికి చాలా శతాబ్దాల తరువాత పాలించినాడు. అంతేకాదు, ఆనాటి రాజులకు బౌద్ధమతంలో విశ్వాసం లేదని కూడా ఆయన ప్రత్యేకంగా వ్రాసినాడు.

కాగా, కల్హణుని రచన తృప్తికరంగా లేదని అంటున్న బుహ్లెర్‌తో ఆర్. ఎస్. పండితుడు వాదానికి దిగినాడు. కల్హణుడు చేసిన రాజ్యకాల నిర్ణయాలను గట్టిగా సమర్థిస్తూ ఆర్.ఎస్. పండితుడు వ్రాసిన అంశాలు విశేషంగా

1. పండిత్; ఆర్. ఎస్., రాజతరంగిణి అనువాదం. సాహిత్య అకాదెమి ప్రచురణ, 1968. అనుబంధం, ఏ , పు. 720-721

గమనింపదగినవి.[1] "....గ్రంథం (రాజతరంగిణి) మిక్కిలి విలువైనదన టంలో ఎవరికీ విప్రతిపత్తి, భేదాభిప్రాయం లేదు. అది చారిత్రాత్మకమైన అతిశయోక్తుల సంకలనం అని ఎవరూ అనటం లేదు. ఈ గ్రంథం చాలా జాగ్రత్తగా సంస్కరింపబడింది. ఓపిక, సామర్థ్యం, నిజాయితీ, పాండిత్యం కలవారి సంస్కరణలో ఈ గ్రంథం తన అసలు స్వరూపాన్నీ, మౌలిక తనూ, స్వచ్ఛతనూ సమగ్రంగా సంపాదించుకున్నది. చాలా గొప్ప చరిత్ర పరిశోధకులుగా ప్రసిద్ధులైన పండితులు ఆ గ్రంథాన్ని గూర్చి ఎంతగానో వ్రాసిఉన్నారు. ఆ గ్రంథపు చారిత్రక విలువలను గూర్చి మన నిర్ణయాల నట్లా ఉంచి, మొదటి తరంగాలలోని విషయాలను గూర్చి కూడా మన ఆలో చనల నట్లా ఉంచి - స్వతంత్ర సాక్ష్యాలేవీ మనకు లభించకున్నా గూడా కొన్ని భాగాలు సక్రమమైనవి కావని అనటానికి మనం సంకోచించినా గూడా, కొన్ని కొన్ని కథలను పౌరాణికగాథలని మనం నిర్లక్ష్యం చేసినా గూడా — ఆ గ్రంథంలోని అంశాలన్నీ తప్పులని నిరూపించగల ఇతర స్వతంత్ర సాక్ష్యాలు విశ్వసనీయంగా మనకు లభించనంతవరకు ఆ గ్రంథం చెప్పే అంశాలు, కనీసం మొదటి తరంగాలలోని అంశాలను కూడా మనం నిరాకరించటానికి వీలులేదు." అయితే, కథ తన ప్రాచీనకాలాలకు సంబం ధించినంతవరకూ పౌరాణిక లక్షణంలోనూ, తన కాలానికి చేరువగా వచ్చినకొలదీ నిజమైన చారిత్రక లక్షణాలతోనూ ప్రవర్తించినట్లు కల్హణుడే సందేహాలకు తావులేకుండా తన చిత్రణద్వారా సూచించినాడు.

---

1. పండిత్. ఆర్. ఎస్; రాజతరంగిణి అనువాదం, సాహిత్య అకాదెమీ ప్రచురణ 1968; అనుబంధం-'ఏ' పుటలు 720-721.

# కల్హణుని కథన శిల్పం

ప్రధానంగా రెండంశాలతో చరిత్ర రూపొందుతుంది. ఒకటి: గతం. అది మనకు వదిలిన వస్తువులు, సంప్రదాయాలు; రెండు: రచన జరిగిన వేళ చరిత్ర పునర్నిర్మాణంలో ఉపయుక్తమయ్యే భావనాశక్తి. చరిత్రకారునికి ఉపలభ్యమయ్యే ఆధారాలన్నీ తనవి కానివి. ఆయన - ఏవో అభూత కల్పనలు, తప్పుడు వ్రాతలు వ్రాయకపోతే తప్ప - నాటికి క్రొత్తగా చేర్చేదిగానీ, మార్చేదిగానీ ఏమీ ఉండదు. కల్హణుడు రాజతరంగిణి ప్రస్తావనలో తన రచనకు ఆధారాలు సమకూర్చిన గ్రంథాలలో వేటిని తాను విలువగలవిగా భావించినాడో చెప్పలేదు. మరి, కల్హణుడు పేర్కొన్న ఆయా ప్రాచీన గ్రంథాలేవి కూడా ఈ నాటికి లభించటం లేదు. అందువల్ల వాటితో పోల్చుకుని నిర్ణయాలు చేసే అవకాశం శూన్యమైపోయింది. కాగా, కల్హణుని చరిత్ర కథన రీతిని విలువ కట్టటానికి, ఆయనకు గల చారిత్రక దృక్పథాన్ని నిశ్చయం చేయటానికి కేవలం ఆయన గ్రంథంలోని అంతరంగిక సాక్ష్యం మీదనే మనం ఆధారపడవలసి వస్తున్నది.

తన కాలానికి బహుశః ప్రచారంలో ఉన్న అద్భుతావహమైన కథలను, సాంప్రదాయికంగా వచ్చే కథల ననేకంగా ఆయన గుది గ్రుచ్చినాడు. దీన్నిబట్టి, ఏ నిష్కపటమైన విశ్వాసంనుండి ఆ కథలు రూపొందినవో, ఆ విశ్వాసంలో ఆయన భాగస్వామి అయినట్టు కన్పిస్తుంది." అసాధ్యాలను ప్రదర్శించటం, అతిశయోక్తులు, భౌతికాతీతమైన విశ్వాసాలు మొదలైనవి చారిత్రక వాస్తవాలతో పడుగుపేకలుగా అల్లుకుపోయినవని మనం ఊహించవచ్చు. ఈ అంశాలను గూర్చి ఏ మాత్రం సందేహపడకుండా, విమర్శించకుండా 'చరిత్ర'గా పూర్వులు ప్రస్తుతీకరించినారనిపిస్తుంది" అన్నాడు స్టెయిన్. ఆయన చేసిన ఈ నిర్ణయం సరియైనదే కావచ్చు కాని, మేఘవాహనుడు మొదలైన ప్రాచీనరాజుల అద్భుత కృత్యాలను గూర్చి సందేహాలు వెలిబుచ్చే 'అల్పబుద్ధులైన సందేహాందోలితాశయు'లున్నారని కల్హణుడు అన్న విషయం (VII-1137) ఈ సందర్భంలో గమనించదగింది. కల్హణుడు ప్రతిదానిని సులభంగా విశ్వసించేవారి కోవకు చెందినవాడు కాకున్నాగూడా,

ఆధునిక కాలపు చారిత్రకులకు ఉండే విమర్శనాత్మకతను కల్హణుని చారిత్రక దృక్పథం కోల్పోయింది. సాధారణంగా పాశ్చాత్యరచయిత లంటున్నట్లు పౌరాణిక-సాంప్రదాయిక గాథలకూ చరిత్రకూ మధ్య భారతీయుల దృష్టిలో విభాజక రేఖ లేదు.

నిజమైన చరిత్రనుగూర్చి భారతీయ దృక్పథం అన్నివిధాలా ప్రాచ్య దేశీయమైనది. సాహసిక యుగాలకు చెందిన పౌరాణిక - సాంప్రదాయిక గాథలను అవగాహన చేసుకొనటంలో మధ్యయుగాల భారతీయచరిత్రకారులు తమ అవిశ్వాసాన్ని తాత్కాలికంగా అణచివేసుకొంటారు. వారికి అవన్నీ గతంలో కొద్దికాలం క్రితమే జరిగిన సంఘటనలవలె అనిపిస్తూ ఉంటవి. కాగా, పాశ్చాత్యులు భావించిన రీతిలో 'చరిత్ర' అనేది 'రాజకీయ' చరిత్రగా భారతీయులు రచించలేదు. మతభావన, ఐతిహాసిక వాస్తవికతలు, కల్పనల మిశ్రరూపంగా చరిత్ర రచింపబడింది చారిత్రక వాస్తవికతలనుండి పౌరాణిక - సాంప్రదాయిక గాథలను వేరుపరచే ప్రయత్నం సాగలేదు. దీన్నిబట్టి, గతకాలపు అద్భుతాలను, పౌరాణికతను అమాయికంగా నమ్మే కల్హణుని స్వభావాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. మొదటి గోనంద రాజులకు మహాభారతయుద్ధంలో సందేహాస్పదమైన సంబంధాన్ని గూర్చి ఆయన వ్రాసినా, తనకు మరీ ప్రాచీనులుకానట్టి లలితాదిత్యుని, లేదా జయాదిత్యుని అద్భుత కృత్యాలను సాంప్రదాయిక కథాకథన రీతిలో వ్రాసినా గూడా, అది అంతే.

ఇదిట్లా ఉండగా, హిమాలయాలలోని లోయప్రాంతమైన కాశ్మీరు చారిత్రకంగా ఒంటరితనాన్నిపొంది ఉండటం గూడా గమనించవలసిన అంశం. బలిష్ఠమైన పర్వతాలు అవరోధాలు కావటంవల్ల విదేశీయ దండయాత్రలనుండి తప్పించుకొనటమేకాక, చారిత్రకంగా ప్రత్యేక విశిష్ట వ్యక్తిత్వాన్ని గూడా కాశ్మీరు సంతరించుకున్నది. స్థానికమైన ఈ ప్రత్యేకతను కల్హణుని రాజతరంగిణి నిజాయితీగా ప్రతిఫలించింది ప్రకృతి ప్రసాదించిన కచ్చితమైన సరిహద్దులుగల చిన్న పర్వతప్రాంతం కావటం మూలాన ఈ ప్రాంతపు భౌగోళిక స్వరూపాన్ని, మనుష్యులగూర్చి వారి వివిధ ప్రవృత్తులను గూర్చి గాఢమైన పరిజ్ఞానం కల్హణుడు సంపాదించుకొనటానికి ఎంతగానో వీలు కలిగించింది. ఏవో కొన్ని అల్పమైన లోపాలుంటే

ఉండవచ్చుగాని, ఈ పరిజ్ఞానమంతా రాజతరంగిణికి మరింత విలువను గడించి పెట్టింది.

చారిత్రకుడుగా కల్హణుడు నిర్ణయాలు చేయటంలో స్వతంత్రుడుగా ప్రవర్తించినవాడు. తాను రాజతరంగిణిని రచిస్తున్న కాలంలోని రాజుల బల హీనతలను, తప్పులను బహిరంగపరచటంలో వెనుకాడలేదు. స్త్రీ, పురుషుల హృదయాలను, వారి ప్రయోజనాలను, సాధనాలనూ కల్హణుడు పరిశోధ నాత్మకంగా వివరించటం గమనిస్తే ఆయన ఆధునిక కాలంలోని చారిత్రకుని వలె కన్పిస్తాడు. నిజానికి ఆత్మీయత అధికమై పక్షపాతం చోటుచేసుకొన టానికి ఎంతో వీలు కలిగించే హర్షుని విషాదకరమైన మరణఘట్టాన్ని వర్ణిస్తున్నప్పుడుగూడా కల్హణుని కథనరీతి నిష్పక్షపాతంగా, సంయమితంగా సాగింది. 'కాశ్మీరు చరిత్రలో నీరో చక్రవర్తి' వంటి హర్షుని విషయంలో విధి చేసిన న్యాయాన్ని ఆయన కథనరీతి గుర్తింపజేస్తుంది. తుంగుడు, సుస్సలుడు, అనంతుడు వంటి చారిత్రక పురుషులు నమూనా పాత్రలుగా కాక, విశిష్టవ్యక్తిత్వం గలవారుగానే చిత్రింపబడినారు. ఈ చరిత్ర అనే నాటకంలో అప్రధానపాత్రలు కూడా జీవంతంగా చిత్రింపబడినవి. ఈ సజీవ వాస్తవిక చిత్రణలు గమనిస్తే, సామాన్యంగా ఇతర కావ్యాలలోనూ చారిత్రక గ్రంథాలైన - 'చరిత్ర'లలో కన్పించే పాత్రలకన్నా రాజతరంణిగిలోనివి ఎంత విశిష్టమైనవనేది తెలుస్తుంది. అంతేకాదు కల్హణుని కథనరీతితో ప్రాణం పోసుకుని ప్రకాశించే వ్యక్తులముందు ఆయా ఇతర కావ్యాలలోని వ్యక్తులు ఎంత నిర్జీవంగా వెలవెల బోతుంటారో స్పష్టపడుతుంది.

చరిత్ర విషయంలో నిజాయితీగా ఉండే కల్హణుని లక్షణం వివిధ పాత్రలను వాస్తవికంగా, సజీవంగా రూపొందించటమే కాక, రాజతరంగిణి లోని అనేక ఘట్టాల కథనరీతిలో కూడా విస్తృతంగా వ్యాపించింది. ఈ చరిత్ర కావ్యంలోని చివరిభాగాల్లో, పూర్వఘట్టాల దృష్ట్యా, కొన్ని కొన్ని ప్రత్యేక సంఘటనలను విస్తృతంగా కల్హణుడు చిత్రించినాడు. అయితే, ఆధునిక చారిత్రకుని దృష్ట్యా విమర్శాత్మకంగా వాస్తవిక చరిత్రపై దృష్టి నిలిపే చరిత్ర పాఠకుడు కల్హణుని ఈ కథనరీతిని తప్పుపట్టవచ్చు. కాని కల్హణుని దృష్ట్యా గమనిస్తే, ఈ విధంగా దీర్ఘతరమైన చిత్రణలు రాజ తరంగిణి యొక్క సారమని ఆయన అనుకొన్నట్లు కన్పిస్తుంది. అప్పుడప్పుడు ఆయా సంఘటనలతో కల్హణునికి వైయక్తికంగా సంబంధమున్నట్లు కూడా

స్ఫురిస్తుంటుంది. కలశుని మరణం, రాణి సూర్యమతి సహగమనం, సుస్సలుని హత్య మొదలైన సంఘటనలకు ప్రత్యక్ష సాక్షిగా ఆయన ఆయా ఘట్టాలను చిత్రించినాడు. అందువల్ల, విస్తృతంగా వివరాలున్నవి. ఈ వివరాలవల్ల ఆ సంఘటనలు విశిష్టంగా కన్పిస్తవి. స్టెయిన్ అన్నట్లుగా – 'హర్ష మహారాజు చివరి సంఘర్షణ, అతడి పలాయనం, దాని ఫలితం; భిక్షాచరుని విషాదకర మరణం, లోహరా పతనం (కల్హణుని కథనరీతి కారణంగా) వాస్తవికాలుగా, సత్యమైనవిగా కనిపించడానికి సరియైన వివరాలు అధికంగా ఉండడం ఒకటే కారణం కాదు! అందుకు కల్హణుని కథనరీతి కూడా కారణమే. మనసుకు హత్తుకొనే విధంగా చెప్పటం, ఆ చెప్పటంలోనూ సామాన్యంగా కావ్యాల్లో ఉండేవాటివంటి అతిశయోక్తులు, అలంకారాలూ ఉండకపోవటం ఆయా ఘట్టాలలోని సత్యత్వాన్ని బలపరుస్తవి. కాశ్మీరు చరిత్రలోని అనేకాంశాలకు మహాభారత – రామాయణాలలో నుండి సరిపోలిన అంశాలను ఉటంకిస్తూ కల్హణుడు తన కథనాన్ని బలపరుస్తుంటాడు. సంఘటనల చిత్రణ విషయం అట్లా ఉండగా, కాశ్మీరు యొక్క అత్యద్భుతమైన ప్రకృతి సౌందర్యానికి పరవశుడైన కల్హణుడు ఆ పారవశ్యాన్ని తన వర్ణనలద్వారా పాఠకులకు కూడా కలిగిస్తాడు. అన్నింటికన్నా మించి, మనకు కావలసిన అంశాలను అందిస్తాడు. తనకు సమకాలికులైన స్త్రీ పురుషులు ఎట్లా ఉండేవారు? వారి వేషధారణ ఏవిధంగా ఉండేది? వారి ఆహార స్వరూపం ఏమిటి? వారి విశ్వాసాలు ఎట్లాంటివి? – స్త్రీ పురుషుల సమస్యలు, వాటి పరిష్కారాలు, ఫలితాలు ఎట్లా ఉండేవి? – ఈ మొదలైన అంశాలన్నీ కల్హణుడు మనకు తెలియజేస్తాడు. కాగా, కల్హణుడు జీవించిన కాలపు రాజకీయ – సామాజిక పరిస్థితులను గూర్చి మరే భారతీయ రచయిత ద్వారా తెలియనంతటి కచ్చితమైన సమాచారం ప్రామాణికంగా కల్హణుని వలన తెలుస్తున్నది.

కాశ్మీరీయుల లక్షణాలలో ప్రముఖమైన చమత్కార, హాస్య ప్రవృత్తితోబాటు, మానవుని బలహీనతలను స్పష్టంగా గుర్తించగలగటమనే లక్షణం కూడా కల్హణునిలో సమృద్ధంగా ఉన్నవి. వ్యక్తి చిత్రణలో ఆయనది అందెవేసిన చేయి. రకరకాల మోసాలతో, చిట్కాలతో తమ సామాజిక స్థాయిని గబగబా పెంచుకుంటూ పోయేవారిని చిత్రిస్తున్నప్పుడు ఆయన కథనరీతిలో అపహాస్యధోరణి పొంగిపొరలుతుంది. తన హాస్యప్రవృత్తితో కాశ్మీరు సైనికుల సహజాతమైన పిరికితనాన్ని; వ్యర్థమూ, ప్రయోజనరహిత

మైన ఆత్మస్తుతినీ బయటపెడతాడు. పుకార్లకూ వదంతులకూ భయపడి యుద్ధరంగంనుండి పారిపోయిన సైన్యాలను గూర్చి చెప్పినాడాయన. పోటీ పడే శక్తులు – సైన్యాలు పరస్పరం భయంతో కంపితాలు కావటం ప్రద ర్శించినాడు స్వదేశీయసైన్యాల 'పరాక్రమం' రాజపుత్రుల సాహసానికి ఎంత భిన్నంగా ఉంటుందో వివరించినాడు. ఇతర ప్రాంతాలనుంచి వచ్చి తననాటి రాజులకు ముఖ్యులై యుద్ధాలుచేసే కిరాయి సైనికులముందు కాశ్మీర సైనికులు వెలవెల బోయిన వైనం చిత్రించినాడు. ఇదేవిధంగా, పలువురు రాజుల, రాణుల, పురోహితుల ప్రవృత్తులను అధిక్షేపణ పూర్వకంగా పరిహ సిస్తాడు

పురోహితవర్గాన్ని గూర్చి తన తిరస్కారభావాన్ని కల్హణుడు ఎక్కడా దాచుకోలేదు. ఆ వర్గంవారి అజ్ఞానం అహంకారంతో పోటీపడి సాగేది. రాజ్య విషయాలలో వారి హానికరమైన, ప్రమాదకరమైన జోక్యాన్ని ఆయన ఆక్షేపించినాడు. వారు వైయక్తికంగా, సామూహికంగా కూడా తమ ప్రత్యేకతను, గొప్పను నిలుపుకొనటానికి చేసే రకరకాల ప్రయత్నాలను, వాటిలో ఇమిడిఉన్న పిరికితనాన్ని అపహాస్యంగా చిత్రిస్తూ వెక్కిరించినాడు.

అధిక్షేపధోరణిలో పారంగతుడైనా కూడా, చారిత్రక సంఘటనల వాస్తవిక చిత్రణలో ఉత్తమ కథకుడుగా తన విశిష్టతను కల్హణుడు నిలుపు కున్నాడు. హర్షుని విషాదకర మరణాన్నిగానీ, అనంతుని దహనక్రియా కలాపాన్ని, ఆయన రాణి - సూర్యమతి 'సతి'ని గానీ చిత్రించే సందర్భంలో ఆయన కథన శిల్పం ఉన్నతస్థాయిలో సాగింది. దట్టంగా క్రమ్ముకున్న కష్టాలలో హర్షుని అసహాయతను, ఆయన పరిజనమే ఆయనను ఒంటరిని చేసి పోవటాన్ని, తనను రక్షించుకొనటానికి చివరిసారిగా ఆయన చేసిన వ్యర్థ సంఘర్షణను చిత్రించిన విధానం మహాకవుల నాటకీయ స్థాయి నందు కున్నది. బాధలుపడిన బ్రాహ్మణుల భయంకరమైన శాపం జయాపీడుని మరణంలో ప్రాధాన్యం వహించటం వంటి కరుణమయ సన్నివేశాల చిత్ర ణలు గాఢప్రభావోత్పాదకమైనవి. కల్హణుని నాటకీయ కథన శిల్పాన్ని- ఋజువుగా, నిరాడంబరంగా రూపకాలంకారాలతో సాగే రచన మరింత ఉద్దీపింపజేసినది.

అలవికాని ధనవ్యయంతో దాదాపు భారతదేశ మంతటా యుద్ధాలు సాగించి, విజయాలు సాధించిన తరువాత జయాపీడుని తెలివిని 'దురాశ

కప్పివేసింది'. దేశంలో పండిన మొత్తం పంటలను, దేవాలయ నిధులను స్వాధీనం చేసుకుని రాజ్య కోశాగారానికి కలుపుకున్నాడు ఈ విధానానికి నిరసనగా బ్రాహ్మణులు ప్రాయోపవేశాలు, ప్రాణత్యాగాలు చేసినారు. ఈ ఘట్టాన్ని నిరాడంబరంగా, ఋజువుగా కల్హణుని కథనరీతి నాటకీయతను సంతరించుకున్న విధాన్ని ఇక్కడ చూడవచ్చు:

> ఏమిటి ఈ బ్రాహ్మణుల ధైర్యం! ఇతర ప్రాంతాలకు వలస పోయినవారు పోగా, మిగిలినవారు తమ నిరసనకు సూచనగా మృత్యువు నాహ్వానించటంలో ఎంతమాత్రమూ వెనుకాడటం లేదు. IV - 632
>
> అవధులు దాటిన క్రౌర్యంతో రాజు - 'తొంబయి తొమ్మండుగురు బ్రాహ్మణులు ఏనాడు చచ్చిపోతే ఆనాడు ఆ విషయం నాకు నివేదించండి' అని మంత్రులతో అన్నాడు. 633
>
> ....రాజు నవ్వుతూ అతనితో (బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్న 'ఇత్తిలు' దనే బ్రాహ్మణునితో) ఇట్లా అన్నాడు - "విశ్వామిత్రాదుల కోపంవల్ల హరిశ్చంద్రాదులు నశించి ఉండవచ్చుగాక, కాని నీవు కోపించినంత మాత్రాన నాకయ్యే దేమిటి?" 650
>
> చేతితో నేల చరుస్తూ బ్రహ్మాండమైన కోపంతో ఉన్న ఆ బ్రాహ్మణుడు రాజుతో ఇట్లా అన్నాడు - 'నేను కోపిస్తే తక్షణం నీ మీద బ్రహ్మదండం పడకుండా ఉంటుందా?' 651
>
> ఈ మాటలు వింటూ, ద్వేషపూరితంగా వికటాట్టహాసం చేసూ రాజు ఆ బ్రాహ్మణునితో ఈవిధంగా అన్నాడు - 'బ్రహ్మదండం నామీద పడనీ. ఇంకా ఎందు కాలస్యం?' 652
>
> 'ఓరి దుష్టుడా! తప్పకుండా పడుతుంది. అదిగో-' అని ఆ బ్రాహ్మణుడు అనగానే భవనం పైకప్పునుండి బంగారు స్తంభం రాజుమీద కూలి పడింది. 653
>
> దీనితో రాజు శరీరమంతా గాయాలైనవి. ఆయనకు మరణబాధ కలిగింది. ఆ గాయాలలో పురుగులు లుకలుకలాడినవి. వాటిని శస్త్రంతో తీసివేయవలసి వచ్చింది. 654

భవిష్యత్తులో కలుగబోయే నరకబాధను స్ఫురింపజేస్తూన్న బాధ ననుభవిస్తూ ప్రయాణోత్సుకమైన ఆ రాజు ప్రాణాలు ఆయన దేహాన్ని వదిలిపోయినవి. 655

ఈ కథానీతిని తెలిపే పద్యమిది :

రాజులు, చేపలు (క్రమంగా) ధనదాహంతోనూ మురికినీటిపై ఆసక్తితోనూ తమ తమ హద్దులను అతిక్రమించి తప్పుదారి పట్టి నప్పుడు – ఈ విపర్యయంకారణంగా, తమ విధిమీద ఆధారపడిన ధర్మాత్ములచేత నరకంలోకి–జాలరివారిచేత హఠాత్తుగా గట్టి వలలోకి ఆకర్షింపబడడం జరుగుతుంది. 658

లలితాదిత్యుడు విజయయాత్రలకు వెళ్ళినప్పుడు తన మంత్రికి 'రాజ ధర్మాలు' చెప్పినప్పటి కల్హణుని రచనారీతి ఈ విధంగా ఉన్నది:

పల్లె ప్రజలకు ఒక సంవత్సరానికి సరిపడినదానికన్నా మించి ఎక్కువ ధాన్యం గానీ, పొలాలు దున్నుకొనటానికి సరిపోయేవాటికన్నా మించి అధికంగా ఎడ్లనుకానీ సమకూడకుండా మాటిమాటికీ చర్యలు తీసుకో వలెను. IV-347

అధికసంపద వారికి సమకూడితే, వారు ఒకే సంవత్సరంలో భయం కరులైన డమరులైపోతారు. రాజాజ్ఞలను తిరస్కరించటంలో సమర్థులవుతారు. 348

నాగరకోచితంగా వస్త్రాలు, కంబళ్ళు, ఆహారపదార్థాలు, ఆభర ణాలు, సాధాలు, స్త్రీలు గ్రామీణులకు లభించినప్పుడు; మరి, శిక్షింప దగిన దుర్మార్గులను రాజులు నిర్లక్ష్యం చేసినప్పుడు; తమక్రిందివారి వ్యక్తిత్వాలను అధికారులు గమనించి వ్యవహరించటంలో విఫలు లైనప్పుడు; సైన్యానికి కావలసిన ధనాన్ని కేవలం ఒకే ఒక ప్రాంతం నుండి రాజులు రాబట్టినప్పుడు; పౌరాధికారులు పరస్పరం వివాహాది సంబంధాలద్వారా సంఘీభావాన్ని పెంపొందించుకొనటాన్ని గమ నించలేనప్పుడు; కాయస్థులవలెనే రాజులుగూడా కార్యాలయాలను (అన్యాయ నిలయాలుగా, లోపభూయిష్టంగా) చూస్తూ ఉన్నప్పుడు – నిస్సందేహంగా ఆ రాజ్య ప్రజల అదృష్టం తలక్రిందులైనదని (దుర దృష్టం పట్టిందనీ) అనుకోవలసిందే. 349–52

మనమీ అధ్యాయాన్ని ముగిస్తూ కల్హణుడు తన కథన విధానంలో విరివిగా పొందుపరచిన సూక్తులు కొన్నింటిని తెలుసుకుందాము. (ఈ సూక్తులు కల్హణునికాలంలోవలె ఈనాడుకూడా ఉపయోగకరమైన సత్యాలు.)

కీర్తిచే పవిత్రులైన రాజులు వ్యసనాసక్తి కారణంగా; నదులలో స్నానం చేసిన తరువాత దుమ్ము పోసుకున్న ఏనుగులవలె మలిను లవుతారు. V-164

అతివిశ్వాసం కారణంగా తెలివిమాలిన కాకి ఇతర పక్షుల సంతానాన్ని తనదిగా భావిస్తుంది. పాలనూ నీటినీ వేరుపరచే నేర్పుగల హంస నిస్సారమైన మబ్బునుచూచి భయపడుతుంది. లోకానుభవంవల్ల నిశితబుద్ధిగల రాజు దుష్టుల మాటలను సత్యమనుకుంటాడు. ఈ విధంగా చాతుర్య – మూర్ఖత్వాలను కలగలిపే విధివిధానం నింద్య మైనది. VI-275

వీరుని పని వీరత్వంతో సాధింపబడుతుంది. పిరికివాని పని నెమ్మ దిగా, పదిలంగా సాధింపబడుతుంది. లేకపోతే వారిమధ్య భేదమే ఉండదు. VI-363

నిప్పు<టుకొని లేకున్నాగూడా కోతులకు కర్ర చలిని తొలగిస్తుంది. లేళ్ళ రోమాలను నీరుగానీ, గాలిగానీ శుద్ధం చేస్తుంది. ప్రతిప్రాణికీ దానిదాని భావనవలననే ప్రయోజనానుభవం కలుగుతుంది. కాగా, నిజానికి, వస్తుగతంగా ఏదీ సహజం కాదు. VI-364

గాలిని తిని ప్రాణాలు నిల్పుకుంటూ కటికచీకటి నిండిన కన్నంలో నిద్రించే పామువలె బ్రతుకుతూ ఉంటాడు. నగ్నంగా ఉండి ఒడలు దాచుకొనటానికి కావలసిన బట్టలను ఇతరులనుండి ఆశిస్తుంటాడు. ఈవిధంగా లోభాన్ని ప్రదర్శిస్తూ ఇతరుల లాభంకోసం ధనాన్ని రక్షిస్తుంటాడు. కాగా, అన్యులకు ఉపయోగించటంలో లోభికన్నా మించినవా డెవడైనా ఉంటాడా? VII-502

సరస్సుయొక్క అడుగుభాగపు నేలను భూమిలోని నీటిజలలు పోషి స్తాయి. ఆకాశం నుండి నీరు కురుస్తుంది. కాల్వల ద్వారా అన్నివైపుల నుండి నీరు వచ్చిపడుతుంది. ఈవిధంగా శుష్కసరస్సు వర్షర్తువులో నీటితో నిండిపోతుంది. కాగా, అదృష్టం కలిసివచ్చినప్పుడు, సంప

దలు వంపల దారులలో వచ్చిపడుతవి. వాటికి ప్రవేశద్వారం కానిదేది? VII-565

గడ్డిపోచలను తగులబెట్టి విశాలమైన పచ్చికబయళ్ళను విధి సృష్టి స్తుంది. తీవ్రమైన గ్రీష్మం వెనువెంటనే వర్షంవస్తుంది. చంచల నియ మాలుగల విధియొక్క కార్యకలాపాల విషయంలో 'ఇదట్లాగే' అని నమ్మకం కుదురట మెట్లా? VIII-1790

భవ్యాత్మత్వం శాంతంయొక్క ఔన్నత్యాన్ని ఉద్భాసింప జేస్తుంది. ఆ శాంతమనేది లేకపోతే మనోభావాలు కఠినంగానే ఉంటాయి. చంద్ర కాంతశిల కఠినంగానే ఉంటుంది కాని, అమృతతేజస్కుడై శీతకిరణుని కరస్పర్శతో కరిగిపోతుంది. VIII-3030

నృత్యమందిరంలో హాస్యగాడు; అధిక్షేపాత్మకమైన ఏకాంత నాటక ప్రదర్శనాలలో కంథాకవి; తానుండే ఇంటి గొడ్లసావడి దగ్గరఉండే కుక్క, కొండలమీది పల్లాలలో కట్టెలు కొట్టుకొనేవాడు, రాజ గృహాల్లో ఇచ్చకాలాడేవాడు - వీరంతా తామున్న ప్రదేశాలలో పరా క్రమవంతులే. ఆ తావులు తప్పితే నీటినుండి ఒడ్డునపడ్డ మొసలివలె సత్వహీనులవుతారు. VIII-3139

ఎంత చెప్పినా, రాజతరంగిణిని సమగ్రంగా అవగాహనపరచు కోవటం అంత సులభం గాదు. ఈ గ్రంథంలో మిగిలిన అన్ని తరంగాల కన్నా పెద్దదైన ఎనిమిదవ తరంగం (3,449 శ్లోకాలు) కల్హణుని సమ కాలీన సంఘటనలను, నిజానికి, కలగాపులగం చేసిన చిత్రణ. కల్హణుని భాషలో క్లిష్టత్వం, అప్రసిద్ధత్వం, కవితా సంబంధమైన అస్పష్టత పలుచోట్ల చోటుచేసుకున్నవి. ఈ సందర్భంలో ఆధునిక కాలపు చరిత్రకారునికి ఇబ్బంది కలిగించే విషయం మరొకటి గమనించవలసి ఉన్నది. అనేక సందర్భాలలో కల్హణుడు సమకాలీన విషయాలతో పరిచయం కలిగిఉన్న తన కాలపు పాఠకులను ఉద్దేశించి మాత్రమే వ్రాసినట్లుగా కన్పిస్తుంది. తన గ్రంథంలో పేర్కొనబడిన అప్రధాన వ్యక్తుల పూర్వపరిచయం పాఠకులకు ఉన్నదనే ఆయన అనుకుంటాడు. తరచుగా పలువురిని వారివారి పదవీ నామాలతోనే పేర్కొంటాడు. ఈ లోపాలు ఉద్దేశపూర్వకమైనవి కాకపోవచ్చు కాని, అనేక వివరాలతో ప్రామాణికంగా ఉన్న ఈ భాగపు విలువను ఆ లోపాలు కొంతమేరకు తగ్గిస్తున్నవి.

ఇదిట్లా ఉండగా, అంతఃపుర కుతంత్రాలు, నకిలీ వారసుల, సేనాపతుల తిరుగుబాట్లు, ప్రజల ఎడతెగని బాధలు మొదలైనవాటి విషయంలో నాటకీయ రచనాపద్ధతి పొసగక పద్యాలే రచన రూపాలుగా కనిపిస్తవి. పాఠకులకు విసుగు కలగకుండా ఉండటానికి మధ్య మధ్యన ఆకర్షణీయమైన ఉపమలూ, శ్లేషలూ, విరోధాభాసలు మొదలైన అలంకారాలు కథన రీతిని ఉల్లాసకరం చేస్తుంటవి. ఇంతమాత్రాన అలంకారిక శైలిని ఆయన సాధించటానికి ప్రయత్నించినాడనటానికి వీలులేదు. ఆసక్తికరమైన సంభాషణలు గూడా – అలంకారాల మాదిరిగానే – వచనాత్మకతవల్ల కలిగే వైవిధ్య రాహిత్యాన్ని తొలగించటం కోసమే నిర్వహించబడినవి. వీటివలన ఆయా పాత్రల మనఃప్రవృత్తిని తెలుసుకొనే వీలు కలుగుతున్నది. ఈప్రయోజనం కోసమే కథనంలో తరచుగా వృత్తాలు మార్చటం, పెద్ద పెద్దవృత్తాలు చేర్చటం, సూక్తులు ప్రయోగించటం జరిగింది. ప్రాతచిత్రణలో అడుగడుగునా కల్హణుని కవితా భావుకత వ్యక్తమవుతుంది. ఈ విధంగా గమనిస్తే, ప్రాచీన – ఆధునిక కావ్యాలలో – అవి భారతీయాలు కావచ్చు, పాశ్చాత్యాలు కావచ్చు – కల్హణుని కావ్యంయొక్క ఉన్నతస్థాయి అవగాహనకు వస్తుంది. కథనరీతిలో ఆయన స్థానం అత్యున్నతమైంది. ఆయన పొందుపరచిన అనేక సూక్తులు, సామెతలూ కాశ్మీరులో ఈనాటికీ ప్రచారంలో ఉన్నవి.

# చరిత్ర పూర్వయుగం:
# ప్రాచీనయుగం

లౌకిక శక సంవత్సరం 4224 కు సరియైన శక సంవత్సరం 1070 (క్రీ. శ. 1148)లో రాజతరంగిణి రచన మొదలు పెట్టి 4225 (క్రీ. శ. 1150)లో పూర్తిచేసినట్లు కల్హణుడు మనకు చెప్పినాడు. రాజతరంగిణి మొదటి మూడు తరంగాలలో మొత్తం 3,050 సంవత్సరాల కాలం చిత్రింప బడినది. ఇన్ని వందలేండ్లకు సంబంధించిన కథనంలో పౌరాణికత వ్యక్త మయ్యే సాంప్రదాయిక కథలు, గాథల మధ్య చాలాభాగం 52 రాజుల కాలాలలోని రాజవంశాల పట్టికలతో మాత్రమే నిండి ఉన్నది.

రాజతరంగిణిని శివప్రార్థనతో ఆరంభించి కల్హణుడు పాఠకుని 'సహృదయ మిత్రుడు'గా సంబోధించి 'రస ప్రవాహమైన ఈ రాజతరంగిణి (నది)లో స్వేచ్ఛగా (రస)పానం చేయ'టానికి ఆహ్వానించాడు. ఆ తరువాత ఆ లోయప్రాంతానికి ఆదిమ రూపమైన 'సతీ సరస్సు'ను ప్రస్తావించి కాశ్మీరు రాజ్యం ఏర్పడిన రీతిని వివరించినాడు. కశ్యప ప్రజాపతి జలోద్భవుడనే రాక్షసుని చంపి ఆ సరస్సున్న భూమిని 'కాశ్మీర' మండలంగా నిర్మించినాడు. నాగులందరికి చక్రవర్తి అయిన నీలుని సంరక్షణలోని ఈ ప్రాంతం 'ఆధ్యాత్మిక శక్తితో తప్ప, ఆయుధశక్తితో జయింపరానిది'గా రూపొందింది. "తీవ్ర కిరణుడైన సూర్యుడు కూడా వేసవికాలంలో తనంతట తానే తన ఉష్ణత్వాన్ని తగ్గించుకొని ఈ ప్రాంతాన్ని గౌరవిస్తాడు. 'విద్య – విజ్ఞానం[1],' ఉన్నత సౌధాలు, కుంకుమపువ్వు, చల్లనినీరు, ద్రాక్షపండ్లు మొదలైనవాటితో సమృద్ధంగా నిండివున్న ఈ ప్రదేశానికి సాటివచ్చే

---

1. ప్రాచీన కాలంనుండి కూడా సంస్కృత విజ్ఞానానికి కాశ్మీరు నిలయంగా ఉండేదని అంగీకరించే వారిలో హ్యువాన్ సాంగ్‌కూడా ఒకడు. ఆయన కల్హణుని కన్నా అయిదు వందలేండ్లకు పూర్వం కాశ్మీరును దర్శించి నాడు "కాశ్మీర ప్రజలు విద్యా ప్రేమికులు. గొప్ప సంస్కృతి గలవారు. శతాబ్దాల తరబడిగా విజ్ఞానం కాశ్మీరులో గౌరవింప బడుతున్నది" అని ఆయన వ్రాసినాడు

ప్రదేశం స్వర్గంలో కూడా లేదు" అంటూ కాశ్మీరు విశిష్టతను కల్హణుడు అభివర్ణించినాడు.

ఈ చరిత్ర గ్రంథ ప్రారంభంలో వచ్చే సాంప్రదాయిక కథలు, గాథలు కల్హణుని నాడు ప్రచారంలో ఉండగా, వాటినే ఆయన స్వీకరించి ఉంటాడు. "కల్హణుడు కొన్ని సందర్భాలలో స్పష్టంగా వివరించిన ప్రసిద్ధ సంప్రదాయాలు ఆయన అంగీకరించిన అంశాలతోనూ, ఆయన ప్రమాణీకరించిన గ్రంథాలతోనూ భేదించటం మనం గమనించవచ్చు" అంటాడు స్టెయిన్.

కల్హణుని రాజతరంగిణి ననుసరించి అతి ప్రాచీనకాలంలో కాశ్మీరును 52 రాజులు పరిపాలించినారు. వీరిలో మొదటి గోనందుడు, ఆయన కుమారుడైన దామోదరుడు, ఆయన భార్య యశోవతి, వారి కుమారుడు రెండవ గోనందుడు—ఈ నలుగురి పేర్లే 'నీలమత పురాణం'లో పేర్కొనబడినవి. తన కాలంలో వ్యాపించిఉన్న సాంప్రదాయిక కథలనుండి సంపాదించిన ఈ రాజులకు కల్హణుడు మహాభారత కథలతో సంబంధాలు కలుపుతాడు. కల్హణుని వ్రాతలను బట్టి మొదటి గోనందుడు మగధరాజైన జరాసంధునికి బంధువు. జరాసంధుడు కృష్ణునిమీద దండెత్తినప్పుడు ఆయనకు సహాయంగా వెళ్లి ఆ యుద్ధంలో మరణిస్తాడు. మొదటి గోనందుని తరువాత కాశ్మీరు రాజైనవాడు ఆయన కుమారుడు మొదటి దామోదరుడు. తన తండ్రి మరణానికి ప్రతీకారం చేయవలె ననుకుంటాడాయన. ఆ ప్రయత్నంలోనే ఆయన గాంధారంలో కృష్ణునితో యుద్ధంచేస్తూ మరణిస్తాడు. అప్పటికి ఆయన భార్య యశోవతి గర్భవతి. కృష్ణుని సలహానుసరించి కాశ్మీరు రాజవంశీయులు యశోవతిని తమ రాణిగా ఎన్నుకుంటారు. ఆ తరువాత ఆమెకు జన్మించిన రెండవ గోనందుడు పసితనంలోనే కాశ్మీరు రాజుగా అభిషిక్తుడవుతాడు. మహాభారత యుద్ధకాలానికి ఈ రాజు చాలా చిన్నవాడు. అందుకే కావచ్చు, మహాభారత యుద్ధంలో పాల్గొన్న రాజులలో కాశ్మీరురాజు ప్రస్తావన కన్పించదు.

రెండవ గోనందుని తరువాత "అతని ననుసరించి రాజ్యానికి వచ్చిన 35 గురురాజులు విస్మృతి సముద్రం పాలైనారు. వారికి సంబంధించిన ఆధారాలన్నీ నశించి పోవటంతో వారి విషయాలేవీ తెలియకుండా పోయిన" వన్నాడు (I-83) కల్హణుడు.

ఒకప్పుడు వూలార్ సరస్సులో నగరం మునిగిపోయిందని[1] ఈ నాటికీ అనూచానంగా వచ్చే కథలు చెప్పుతున్నవి. స్వచ్ఛజల సమృద్ధిగల ఈ సరస్సు భారతదేశంలోకల్లా అతి విస్తృతమైంది. పై రాజుల్లో చివరి వారికి సంబంధించినట్లు చెప్పబడే హిమల్, నగ్రే, బొంబర్, లోలర్ నగరాలను గూర్చిన జానపద గాథలు ఈనాటికీ వ్యాప్తిలో ఉన్నవి.

పాండవ వంశానికి[2] చెందిన రాజులు ఈ లోయప్రాంతాన్ని పరిపాలించినారనీ, ఈ చివరి రాజులలో దాదాపు ఇరవైముగ్గురు ఆ వంశానికే చెందినవారనే ఒక విశ్వాసం కాశ్మీరీయులలో ఈ నాటికీ వ్యాపించి ఉన్నది. అర్జునుని మనుమడైన హరణదేవుడు ఈ రాజులలో మొదటివాడని, తన ప్రేరణవలన రెండవ గోనందుని హత్యజరిగిన తరువాత ఆయన పాండవ వంశాన్ని కాశ్మీరులో నెలకొల్పినాడని చెప్పబడింది.

వీరి తరువాత వచ్చినరాజులు ఎనమండుగురు. వారి పేర్లు : లవుడు, కుశుడు, ఖగేంద్రుడు, సురేంద్రుడు, గోధరుడు, సువర్ణుడు, జనకుడు, సాచి నారుడు. వీరిలో మొదటి నలుగురిది ఒక వంశంకాగా, మిగిలిన నలుగురిది మరొకవంశం. ఈ రాజులు నెలకొల్పిన నగరాలు కొన్ని గుర్తింపబడినవి. అయితే, వీరిలో ఏ ఒక్కరి చారిత్రక వాస్తవికతను గూర్చి కూడా ప్రామాణిక సమాచారమేవీ కచ్చితంగా తెలియరావటం లేదు,

ఈ చారిత్రక గ్రంథంలో ప్రస్తావింపబడిన చరిత్ర ప్రసిద్ధ రాజులలో మొదటివాడు అశోకచక్రవర్తి. కల్హణుడు చెప్పిన దానినిబట్టి అశోకుడు 'జిన' (అనగా, బౌద్ధం కావచ్చు) మతం స్వీకరించినాడు. అనేక స్తూపాలను, విహారాలను నిర్మించటమే కాక, 'శ్రీనగర'మనే పేర ఒక నగరాన్ని కూడా నెలకొల్పినాడు. 'అశోకేశ్వరు'ని పేర ఒక శివాలయాన్ని నిర్మించినాడు. కల్హణుడు ఈ 'అశోకు'ని ఆ ప్రాంతపు రాజుగానే చెప్పినాడు కాని, కల్హణ గ్రంథంలో చెప్పబడిన తేదీలు సంవత్సరాల తేడాను గూడా లెక్కచేయక, తూర్పున బెంగాలువరకు, పశ్చిమాన హిందూకుశ పర్వతాలవరకు తన

1. కొందరు ముస్లిం చరిత్రకారులు అందించిన కొంత సమాచారం విశ్వసనీయం కాదని గుర్తింపబడింది.
2. ప్రసిద్ధమైన మార్తాండ, మరికొన్ని తదితర దేవాలయ శిథిలాలు పాండవాలయాలని ప్రసిద్ధ వ్యవహారం.

ప్రభుత్వాన్ని వ్యాపింపజేసిన మగధ చక్రవర్తి అయిన అశోకుడేనని చారిత్ర కులు అంగీకరిస్తున్నారు.

కాశ్మీరు ప్రాంతపు హరముకుట గంగలోని భూతేశ శివాలయంలో అశోకుడు శివుని అర్చించి "తన తీవ్ర వ్రతాలతో తర్పితుడైన ఆ దేవుని అను గ్రహం వల్ల ఒక కుమారుని పొందినా"డని చెప్పబడినది. ఆ కుమారుని పేరు జలౌకసుడు. అశోకుని తరువాత స్వతంత్ర ప్రభువుగా రాజ్యానికి వచ్చినాడు. కల్హణుడు వివరించిన అనేక సంప్రదాయాలకు ఆయన మూలం. ఆయన ప్రతిదినం భూతేశ, విజయేశ్వర దేవాలయాలలో పూజలుచేసేవాడు. గొప్ప యుద్ధ వీరుడైన ఈ రాజు మ్లేచ్ఛుల[1] దేశాన్ని పరాస్తం చేసినాడు. ఇక్కడ మ్లేచ్ఛులంటే, బహుశః, కాశ్మీరు సరిహద్దు ప్రాంతాలను ఆక్రమించే ప్రయత్నంతో దాడులు సాగించిన ఇండో - గ్రీకువారై ఉంటారు. అరవై సంవత్సరాల రాజ్య పరిపాలన తరువాత జలౌకసుడు రాజ్యకార్య నివృత్తుడై భార్యతో కలిసి శిరమోచన వనానికి వెళ్ళి తన చివరికాలాన్ని భగవద్ధ్యా నంలో గడిపినాడు.

జలౌకసుని తరువాత, బహుశః, అశోకుని వంశీయుడే అయిన రెండవ దామోదరుడు రాజైనాడు. పీఠ భూప్రాంతంలో ఆయన దామోదర ఉదర అనేపేర ఒక నగరం నెలకొల్పినాడు. శ్రీనగర్ విమానాశ్రయ ప్రాంతం అదే. ఇప్పటికీ అదే పేరుతో ప్రసిద్ధంగా ఉన్నది.

మౌర్య సామ్రాజ్య పతనానంతరం భారతదేశపు వాయవ్య ప్రాంతం విదేశీయుల దాడులకు గురైంది. కాశ్మీరుకూడా ఈ దాడులను తప్పించుకో లేకపోయింది. అయితే రెండవ దామోదరుని మరణం తరువాత - కుషాణ (తురుష్క) రాజులు రాజ్యాధికారంలోకి రావటానికి ముందరి రెండు శతాబ్దాల కాల వ్యవధానం రాజతరంగిణిలో శూన్యంగా కన్పిస్తున్నది. కుషాణ రాజులైన హుష్క, జుష్క, కనిష్కులు శాసనాధారాలను బట్టి హువిష్క, వశిష్క, కనిష్క (మొదటి కనిష్కుడు)లని గుర్తింప బడు తున్నారు. ఇక్కడినుండి కల్హణుడు మళ్లీ ప్రామాణికమైన చరిత్రను చిత్రించి నాడు. ఏకకాలంలోనే పరిపాలన సాగించిన ఈ ముగ్గురూ తమ తమ పేర ఒకొక్క నగరాన్ని నెలకొల్పినారు. హుష్కపురం, జుష్కపురం, కనిష్క పురం - ఇప్పటికీ ఆ పేర్లతోనే ఉన్నవి.

---

1. చూ. 28 పుట. అధోజ్ఞాపిక.

తురుష్క పాలకులను గూర్చి కల్హణుడు వ్రాసినదంతా, ఈ లోయ ప్రాంతంపై కుషాణుల పరిపాలనను ధ్రువపరుస్తున్నది. (కుషాణులు కాశ్మీరులో బౌద్ధాన్ని వ్యాపింప జేసినారన్న అంశాన్ని హ్యూవాన్ సాంగ్, అల్బెరూని మొదలైనవారి వ్రాతలు నిశ్చయపరుస్తున్నవి.) కనిష్కుడు బౌద్ధుల మూడవ మహాసభను కాశ్మీరులో నిర్వహించినట్టు బౌద్ధ సంప్రదాయంలో ప్రసిద్ధంగా చెప్పబడింది. కుషాణులు ఎన్నో మఠాలను, చైత్యాలను నిర్మించినారు గాని, వాటిలో ఏదీ మిగిలిలేదు. బౌద్ధుల ఈ చారిత్రాత్మిక మహాసభ బౌద్ధమత చరిత్రలో చాలా ప్రాధాన్యం వహిస్తున్నది. కాశ్మీరులో వ్యాపించి వృద్ధిపొందిన 'మహాయాన' రీతికి ఈ మహాసభ ఎంతో ఔన్నత్యం సమకూర్చింది.

మహాయాన రీతికి అనన్య సమర్థకుడైన నాగార్జునుడు[1] అశ్వఘోషుని తరువాత మరల అంతటి ప్రధానుడుగా గౌరవింప బడుతున్నాడు. నాగార్జునుడు తన జీవితంలో అధికభాగం శారదార్హ్వాన్ విశ్వ విద్యాలయంలో గడిపినట్లు తెలుస్తున్నది. ఆధునికంగా హార్వాన్ అని నాటి శారదార్హ్వాన్ పిలువబడుతున్నది. అక్కడి త్రవ్వకాలలో బౌద్ధ అవశేషాలు లభించినవి.

ఈ కుషాణుల రాజ్యకాల క్షీణదశలో అభిమన్యుడువంటి స్థానిక పరిపాలకులు పైకి వచ్చినట్లు కన్పిస్తుంది. కుషాణులతో వారికున్న సంబంధాల విషయం అట్లా ఉండగా, వారు మాత్రం బౌద్ధమత విరుద్ధ ప్రవృత్తితో ముందుకు వచ్చినారు. ఆ తరువాతి రాజైన మూడవ గోనందుడు—ఆ తరువాత వచ్చిన మరి నల్గురు రాజులు అందరి కందరు శైవ సంప్రదాయాన్ని అభిమానించి పెంపొందించినారు. కాశ్మీరులో సాంప్రదాయికంగా ప్రాచీన కాలంనుంచి సాగివస్తున్నది శైవమే. మరో అయిదుగురు రాజులు ఆ తరువాత పేర్కొనబడినారు.

కల్హణుడు పేర్కొన్న ఈ రాజులందరిలో ప్రత్యేకంగా చెప్పుకోదగినవాడు మిహిరకులుడు. వేనకులుని కుమారుడు, తండ్రి తరువాత రాజైనవాడు. గుప్త సామ్రాజ్య పతనం తరువాత భారతదేశపు ఉత్తర ప్రాంతంలో అత్యధిక భాగాన్ని పరిపాలించినా డాయన. అయితే, మిహిర

1. నాగార్జునుని తత్త్వాన్ని గూర్చి ఈ మధ్య జపాన్ పండితుల వ్యాఖ్యానాలవలన నిశిత - విమర్శనాత్మకాసక్తి పెరిగింది.

కులుడు క్రూరుడైన పరిపాలకు డనటంలో సందేహంలేదు. ఆయన కాశ్మీరు లోయప్రాంతాన్ని పరిపాలించినా డన్నది శాసనాల ద్వారా, హ్యూవాన్ సాంగ్[1] వ్రాతల ద్వారా ధ్రువపడుతున్నది. కల్హణుని వ్రాతలను బట్టి మిహిరకులుడు క్రూరుడు, దోపిడీలు చేసి ప్రజలను పీడించినవాడు. బౌద్ధులనూ; వారి స్తూపాలనూ, మఠాలనూ నేలమట్టం చేయటంలో పైశాచికానందాన్ని అనుభవించే వాడాయన. సిలోన్ రాజును అతిక్రూరంగా మిహిరకులుడు జయించినట్టు చెప్పబడింది. మరి, ఆయన శివభక్తు[2] డని, శ్రీనగర్ వద్ద ఒక గొప్ప శివాలయం కట్టించినాడని కల్హణు డంటున్నాడు. చివరకు మిహిరకులుడు మానసికమైన వైరుద్ధ్యాలకు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నాడు.

మిహిరకులుని మరణానంతరం ఒక వంద సంవత్సరాల చరిత్ర విస్మృతిపథంలో పడిపోయింది. అతని తరువాతి రాజులని కల్హణుడు చెప్పిన వారందరిలో గోపాదిత్యుడే చారిత్రకంగా వాస్తవిక వ్యక్తి అనిపిస్తుంది. ఆయన గోపగిరిపై జ్యేష్ఠేశ్వరాలయం నిర్మించినాడు. ఇప్ప డాగిరి శ్రీనగర్‌లో శంకరాచార్య గిరిగా ప్రసిద్ధమైంది. గోపాదిత్యుని మనుమడైన ఖింఖిలుడు 'హూణ' (ఒక అటవికజాతి) పరిపాలకుడు. ఆయన తనకు తాను 'దేవ సాహిఖింగిల' అని నాణాల మీద ముద్రింపించుకున్నాడు.

రాజతరంగిణి రెండవ తరంగంలో పేర్కొనబడిన ఆరుగురురాజులు వేరు వేరు వంశాలకు చెందినవారు. మొదటి యుధిష్ఠిరుని పదభ్రష్టునిగా చేసిన తరువాత, ఆయనను దేశంనుంచి బహిష్కరించి కాశ్మీరరాజబంధువులు విక్రమాదిత్యుని బంధువు ఒకనిని ఆహ్వానించి రాజ్యం ఆయనకు సమర్పించినారు. ఆ బంధువు పేరు (మొదటి) ప్రతాపాదిత్యుడు. అయితే, అంతఃకలహాల కారణంగా రాజ్యం కల్లోలితమై కొన్నాళ్లపాటు "హర్షుడు మొదలైన విదేశీయరాజుల" పరిపాలనలోనికి వచ్చింది. అయితే, ఈ హర్షుడు క్రీ.శ. ఆరవశతాబ్దం పూర్వార్ధంలో ఉజ్జయిని రాజధానిగా రాజ్యం

1. సి – యు – కి (అనువాదం : బీల్) I పు. 167.

2. 'కాటలాగ్ ఆఫ్ కాయిన్స్ ఇన్ ఇండియన్ మ్యూజియమ్' అనే తన గ్రంథంలోవి. స్మిత్-మిహిరకులుడు శివభక్తుడని కల్హణుడు వర్ణించిన అంశాన్ని నాణాల ఆధారంతో ధ్రువపరచినాడు.

చేసిన హర్ష విక్రమాదిత్యుడని కల్హణుడు భావించి ఉంటాడనిపిస్తుంది. కాని, కల్హణుని గ్రంథంలో ఇక్కడ ఒక లోపం ఉన్నది. ప్రతాపాదిత్యుడు, అయన తరువాత రాజ్యానికి వచ్చిన ఆయన కుమారుడైన జలౌకసుడు చెరి 32 సంవత్సరాలు పరిపాలన సాగించినట్లు కచ్చితంగా చెప్పబడింది.

తరువాతి పరిపాలకుడు తుంజినుడు. గతంలో రాజ్య నిష్కాసితుడైన యుధిష్ఠిరుని వంశంవాడు. తుంజినుని పరిపాలనా కాలంలో గొప్ప కరువు వచ్చింది. అసంఖ్యాకంగా ప్రజలను పొట్టన బెట్టుకొన్న తీవ్రమైన ఈ కరువును కల్హణుడు అనేక వివరాలతో కళ్లకు కట్టునట్లు వ్రాసినాడు. తుంజినుని భార్య 'వాక్పుష్ట'. ఆమె పరమ పతివ్రత. కటిమూస (ఈనాటి 'కైమూహ్'), రామూస (రామూహ్) అనే నగరాలను నెలకొల్పిన దామె. రాజతరంగిణి రెండవ తరంగంలోని చివరిరాజు ఆర్యార్జునుడు. ఆయన రాజ్యంపై తన హక్కును వదులుకోవటం కాశ్మీరుపాలనలో గోనంద వంశీయుల పునః ప్రతిష్ఠకు అవకాశం కలిగించింది.

పునఃప్రతిష్ఠితమైన గోనంద వంశపురాజులలో మొదటివాడు మేఘ వాహనుడు, గోపాదిత్యుని కుమారుడు. అస్సాము రాజకుమారి అయిన అమృతప్రభాదేవి స్వయంవరానికి మేఘవాహనుడు వెళ్ళినాడు. ఆమె అయనను వరించింది. మేఘవాహనుడు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఉత్తమ పరిపాలకుడు, వీరుడు. సిలోనువరకు జైత్ర యాత్రలు సాగించినాడు. ఆయన తన పేర మేఘవనమనే నగరాన్ని నెలకొల్పగా, ఆయన రాణి విదేశ భిక్షువుల వసతి సౌకర్యాలకోసం తనపేర 'అమృత భవన' మనే గొప్ప మఠాన్ని నిర్మించింది.

పేర్కొనదగిన మరొక రాజు మాతృగుప్తుడు. మాతృగుప్తుడు కవి.[1] ఉజ్జయినీ రాజైన విక్రమాదిత్యుడు కాశ్మీరుకు ప్రసాదించిన రాజు ఈ

1. మహాకవి కాళిదాసే ఈ మాతృగుప్తుడని నిరూపించటానికి కొందరు పండితులు ప్రయత్నిస్తున్నారు. డాక్టర్ బౌదాజి పరిశోధన ప్రకారం కాళిదాసు "ఉజ్జయినీ నివాసి అయినా గూడా....పలు కారణాలవల్ల ఆయన కాశ్మీరీయుడు. ఆయన తన కావ్యాల్లో వర్ణనల కెన్నుకున్నది ఉత్తర భారతీయ ప్రకృతి – భౌగోళికత, ప్రధానంగా హిమాలయ పర్వత ప్రాంతాలు." బౌదాజి ననుసరించిన డాక్టర్ ఎల్. డి. కల్లాగూడా కాళిదాసు జన్మస్థానం కాశ్మీరే నంటారు.

మాతృగుప్తుడు. ఈ రాజ కవి గొప్ప కళాపోషకుడు. 'హయగ్రీవ వధ' అనే కావ్యం రచించిన గొప్పకవి భర్తృమేఁరునికి (ఈయనను కేవలం 'మేఁరుడు' అనికూడా అంటారు) మాతృగుప్తుడు ఆశ్రయ మిచ్చినాడని కల్హణుడంటాడు. ఈ రాజ కవి – వైష్ణవ సంప్రదాయానికి చెందినవాడు. ఒక విష్ణ్వాలయం కట్టించినాడు. అక్కడి విష్ణువు పేరు మాతృగుప్తస్వామి. విక్రమాదిత్యుని మరణంతో మాతృగుప్తుడు దుఃఖితుడై రెండవ ప్రవరసేను నికి[1] అనుకూలపడే విధంగా రాజ్యాన్ని పరిత్యజించినాడు. ప్రవరసేనుడు తన ఈ లోయప్రాంతాన్ని దాటి దండయాత్రలు సాగించి గంగా-యమునా మధ్య ప్రాంతమైన సౌరాష్ట్రాన్నీ, త్రిగర్తదేశాన్నీ జయించినాడు. ఆ యాత్రల లోనే అయన ఉజ్జయినీ ప్రభుత్వాన్ని కూడా గజగజ లాడించినాడు. ఈ నాడు శ్రీనగర్ ఉన్న ప్రదేశంలోనే ఆనా డాయన ప్రవరసేన పురమనే నగరాన్ని తనపేర నెలకొల్పినాడు.

ప్రవరసేనుని తరువాత నాల్గవరాజైన రణాదిత్యుడు ఎన్న దగినవాడు. ఆయన మూడు వందల సంవత్సరాలు రాజ్యపాలన సాగించినా డన్న ప్రజల వాడుకను కల్హణుడు ఉదాహరించినాడు. "ఈ విధంగా అసాధారణ రీతిలో చెప్పబడిన ఒక రాజుయొక్క రాజ్యకాల పరిధి ఆకాలపు నిజమైన చరిత్రను మనం నష్టపోయినామని నిశ్చయంగా సూచిస్తుంది" అని మజూమ్ దార్ భావం.[2] కాని త్రివేది అనే ఆయన ఈ సుదీర్ఘ కాల జీవనం ఏదో యోగశక్తి వలననే సాధ్యమై ఉంటుదని అంటూ—'అనేక పండితులు ఈ మధ్యకాలంలో ఒకానొక స్వతంత్ర రాజ్యం ఉండి ఉంటుందని ఊహిస్తు న్నా'రంటారు.[3] రణాదిత్యుడు చోళరాజైన రతిసేనుని కుమార్తె రణ రంభను వివాహ మాడినట్లు చెప్పబడింది. కల్హణుడు - రణాదిత్యుడు

---

1. ప్రవరసేనుని నాణాలు ఆయన చారిత్రక వాస్తవికతను, కుషాణులతో దగ్గరితనాన్ని నిరూపిస్తున్నవి. 7 వ శతాబ్దం చివరిదాక కాశ్మీరు రాజులు కిదార కుషాణుల (చిన్న కుషాణుల) శాఖనుంచి వచ్చినారు.

2. మజూమ్‌దార్. ఆర్.సి., క్లాసికల్ ఏజ్ పు. 132.

3. త్రివేది, డి.ఎస్., ది జర్నల్ ఆఫ్ బీహార్ అండ్ ఒరిస్సా రీసర్చ్ సొసైటి 1938, ఈ అంశాన్ని డాక్టర్ కె. ఎస్. సక్సేనా తన 'పొలిటికల్ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్' అన్న గ్రంథంలో ఉటంకించినాడు, 1974.

నిర్మించిన శివాలయాన్నీ ఇంకా ఇతర నిర్మాణాలను ముక్తకంఠంతో కీర్తించినాడు.

రణాదిత్యుని కుమారుడు విక్రమాదిత్యుడు. ఆయన తన తండ్రి తరువాత 41 సంవత్సరాలు కాశ్మీరును పరిపాలించినాడు. ఆయన నిర్మించిన పలు నిర్మాణాలను కల్హణుడు పేర్కొన్నాడు. రాజతరంగిణి మూడవ తరంగంలో పేర్కొనబడిన చివరిరాజు దుర్లభవర్ధనుడు. గొప్పచాతుర్యం, వివేకంగల రాజు. ఖంఖుడనే మంత్రితో అక్రమ కామసంబంధం పెట్టుకున్న తన భార్యను ఆయన క్షమించినాడు. ఆయన మరణంతో గోనంద వంశ రాజక్రమం సమాప్త మవుతుంది.

# కర్కోటులు: వారి తరువాత

కాశ్మీరులో 'కర్కోటు'లు రాజ్యాధికారానికి రావటమన్నది ఒక గొప్ప చారిత్రక సంఘటన. కొన్ని శతాబ్దాల సుదీర్ఘకాలం ఎడతెగని ఏకవంశ ప్రభుత్వ పరిపాలనను ఈ కర్కోట రాజులే కాశ్మీరుకు సమకూర్చ గలిగినారు. సరిగా అదేకాలంలోని భారతదేశపు ఇతరప్రాంతాల విషయం పరిశీలిస్తే, ఆ ప్రాంతాలలో భిన్న భిన్న రాజపుత్రవంశాలు ఎన్నెన్నో ఉద యించి, అస్తమించినవి.

'కర్కోట' అనేది వంశనామం. ఆ వంశనామం ధరించిన మొదటి రాజు దుర్లభవర్ధనుడు. అసలు ఆ వంశానికి మూల పురుషుడు కర్కోటుడనే సర్పరాజు (III. 529-30.). కాశ్మీరులో విస్తృతంగా, కులదైవంగా కూడా పూజింపబడే సర్పదైవం ఈ కర్కోటుడు. కాగా ఈ వంశానికి చెందిన ఈ నాగ పౌరాణిక గాథ కారణంగా దుర్లభవర్ధనుని పూర్వీకుల విషయాలేవీ తెలియకుండా పోయినవి.

దుర్లభవర్ధనుని కాలం (క్రీ. శ. 625-661)లో హ్యూవాన్ సాంగ్ కాశ్మీరును సందర్శించినాడు. ఆనాటి కాశ్మీరరాజ్యంలో ఆ లోయప్రాంతంతో బాటు తక్షశిల, ఉరస (హజర), సింహపురం (రాజపురి, పూంఛ్ అనే చిన్న చిన్న కొండప్రాంతపు రాజ్యాలు) కలిసిఉండేవన్నా డాయన. సుప్ర సిద్ధుడైన కన్నోజి రాజు హర్షవర్ధనుడు దుర్లభవర్ధనునికి సమకాలికుడు. హర్షవర్ధనునివలెనే దుర్లభవర్ధనుడు కూడా బౌద్ధుడు. దుర్లభవర్ధనుని కుమారుడైన దుర్లభకుడు రెండవ ప్రతాపాదిత్యుడుగా (క్రీ శ. 661-711) ప్రసిద్ధుడు. తండ్రి తరువాత ఆయన కాశ్మీరుకు రాజయినాడు. దుర్లభకుని తరువాతి రాజు ఆయన పెద్ద కుమారుడైన చంద్రాపీడుడు.[1] చైనాచరిత్ర పత్రాలలో ప్రస్తావింపబడిన చెన్ - టో - లో - పి - లి అనే వ్యక్తి ఈ చంద్రాపీడుడేనని కొందరు చారిత్రకులు భావిస్తున్నారు. చంద్రాపీడుడు క్రీ. శ. 715-720 మధ్య కాలాన కాశ్మీరును పరిపాలించినాడు. ఆయన

---

1. చంద్ర+ఆపీడ., ఆపీడమనగా శిరోభూషణం. చంద్రుడు శిరోభూష ణంగా గలవాడు శివుడు. పలువురు రాజులపేర్లలో కన్పించే 'ఆపీడ' పదాన్ని ఈ విధంగానే అర్థం చేసుకోవలసి ఉంటుంది—అను.

ధర్మనిష్ఠ, న్యాయప్రవృత్తి సుప్రసిద్ధమైనవి. ఈ ప్రసిద్ధిని నిరూపించే అనేక గాథలను కల్హణుడు రాజతరంగిణిలో చెప్పినాడు.

కర్కోటవంశరాజులలో మిక్కిలి పరాక్రమవంతుడైన రాజుగా కీర్తి పొందినవాడు ముక్తాపీడ లలితాదిత్యుడు (క్రీ. శ. 699-736.) ఆయన ప్రభుత్వం కాశ్మీరును దాటి ఇరుగు పొరుగు రాజ్యాలదాకా వ్యాపించింది. జైత్రయాత్రలంటే ఆ రాజుకు అంతులేని ఆసక్తి. ఆయన జీవితంలో అత్యధిక భాగం ఈ జైత్రయాత్రలలోనే గడిచిపోయింది. ఈనాటి కాంగరా, పూంఛ్‌లకు పూర్వరూపాలైన జలంధర, లోహరా ప్రాంతాలను ఆయన పాలెగాండ్రు పరిపాలిస్తుండేవారు. సుదూరప్రాంతాలైన కన్నోజు,[1] బెంగాలు, ఒరిస్సా, కాంభోజ (తూర్పు అఫ్ఘనిస్తాను) దేశాలపైకూడా ఈయన దండయాత్రలు సాగించినట్లు రాజతరంగిణిలో చెప్పబడింది. ఒరిస్సా తీరప్రాంతం నుంచి పశ్చిమంగా సాగి రాణి రత్నాదేవి సహాయంతో లలితాదిత్యుడు వింధ్య పర్వతాలను గూడా దాటినాడని కల్హణుడు నిశ్చయంగా భావించినాడు. పలుప్రాంతాలద్వారా సాగిన లలితాదిత్యుని సైన్యాల ఈ దండయాత్రా మార్గాన్ని రాజతరంగిణి భౌగోళికంగా ఒక క్రమపద్ధతిలో పేర్కొన్నది. లలితాదిత్యుని విజయాలన్నింటిలోనికీ యశోవర్మపై సాధించిన విజయమే అతి ప్రధానమైంది. ఈ విజయంవల్ల ఆయన ఒక్క కన్నోజుపై తన అధికారాన్ని నెలకొల్పటమేకాక, విస్తృతమైన ప్రాంతాన్నికూడా తన అధికారంలోనికి తెచ్చుకున్నాడు. ఆయన మాల్వా గుజరాతులనేగాక, సింధుప్రాంతపు అరబ్బులను కూడా జయించినట్లు కన్పిస్తుంది.

తమ రాజు తురుష్కులను[2] జయించటాన్ని కాశ్మీరీయులు ఘనంగా చెప్పుకుంటారు. తుఖారదేశంనుండి చంకుణుడు అనే ఒక ప్రతిభావంతుని లలితాదిత్యుడు తీసుకునివచ్చి తన మంత్రిగా చేసుకున్నాడని రాజతరంగిణిలో

1. లలితాదిత్యుని నాణాలు కన్నోజు, గోండా, ఫైజాబాదు, వారణాసి (రాజఘాట్, సారనాథ్) నలందా, మాంఘైరలలో దొరికినవి. లలితాదిత్యుడు తూర్పువైపుగా సాగించిన దండయాత్రామార్గాన్ని ఇవన్నీ సూచిస్తున్నవి.

2. ముత్తై (ముక్తాపీడుడు) తురుష్కులపై విజయం సాధించినాడని స్థానికులు సాంప్రదాయికంగా చెబుతున్నట్లు అల్బెరూని వ్రాసినాడు.

ఉన్నది. చంకుణుడు రెండు విహారాలను[1], ఒక స్తూపాన్ని నెలకొల్పినాడని కల్హణు డన్నాడు. ఈ విస్తృతమైన విజయాలు[2] లలితాదిత్యుని కాలంలో కాశ్మీరును ఒక శక్తిమంతమైన రాజ్యంగా రూపొందించినవి. గుప్తచక్రవర్తుల కాలం తరువాత ఇంతటి శక్తివంతమైన రాజ్యం మరొకటి ఏదీ ఉన్నట్లు కన్పించదు. లలితాదిత్యుడు మార్తాండదేవాలయం కట్టించినాడు. ఈ నాటికీ ఆ ఆలయ శిథిలాలు కాశ్మీరులో ఆకర్షకమైన స్మారకచిహ్నాలు. ఈ రాజు "కట్టించిన కొన్ని స్తూపాలు, విహారాలు, చైత్యాలు కూలిపోయినా గూడా వాటి అవశేషాలు ఒకగొప్ప భవన నిర్మాతగా ఆ రాజు కీర్తికి అద్దం పడు తూనే ఉన్నవి."[3] లలితాదిత్యుడు నిర్మించిన 'పరిహాస పురం'లో బౌద్ధ విహారాలు - దేవాలయాలు ప్రక్క ప్రక్కగా ఉన్నవి. ఈ విధమైన నిర్మాణం లలితాదిత్యుని మత సామరస్య భావానికి సూచన. భారతదేశ చరిత్రలో గొప్ప వీరుడుగా, సమర్థుడైన పరిపాలకుడుగా శాశ్వతుడైన ఈ రాజు ఒకానొక జైత్ర యాత్రలో అమరుడైనాడు. రాజ్యానికి క్లిష్ట పరిస్థితులు సంభవించినప్పుడు మనువు మొదలైన మహానుభావులు ప్రసాదించిన ధర్మశాస్త్ర గ్రంథా లాధారంగా సప్తాంగ[4] పద్ధతిలో వ్యవహరించవలసిన తీరును ఆయన తన మంత్రులకు పలుమార్లు వివరించేవాడు.

లలితాదిత్యుడు కేవలం మహాయోధుడు, యుద్ధవ్యూహ నిర్మాణ కుశలుడు మాత్రమే కాదు. మహాసమర్థుడైన పాలనా విశారదుడు కూడ. అంతే కాదు, గొప్ప కళా పోషకుడు కూడ. యశోవర్మను జయించిన తరువాత, ఆయన ఆస్థానంలోని మహాకవులైన భవభూతి, వాక్పతిరాజులను

---

1. ఈ విహారాలలో ఒక దానిని చైనా యాత్రికుడు ఔ-కాంగ్ దర్శించి నాడు. కల్హణుని కాలానికి చెందిన ఒక మంత్రి భార్య అయిన సుస్సల అనే పుణ్యాత్మురాలు ఈ చంకుణ విహారానికి మరమ్మత్తులు చేయించింది.
2. లలితాదిత్యుడు భవుట్టులను, టిబెత్తవారిని జయించిన విషయం చైనా చారిత్రక పత్రాలద్వారా నిరూపితమైంది.
3. రాయ్; ఎస్.సి., ఎర్లీ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ కాశ్మీర్, పు. 49.
4. స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము (సేన).... ఇవి సప్తాంగములు—అను.

తన ఆస్థానానికి లలితాదిత్యు డాహ్వానించినాడని కల్హణు డన్నాడు. ఇతర ప్రాంతాల పండితులకు ఆనాడు కాశ్మీరు ఒక యాత్రాస్థలం. ఇతరదేశాల నుండి వచ్చే పలు సాంస్కృతిక బృందాలకు కాశ్మీరులో ఎంతో గౌరవం లభించేది. లలితాదిత్యుడు కాశ్మీరులో ఒక గొప్ప కళాశిక్షణ కేంద్రం కూడా నెలకొల్పినాడు అక్కడ దేశీయ విద్యలేగాక గ్రీకు, గాంధార విద్యలు కూడా నేర్పబడుతూ ఉండేవి.

లలితాదిత్యుని విజయోత్సవాలను కాశ్మీరీయులు శతాబ్దాల తరబడిగా చేసుకున్నారు. కొంత అతిశయోక్తిగా అనిపించవచ్చు గాని, ఆయనను వారు విశ్వ చక్రవర్తిగా కీర్తించినారు. అయితే లలితాదిత్యుడు లోపరహితు డేమీ కాదు; ఆ లోపాలను మరుగుపరిచే ప్రయత్న మేదీ కల్హణుడు చేయ లేదు. లలితాదిత్యుడు మద్యపానలోలుడు, కామినీ కాతరుడని రాజతరంగిణి వల్ల తెలుస్తున్నది. ముప్పయ్యారేళ్ళు రాజ్య పరిపాలనచేసి లలితాదిత్యుడు క్రీ శ. 736 ప్రాంతంలో ఇహలోకయాత్ర చాలించినాడు. ఆయన తరు వాత రాజ్యానికి వచ్చిన రాజులు బలహీనులు; అసమర్థులు; నిష్క్రియులు. కర్కోటవంశ కీర్తిప్రతిష్ఠలను వారు నిలుపలేకపోయినారు.

జయాపీడుడు (క్రీ. శ. 751-782) లలితాదిత్యుని మనుమడు. ఆయన లలితాదిత్యుని తరువాత అయిదవ కాశ్మీరురాజు. కాశ్మీరుయొక్క ఆధిక్యాన్ని, కీర్తిప్రతిష్ఠలను మళ్ళీ సంపాదించటానికి ఆయన చాలా ప్రయత్నించినాడు. జయాపీడుడు ఎనభైవేల సైన్యంతో ప్రయాగ, కన్నోజులమీదికి దండెత్తటమే కాక, నేపాలువరకు కూడా సాగించిన దండయాత్రలను కల్హణుడు వివరంగా వర్ణించినాడు. ఆయన సాహసికుడైన ప్రేమికుడు. ఆ సాహసమే ఆయనను బెంగాలుకు తీసుకువెళ్ళింది. అక్కడ జయంతుడనే రాజుయొక్క కుమార్తెను జయాపీడుడు వివాహం చేసుకున్నాడు. లలితాదిత్యుని మాదిరిగానే జయా పీడుడు[1] కూడా 'సర్వభూవిజయా'నికి నిశ్చయించినాడు. 'జయపుర'మనే నగరాన్ని నిర్మించినాడు. ఈనాడు 'అంపర్‌కోట్'గా తెలియవస్తున్న

1. జయాపీడుని మరొక పేరు వీణాదిత్యుడు. ఆ పేరుతో కర్కోట వంశానికి చెందిన మిశ్రధాతు నాణాలనేకం లభిస్తున్నవి. అయితే కల్హణుడు వర్ణించినంత గొప్పగా జయాపీడుడు సాధించిన విజయాలను నిరూపించ గల సమకాలీన సాక్ష్యాధారాలు లభించటం లేదు.

పూలాల్ సరస్సు పక్కగా ఆ నగరం నిర్మించబడింది. ఆయనను ఎప్పుడూ పండితులు పరివేష్టించి ఉండేవారు. వారిలో దామోదరగప్తుడు, మనో రథుడు, శంఖదంతుడు ప్రసిద్ధులు. వామనుడనే మనోవైయాకరణి జయా పీడుని మంత్రివర్గంలో ఉండేవాడు. పాణిని రచించిన 'అష్టాధ్యాయి'కి (సంస్కృత భాషావ్యాకరణ సూత్రగ్రంథం) వ్యాఖ్యానమైన 'కాశికా వృత్తి'కి ఈ వామనుడు సహరచయిత [1]. జయాపీడుని శౌర్యపరాక్రమ గాథలనేకం, ఆయన తాతగారికి సంబంధించిన గాథల మాదిరిగానే, జానపద గేయ వీధులలో సంచరిస్తున్నవి.

దాదాపుగా తన రాజ్యకాలపు చివరి యేండ్లలో అహంకారంతో కన్ను మిన్ను గానకుండా జయాపీడుడు సాగించిన దండయాత్రల కారణంగా రాజ్యకోశాగారం శూన్యమైపోయింది. దీనివల్ల, ఎట్లాగైనా సరే, ధనం సంపాదించవలెననే ఆత్రం పెరిగి, అది అత్యాశగా, దురాశగా మారింది. కాగా, దురాశాపీడితుడైన జయాపీడుడు ప్రజలనుండి పెద్ద పెద్ద మొత్తాలలో పన్నులు వసూలుచేయటం ప్రారంభించినాడు. ఆయన ఆశకు అంతు లేక పోయింది. ఆయనకు నాగదేవత ఒక రాగి గని చూపిందని ప్రచారంలో ఉన్న కథ – ధనాగారాన్ని నింపుకోవలెనని జయాపీడునికున్న ప్రగాఢ వాంఛను సూచిస్తుంది. సేనలకు నెలల తరబడిగా జీతాలులేవు. పాలనా వ్యవస్థ కుంటువడింది. ఆనాడు రాజుకు ఆర్థిక సలహాదారు శివదాసు. ఆయన సహకారంతో రాబోయే మూడేండ్లదాక కూడా లెక్కలు గట్టి వ్యావసాయి కాదాయాన్ని, రైతుల వాటాతో సహా తానే వసూలుచేసుకొని జయాపీడుడు అనుభవించినాడు. ఆయన పీడనకు తీవ్రంగా గురైనవారిలో ప్రధానులు బ్రాహ్మణులు. అనేక బ్రాహ్మణ కుటుంబాలు దేశంవిడిచి వలసపోయినవి. రాజు మనస్సును, ఆయన పరిపాలనా కార్య విధానాలను సన్మార్గానికి మళ్ళించటానికి ఎంతోమంది బ్రాహ్మణులు ప్రాయోపవేశాలు (నిరాహార దీక్షలు) చేసి ప్రాణాలు వదిలినారు. రాజకీయ సంఘర్షణలలో అహింసాత్మ కంగా ఎదిరించే విధానానికి ఈ సంఘటన అతి ప్రాచీనకాలికమైన ఒకా నొక ఉదాహరణ. రెచ్చగొట్టబడిన బ్రాహ్మణుల తీవ్రాగ్రహాన్ని, ఎంత

1. కాశికా వృత్తి రచనలో వామనునికి సహరచయితగా ఉన్నవాడు జయా దిత్యుడు— అను.

మాత్రమూ రాజీపడని రాజు యొక్క ఆకస్మిక మరణఘట్టాన్ని కల్హణుడు ఎంతో శక్తిమంతంగా, ప్రభావోత్పాదకంగా నాటకీయ పద్ధతితో చిత్రించినాడు. ఈ చిత్రణగల కొన్ని శ్లోకాలను 'కల్హణుని కథన శిల్పం' అన్న అధ్యాయంలో(పుట. 6౩) మనం చదివే ఉన్నాము.

జయాపీడుని కుమారుడు లలితాపీడుడు. ఆయనకు మదిర – మదవతి ఉంటేచాలు, మరేమీ అక్కరలేదు. ఈ వ్యసనాలలో తలబంటి మునిగిపోయి తన రాజకీయ బాధ్యతలను పూర్తిగా నిర్లక్ష్యం చేసినాడు. అతని పాలనలో 'అవినీతితో రాజ్యం ముక్కలు చెక్కలైన' దన్నాడు కల్హణుడు. లలితాపీడుని తరువాత ఆయన తమ్ముడైన రెండవ సంగ్రామాపీడుడు రాజయినాడు. ఆయన ఏడేండ్ల రాజ్యపాలన కల్లోలాలేమీ లేకుండానే సాగింది. ఆయన తరువాత రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొనటానికి పలుమంది రంగంమీదికి వచ్చినారు. ఎన్నో సంఘర్షణలు, ఎన్నో యుద్ధాలు. ఇవి నిర్వహించిన వారి తొత్తులు సింహాసన మెక్కినారు.

కర్కోటవంశానికి లలితాదిత్యుని కాలమే స్వర్ణయుగం. ఆ కాలంలోనే కాశ్మీరు ఒక చిన్న రాజ్యస్థాయినుండి గణనీయమైన సామ్రాజ్యస్థాయికి పెరిగింది. కాశ్మీరు చరిత్రలో మొత్తంమీద కర్కోటవంశీయుల పాలనాకాలం మిక్కిలి వైభవోపేతమైందిగా భావింపవచ్చు. కర్కోట వంశీయులు సాధించిన విజయాలనుగూర్చి కల్హణుని వర్ణనలో కొన్ని అతిశయోక్తులు ఉన్నవనుకొన్నా గూడా, కాశ్మీరునానుకొని ఉన్న ప్రాంతాలనేగాక, భారతదేశపు ఉత్తరాన అధిక ప్రాంతాన్ని ఆక్రమించి కాశ్మీరు రాజ్యాన్ని విస్తరింపజేసిన విషయంలో మాత్రం వివాదపడవలసిందేమీ లేదు. రెండవ సంగ్రామాపీడుని తరువాత రాజ్యానికి వచ్చినవాడు ఆయన కుమారుడైన అనంగాపీడుడు. ఉత్తమమైనదిగా ప్రసిద్ధికెక్కిన కర్కోట వంశీయుల సమర్థవంతమైన రాజ్యపాలనావ్యవస్థ అనంగాపీడుని కాలంలో అసమర్థంగా అస్తవ్యస్తంగా తయారైంది. కొన్ని కుట్రల కారణంగా అనంగాపీడుడు రాజ్యభ్రష్టుడైనాడు. ఆయన స్థానాన్ని ఉత్పలాపీడుడు ఆక్రమించినాడు. కర్కోటవంశ వైభవం క్షీణించి పోసాగింది. కాశ్మీరు రాజులు భారతీయ చరిత్రరంగాన అప్పటికే తెరమరుగు కాసాగినారు.

సురుడు అనే వివేకవంతుడైన ఒక మంత్రి తన మంత్రాంగ బలంతో ఉత్పలాపీడుని తొలగించి ఉత్పలకుని మనుమడైన అవంతివర్మను రాజుగా తీసుకువచ్చినాడు. అవంతివర్మ రాజ్యకాలాన్ని (క్రీ. శ. 855/6-883) కాశ్మీరు చరిత్రలో అత్యంత వాస్తవికాంశాలతో కల్హణుడు చిత్రించినాడు. అవంతివర్మ తనపేర 'అవంతిపురం' నిర్మించినాడు. అక్కడ అవంతీశ్వర, అవంతిస్వామి దేవాలయాలను కట్టించినాడు. ఆ ఆలయాలకు చెందిన శిథిలాలు ఈ నాటికీ అవంతివర్మ స్మృతికి మెరుగు పెడుతూనే ఉన్నవి. అవంతిపురం "లలితాదిత్యుని నిర్మాణాలతో పూర్తిగా సరితూగ లేక పోవచ్చుకాని, ప్రాచీన కాశ్మీర నిర్మాణ శిల్పవైభవాన్ని ప్రభావోత్పాదకంగా ప్రదర్శించే రీతిలో ఉన్నది." అవంతివర్మను రాజుగా చేయటం ద్వారా ప్రాధాన్యం వహించిన మంత్రి-సురుడు రాజ్యంలో అత్యున్నతాధికారాలను నిర్వహించినాడు. ధర్మనిష్ఠలో ఆలయాదుల నిర్మాణాలలో రాజుతో పోటీ పడినట్లుగా సాగినాడు. రాజసభలో మహాపండితుల కోసమని ప్రత్యేకాసనాలు ఏర్పాటు చేసి అవంతివర్మ అనేక మహాపండితులను ఎంతగానో గౌరవించినాడు. ఆయనవలన గౌరవాన్నీ, ప్రాపకాన్నీ పొందిన కవులలో ముక్తాకణుడు, శివస్వామి, రత్నాకరుడు మొదలైన వారున్నారు. బహుముఖ ప్రజ్ఞాశాలి, గొప్ప తత్త్వవేత్త అయిన కల్లటుడు కూడా అవంతివర్మ ఆస్థానం లోని వాడే.

ధన్వుడనే సాహసికుని నాయకత్వంలో చెలరేగి దేవాలయాల ఆస్తులను గూడా దిగమింగుతున్న డమరులను సమర్థవంతంగా, కఠినంగా సురుడు అణచివేసినాడు. చికాకుపరచే సందర్భాలు, సంఘటనలు కొన్ని సంభవించినా గూడా మొత్తం మీద అవంతివర్మ రాజ్యకాలం ప్రశాంతంగానే సాగింది. రాజ్యంలో ఆర్థికాభివృద్ధికి అత్యంత ప్రాధాన్య మీయబడింది. ఆ లోయ ప్రాంతాన్ని తరచుగా పీడించే వరదలను, కరువు - కాటకాలను అవంతివర్మ నివారించగలిగినాడు. ఈ నివారణ కార్యభారాన్ని తన మంత్రులలో మిక్కిలి సమర్థుడు, వాస్తుశాస్త్రవేత్త అయిన సుయ్యుడనే మంత్రికి అప్పగించినాడు. నదీ ప్రవాహాలను ప్రయోజనవంతంగా ఉపయోగించుకొనే విధానాలను సుయ్యుడు అతి చాతుర్యంతో అమలులోనికి తెచ్చినాడు. లోయ ప్రాంతంలో నీటి సౌకర్యం కోసం, భూమిని అత్యధి

కంగా సాగుబడిలోనికి తేవటంకోసం వితస్తా (జీలం)నదీ మార్గాన్ని బారాముల్లా క్రిందుగా వెళ్లేటట్లు మార్చినాడు. ఈ విధంగా తీవ్రమైన వరద ప్రమాదాలను నివారించటంవల్ల ప్రజలకు అనేక విధాల లాభాలు సమకూడినవి. వ్యావసాయిక పద్ధతులలో రకరకాల మార్పులు, క్రొత్త క్రొత్త విధానాలు ప్రవేశపెట్టడం ద్వారా ఈ లాభాలను సుయ్యుడు రెట్టింపు చేసినాడు. ఆ మార్పులు, విధానాలు వరిపంటకు గొప్పవరంగా నిరూపితమైనవి. కాశ్మీరీయులకు ముఖ్యాహారం వరి. జీలంనదీ తీరాన సుయ్యుడు తనపేర 'సుయ్యపురం' (ఈనాటి 'సోపూర్') నిర్మించినాడు. ఈ నాటికీ ఆ పురం ఆ మహామంత్రిని సంస్మరింప జేస్తున్నది.

త్రిపురేశ్వర (ఈనాటి 'త్రిఫార్') గిరిమీద అవంతివర్మ ఇహలోక యాత్ర ముగించిన సందర్భం గమనించదగింది. అంతరంగంలో ఆయన వైష్ణవుడు. కాని, తన మంత్రుల మీది గౌరవంతో శివపూజలు కూడా నిర్వహించేవాడు. ఈ రహస్యాన్ని తన అంత్యకాలంలో సురునికి చెప్పినాడా రాజు. "చివరి దశలో భగవద్గీతా పఠనం[1] వింటూ, విష్ణుధ్యానం చేస్తూ ఈ జీవితంనుండి ఆ జీవుడు నిష్క్రమించినాడు" అన్నాడు కల్హణుడు.

అవంతివర్మ రాజ్యకాలంలో అన్య ప్రాంతాలను జయించటం వంటి 'ఆకర్షణ' లేకున్నా, సమర్థుడైన పరిపాలకుడుగా, రాజ్యకార్య నిర్వాహకుడుగా, ప్రజాహితైక జీవిగా ఆయన ప్రసిద్ధి పొందినాడు. ఉత్పలకుటుంబ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింప జేసినాడు.

అవంతివర్మ తరువాత ఆయనకుమారుడు శంకరవర్మ రాజయినాడు. అక్కడినుంచి రాజపరంపర క్రమంగా ఉన్నది. మధ్య ఎక్కడా తెగిపోని ఈ క్రమాన్ని ఆ కాలక్రమంలోనే సూచించే నాణాలు లభిస్తున్నవి. ఈ విధంగా స్వతంత్ర సాక్ష్యంవల్ల కల్హణుడు చెప్పిన విషయం నిర్ధారింపబడుతున్నది. రాజతరంగిణి యొక్క విలువ ఇమ్మడి ముమ్మడిగా పెరుగుతున్నది. ఇదిట్లా ఉండగా, ప్రవరసేనుడు, లలితాదిత్యుడు, జయాపీడుడు తనకు పూర్వం సాధించిన విజయాలతో పోటీపడుతున్నట్లుగా శంకరవర్మ విస్తృతమైన సైన్యాన్ని సమకూర్చుకుని దండయాత్రలు సాగించినాడు.

1. గ్రంథస్థమైన చరిత్రలో మొట్టమొదటి సారిగా 'భగవద్గీత' మత పరంగా పఠించటాన్ని ఈ ఘట్టం సూచిస్తున్నదని చారిత్రకులంటున్నారు.

(ఆయన సేన తొమ్మిది లక్షలని కల్హణు డనటం అతిశయోక్తిగానే కన్పిస్తుంది). పాలెగాండ్రనేకులు తమ సైనిక బృందాలతో వచ్చి చేరటంవల్ల ఆ సైన్యం అంత విస్తృతమై వుండివుంటుంది. కాశ్మీరుకు దక్షిణంగా వున్న పర్వత ప్రాంత రాజ్యాలను ఆయన మరల సంపాదించినాడు. ఆ ప్రాంతాలు కర్కోట వంశీయుల చివరినాళ్లలో కాశ్మీరు పోగొట్టుకున్నది. ఘూర్జర (జీలం - చీనాబుల మధ్యప్రాంతం) పాలకుడయిన 'అలఖన' అనువానిపై పంజాబులో శంకరవర్మ సాధించిన విజయం గొప్పగా పేర్కొనదగింది. ఆ విజయం ఆ దిశగా శంకరవర్మ ప్రభుత్వాన్ని విస్తరింపజేసింది.

'ఇండస్' వైపుగా ఆయన దండయాత్రలు సాగినప్పుడు అనేక మంది రాజులు శంకరవర్మకు కప్పాలు, కానుకలు సమర్పించుకుని లొంగిపోయినారు. అయితే, 'ఉర్సా' (ఈనాటి 'హజ్రా') మండలం ద్వారా తిరిగి వస్తున్నప్పుడు శంకరవర్మ తీవ్రమైన గాయాలకు గురయినాడు. శంకరవర్మ విజయాలు కాశ్మీరు చుట్టుప్రక్కల ప్రాంతాలకే పరిమితమైనాగూడా, వాటికోసం అపరిమితంగా ధనవ్యయం కావటంవల్ల రాజ్యకోశాగారం వట్టిపోయింది. అందువల్ల 'తెలివిగా రూపొందించిన బలవంతపు పన్నులను' వసూలు చేయటంద్వారా ప్రజలను ఆయన పీడించినాడు. 'వ్యవస్థీకృతంగా ప్రవేశపెట్టబడిన 'బేగార్'[1] (ప్రధానంగా వస్తువుల రవాణాసౌకర్యం కోసం ఉద్దేశింపబడిన వెట్టికూలి)' శంకరవర్మను జ్ఞాపకంపెట్టుకునేట్లు చేస్తున్నది. శంకరవర్మయొక్క ఈ విధమైన ప్రవర్తన రాజ్యంలో అసంతృప్తిని కలిగించింది. నిజానికి ఈ పరిస్థితి 'దోపిడీచేసే వర్గానికి సంబంధించిన అధికారుల (కాయస్థుల)కే ఎంతగానో అనుకూలించింది. పండితులైనవారికి స్థానం లేకుండాపోయింది' అంటూ కల్హణుడు అప్పటి పరిస్థితులను వివరించినాడు.

దండయాత్రల కారణంగా ప్రజలకు కలిగిన బాధలకు తోడు రాజ్యాధికారం కోసం శంకరవర్మ తరువాత చెలరేగిన సంఘర్షణలు మరింత బాధపెట్టినవి. శంకరవర్మ కుమారుడు గోపాలవర్మ (క్రీ. శ. 902–904) చాలా పసితనంలోనే సింహాసన మధిష్ఠించినాడు. అందువల్ల

1. 'బేగార్' అనేది కాశ్మీరు పాలనావ్యవస్థలో ఈ శతాబ్దం మొదటివరకూ ఒక ప్రత్యేకమైన తరహాలో నిలిచేఉన్నది.

కొడుకుకు ప్రతినిధిగా గోపాలవర్మ తల్లి సుగంధ రాజ్యపాలన సాగించింది. ఆ పసిరాజు ఒకమంత్రి చేయించిన చేతబడికి గురి అయి మరణించిన తరువాత, సుగంధ తానే సర్వంసహాధికారాలుగల రాణి అయి పరిపాలన చేసింది. అయితే ఆమె పరిపాలన సాగిన రెండేండ్లకాలంలోనే ఆమె నీతి మాలినతనాన్ని అసహ్యించుకొన్న తంత్రిణులు ఆమెను అధికారపీఠంనుంచి తొలగించినారు. ఆమె కట్టించిన 'సుగంధపురం' మాత్రమే ఆమె పేరును నిలబెట్టగలిగింది.

తంత్రిణులది యోధజాతి. వారి వంశానికి చెందిన పూర్వ విషయాలు అనిశ్చితంగా ఉన్నవి. యథార్థానికి పదవ శతాబ్దంలో మొదటి పాతిక సంవత్సరాలు వారు కాశ్మీరుకు రక్షక దేవతలైనారు. క్రీ. శ. 917/18 లలో తీవ్రమైన కరువు సంభవించింది. వరదలు వచ్చినవి. పంటలు మునిగి పోయినవి. ప్రకృతికోపానికి గురయిన ప్రజలు పరస్పరం తమలో తాము పీడించుకొనటం సామాన్యమైపోయింది. ఈ పరిస్థితులలో మరొక యోధ జాతివర్గమైన ఏకాంగులతో కలిసి తంత్రిణులు తమ ఇష్టానికి, కోర్కెలకు అనుగుణంగా రాజుల్ని నిల్పినారు, కూల్చినారు. రాజసభ అవినీతికి, దుష్ప్ర వర్తనకు, కామనిరతికి నిలయమైపోయింది. ఆ స్థితిలో మూడవసారిగా రాజ్యాన్ని సంపాదించుకున్న చక్రవర్మ తంత్రిణుల పొంగును అణచివేసి నాడు. 'డొంబ' అనే అవరకులానికి చెందిన హంసి అనే యువతిని వివాహ మాడి, ఆమెను తన పట్టపురాణిగా ప్రకటించినాడు. అతని చుట్టూరా ఉండే అధికారవర్గం ఆయన విచ్చలవిడితనానికి దోహదం కలిగించింది. కాగా క్రీ.శ. 937 లో డమరులు హంసిశయనాగారంలోనే చక్రవర్మను హత్య చేసినారు. నిజానికి చక్రవర్మ సింహాసనాన్ని సంపాదించుకొనటంలో సహాయపడింది ఈ డమరులే.

తరువాతి రాజు ఉన్మత్తావంతి (అవంతివర్మకు అతని పనులు కారణంగా 'పిచ్చి' అవంతి అని వ్యవహారం). ఆయన నీతిమాలినవాడు, నిరంకుశుడు. తన సవతి తమ్ముని తిండిపెట్టక కడుపుమాడ్చి చంపినాడు. తండ్రి అయిన పార్థుని చంపించినాడు. ఏడుస్తున్న భార్యనుండి ఆయనను వేరుచేసి, జుట్టుపట్టి వీధులవెంట ఈడ్చినారు. కల్హణుని మాటలలో చెప్పితే- 'నిరాయుధుడు, తిండిలేక మలమల మాడి ఏ మాత్రం సత్తువలేనివాడు, ఆక్రందిస్తున్నవాడు - ఆ విధమైన స్థితిలో ఉన్న పార్థుని కట్టుబట్టలు విప్ప

నగ్నంగా నిలబెట్టి చంపినారు.' పార్థుని శవాన్ని కొడుతున్న అధికారిని చూచి ఉన్మత్తావంతి పైశాచికహాసం చేసినాడు. రెండేళ్లు క్రూరంగా పరిపాలించిన ఉన్మత్తావంతిని క్రీ.శ. 939 లో కాలం కబళించింది.

అప్పుడు రాజ్యానికి నకిలీ వారసుడొకడు సిద్ధమైనాడు. కమలవర్ధను డనే సేనాపతి ఆయనకు విరుద్ధంగా విప్లవించినాడు. ఆ స్థితిలో కాశ్మీర బ్రాహ్మణులందరు పెద్ద సమావేశం ఏర్పాటుచేసి, అందులో యశస్కరు డనే ఆయనను రాజుగా ఎన్నుకొన్నారు. యశస్కరుడు బీదవాడు. కాని, విద్యావంతుడు, వివేకి. అనేక సంవత్సరాలు రకరకాల బాధల తరువాత దయాళువైన యశస్కరుని పరిపాలన (క్రీ.శ. 939-948) కాశ్మీర ప్రజలకు దేవుడిచ్చిన వరంవలె ప్రశాంతంగా సాగింది. ఆయన పండితులైన బ్రాహ్మణులకు జీలం నదీతీరం పొడవునా 55 అగ్రహారాలు దానం చేసినాడు. తన పూర్వుల నివాసస్థానమైన పరిహాసపురంలో ఆర్యదేశ (ఉత్తర భారతదేశ) విద్యార్థులకోసమని ఒక పెద్ద మఠాన్ని[1] నిర్మింపజేసినాడు. యశస్కరుని తరువాత ఆయన కొడుకు పసితనంలోనే (క్రీ.శ. 948) రాజయినాడు. కాని, ఆ పసివానిని చంపి పర్వగుప్తుడనే మంత్రి రాజ్యాధికారాన్ని (క్రీ. శ. 949) కైవసం చేసుకున్నాడు. ఆయన క్రీ. శ. 950 లో మరణించగా, ఆయన కుమారుడు — క్షేమగుప్తుడు అధికారంలోకి వచ్చినాడు. మరొకసారి కాశ్మీరుకు అవినీతి పరుడు, దోపిడీదారు రాజుగా లభించినాడు. లోహరా ప్రభువైన సింహరాజు కుమార్తె - దిద్దాను ఆయన వివాహమాడినాడు. ఆమె మాతామహుడు ప్రసిద్ధుడైన షాహిరాజు - భీమపాలుడు. ఈ సంబంధం కాశ్మీరు చరిత్ర మార్గాన్ని మార్చింది. దిద్దాతో క్షేమగుప్తుని వివాహం కాశ్మీరును లొహరాకుటుంబ పాలనలోనికి తెచ్చింది. ఈ కుటుంబం తన అసలు రాజ్యమైన లొహరాతోబాటు; కల్హణుని కాలంలోనూ, ఆ తరువాత గూడా, కాశ్మీరును తన గుప్పిటిలో పెట్టుకున్నది. రాజు భార్యాలోలుడు. అందుకని ప్రజలు ఆయనను దిద్దాక్షేముడు[2] అనేవారు.

---

1. పదవశతాబ్దంలో కాశ్మీరుతో భారతదేశపు ఇతర ప్రాంతాలతోడి సాంస్కృతిక సంబంధాలను ఈ మఠం తెలుపుతున్నది.

2. క్షేమగుప్తుని నాణాలు కొన్నింటిమీద 'ది' అనే అక్షరం ఉండటం ఈ అంశాన్ని బలపరుస్తుంది.

క్షేమగుప్తుడు బ్రతికి ఉండగానే రాజప్రతినిధి అయిన రాణిగా దిద్దా కొన్నేళ్ళు రాజ్యపాలన చేసింది. క్షేముని మరణానంతరం స్వతంత్రంగా పరిపాలించింది. అధికార దాహం ప్రేరణగా ఆమె 23 సంవత్సరాలు చేసిన పరిపాలన అతి కఠోరమైంది. ఆమె క్రూరురాలు. ధర్మ భీతిలేనిది, దుష్ట ప్రవృత్తిగలది. అయినా గూడా, గొప్ప రాజకీయ చాతుర్యం, పాలనా సామర్థ్యం గలది. ఆమె బుద్ధికి తోడు—ఆమె సౌందర్యం. దిద్దా విటుడైన తుంగుడనే మంత్రిని పదభ్రష్టం చేయవలెనని బ్రాహ్మణులు ప్రాయోప వేశాలు చేసినారు. కాని, దిద్దా కుటిలనీతి, లంచాలు, తుంగుని సాహసం బ్రాహ్మణుల ప్రాయోపవేశాలను విఫలం చేసినవి. కాశ్మీరు రాజ్యాధికారాన్ని ధిక్కరించినందుకు తుంగుడు రాజపురి రాజైన పృథ్వీపాలుని అణచివేసినాడు. పృథ్వీపాలుడు కప్పంకట్టి లొంగిపోయినాడు. దిద్దా రాజ్యకాలపు చివరి ఏండ్లలో ఎదురు తిరిగిన "డమరుల విప్లవాన్ని తుంగుడు సమర్థవంతంగా అణచినాడు."

తన మరణకాలానికి (క్రీ.శ. 1003) ముందే దిద్దారాణి లొహరా ప్రభువైన ఉదయరాజు కుమారుడగు సంగ్రామరాజుకు కాశ్మీరు రాజ్యాన్ని సంక్రమింపజేసింది. కాగా, కాశ్మీరు రాజ్యాధికారం ప్రశాంతంగా మరొక వంశానికి మారింది.

క్రొత్తగా రాజైన సంగ్రామరాజు కాలంలో తుంగుడు ప్రధాన మంత్రి. ఆయన అనంగపాలుని కుమారుడు షాహిరాజు అయిన త్రిలోచన పాలునికి సహాయంగా వెళ్ళి ఘజనీసుల్తాను మహమ్మదుకు విరుద్ధంగా దండయాత్ర సాగించినాడు. మొదట్లో కొంత విజయం లభించిందికాని, చివరకు ఓటమి తప్పలేదు. తుంగునిపై తాను పూర్తిగా ఆధారపడవలసిన తన స్థితిని సహింపని సంగ్రామరాజు తుంగుని కపటంగా చంపించినాడు. అయితే ఆ తరువాత ఆయన కూడా ఎక్కువకాలం జీవించలేదు. డమరులు, దరదులు చేసిన తిరుగుబాటు (క్రీ. శ. 1025) లో మరణించినాడు. ఆ రాజు రాజ్య కాలం 26 సంవత్సరాలు.

సంగ్రామ రాజు తరువాత ఆయన పెద్దకొడుకు హరిరాజు పరిపాలన కేవలం 22 దినాలు మాత్రమే సాగింది. ఆయన తల్లి శ్రీలేఖ, మహారాణి, పరమమదాశాపరురాలు. పరమకాముకురాలు. ఆమె రహస్యాజ్ఞలవల్ల

హరిరాజు హత్య చేయబడినాడు. అప్పుడు సంగ్రాముని చిన్నకొడుకు అనంతుడు క్రీ. శ. 1028 లో రాజయినాడు. అనంతుడు భూస్వాముల తిరుగుబాటును గట్టిగా అణచివేయటమే కాక, దరదులు – మహమ్మదీయులు దండయాత్రలను గూడా విజయవంతంగా త్రిప్పికొట్టినాడు. అనంతుని భార్య సూర్యమతి. ఎంతో ఉత్తమురాలు. రాజ్యపాలనలో ఆమె క్రియాశీల పాత్ర నిర్వహించింది. సమర్థవంతమైన ఆమె పరిపాలనా విధానం రాజ్యంలో అస్థిరత్వాన్ని తొలగించింది. భార్య సామర్థ్యంవల్ల అతిగా ప్రభావితుడైన అనంతుడు ఎక్కువకాలాన్ని పూజల్లో, ధ్యానాల్లో వినియోగించేవాడు. కాగా, తన కుమారుడైన కలశుడు (క్రీ. శ. 1063) రాజు కావటానికి వీలుగా రాజ్యాధికారాన్ని వదలటానికి అనంతుని సూర్యమతి బలవంతంగా ఒప్పించింది. రాజ్యం సమృద్ధంగా ఉండటంతో కలశుడు కాశ్మీరుకు చుట్టు ప్రక్కల నున్న రాజపురి, ఉర్శా ప్రాంతాలపై దండెత్తి వాటిని తన రాజ్యంలో కలుపుకున్నాడు. కలశుడు రాజ్యాన్ని విస్తరింపజేసి స్థిరత్వాన్ని సంపాదించినా గూడా ఆయన రాజ్యకాలపు చివరి సంవత్సరాలు క్లిష్టంగానే గడిచినవి. ఆయన పెద్ద కొడుకు హర్షుడు. తండ్రి, కొడుకుల మధ్య కలతలు క్రమంగా పెరిగినవి. తండ్రి కొడుకును కారాగారంలో బంధించినాడు. తన చిన్న కొడుకైన ఉత్కర్షుడు తన తరువాత రాజు కావలెనని అనంతుని కోరిక. ఆయన క్రీ.శ. 1089 లో మరణించినాడు.

రాజ్యానికి అసలు హక్కుదారైన హర్షుడు కారాగారంనుండి ఏదో విధంగా బయటపడి రాజ్యాధికారాన్ని దక్కించుకున్నాడు. హర్షుని రాజ్యపాలనాకాలాన్ని (క్రీ. శ. 1089–1101) కల్హణుడు విస్తారంగా వర్ణించినాడు. యువకుడు, అసాధారణ ప్రతిభావంతుడైన హర్షుడు అనేక శాస్త్రాలలో పండితుడు, అనేక భాషావ్యాకరణాలలో ప్రవీణుడు, కవి. రాజ్యంలో కళాభినివేశాన్ని పెంపొందించటానికి క్రొత్త క్రొత్త పద్ధతుల నవలంబించినాడు. సభాభవనంలో విరివిగా పండితగోష్ఠులు నిర్వహించటమేగాక, స్వయంగా వాటిలో పాల్గొనేవాడు. ఆ రాజు సభాభవనం వేయిదీపాలతో దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉండేది. దగ్గరి దేశాలనుండేగాక, దూర దేశాలనుండికూడా సంగీత, కవితా కళావేత్తలను ఆ సభ ఆకర్షిస్తూ ఉండేది. కర్ణాటక[1] బాణీలను, విద్యావిశేషాలను హర్షుడు కాశ్మీరులో ప్రవేశపెట్టి

1. ఏనుగు చిహ్నంతో ఇప్పటికి లభించే హర్షుని నాణాలు ఆనాటి కర్ణాటక నాణాల విధానాన్ని సూచిస్తున్నవి.

నాడని కల్హణుడు ఆయనను ప్రస్తుతించినాడు. చాళుక్యరాజగు 'పర్మాది' ఆస్థానకవి అయిన బిల్హణుడు హర్షుని ఔదార్యం విని ఎంతో ప్రభావితు డైనాడు. కల్లోలితమైన కలశుని రాజ్యకాలంలో తాను కాశ్మీరును వదలి వచ్చినందుకు పశ్చాత్తాపపడినాడనికూడ కల్హణు డంటాడు.

హర్షుడు చతురుడు, సమర్థుడైన పరిపాలకుడు. విశాలహృదయుడు. కళాపోషకుడు. తనరాజ్యాన్ని సరియైన మార్గాన నడిపించినవాడు. అధి కారులలో క్రమశిక్షణ పెంపొందించటానికి తాను వారికి లక్ష్యప్రాయంగా ప్రవర్తించేవాడు. రాజ్యవిధులను సక్రమంగా నిర్వహించేవాడు. కాలనియ మాన్ని కచ్చితంగా పాటించేవాడు. వసంతలేఖ హర్షుని పట్టపురాణి. ఆమె అనేక ధర్మకార్యాలకు ధనాన్ని ఉదారంగా విరాళాలిచ్చేది.

హర్షుని గుణాలను ఒకవైపు కీర్తిస్తూనే, ఆయన బలహీనతలను, వైఫల్యాలనుగూడా వివరించటంలో కల్హణుడు సంకోచపడలేదు. హర్షుడు అనేక వైరుధ్యాలకూడలి. క్రూరత్వం - దయ; ఔదార్యం - పేరాస, తీవ్ర మైన ఆత్మనిగ్రహం - నిర్లక్ష్యంతోకూడిన సోమరితనం, ఆలోచనాశీలం - కుత్సితత్వం – ఈ విధంగానే రాజీపడని అనేక లక్షణాలు ఒక విధంగా హర్షుని విచిత్ర నియత జీవితాన్ని ప్రదర్శిస్తున్నవి.

హర్షుని సేనాపతి కందర్పుడు చాలా సమర్థుడు. రాజపురి ప్రభువును అణచివేయటానికి హర్షుడు కందర్పుని పంపినాడు. రాజపురి ప్రభువైన సంగ్రామపాలుని అణచివేసి అతనిచేత కందర్పుడు కాశ్మీరుకు కప్పం కట్టించి నాడు. అయితే, దుష్టబుద్ధులైన కొందరు రాజ సలహాదారులు అసూయా గ్రస్తులై, కందర్పునిమీద రాజుకు రకరకాల కొండాలు చెప్పి, చివరకు కంద ర్పుని రాజ దేశబహిష్కృతుని చేసేట్టు ప్రయత్నించి సఫలులైనారు. క్రమంగా రాజమందిరంలోనూ, అక్కడినుంచి రాజ్యంలోనూ ద్రోహాలు, కుట్రలు వ్యాపించినవి. రాజ్యాధికారానికి రకరకాల వారసులు పుట్టుకొచ్చి నారు. హర్షునికి వ్యతిరేకంగా కుట్రలు పన్నినారు. కాని, హర్షుడు వాటి నన్నింటినీ అరికట్టినాడు. సైనిక కార్యకలాపాలకై చేసే అధిక ధన వ్యయా నికి తోడు అతిఖరీదైన ఆనంద విలాసాలలో తాను తేలియాడటం కోసం చేసే ఖర్చు (ఆయన అంతఃపురంలో 360 మంది ప్రియురాండ్రకు అనేక సౌకర్యాలు కల్పించబడినవి. ఆ ప్రియురాండ్రలో డోంబ, చండాల స్త్రీలు

తప్ప అన్నివర్ణాల స్త్రీలు ఉండేవారు) ఆయనను విపరీతమైన ఆర్థిక సమస్య లకు లోను చేసింది. ప్రజలను అణగార్చే రకరకాల కొత్త పన్నులు విధించ బడినవి. చివరకు 'మలమూత్రాలు కూడా పన్నులకు గురైనవి' అని కల్హణుడు ధిక్కారపూర్వకంగా అధిక్షేపించినాడు. దేవాలయాల్లో కుప్పలు కుప్పలుగా ఉన్న ధనరాసులపై హర్షుడు చేయి చేసుకున్నాడు. హర్షుని లోని ఇదివరకటి ఔదార్యం ఇప్పటికి దురాశగా మారిపోయింది. లోయ ప్రాంతపు ఆలయాలలోని వెండి, బంగారపు విగ్రహాలను కరిగించి సొమ్ము చేసుకున్నాడు. "ఈ విధంగా విగ్రహద్వేష ప్రవృత్తి పెరిగిపోవటం, వితంతువైన తన సవతి తల్లితో వరస వావి లేని అక్రమ కామ సంబంధం కలిగించుకొనటం ఆయన బుద్ధిలోని వైపరీత్యాన్ని నిస్సందిగ్ధంగా వెల్లడి స్తుంది." క్రొత్త క్రొత్త ఉపద్రవాలు రాజ్యంలోని అసంతృప్తిని మరింత పెంచినవి. క్రి. శ. 1099 లో ప్రజావినాశకంగా విజృంభించిన కలరావ్యాధి, భయంకరమైన వరదలు ప్రజలను విపరీతంగా పీడించినవి. ప్రజలదృష్టిని ఈ బాధలనుండి తప్పించటానికి హర్షుడు శక్తిమంతులైన భూస్వాములైన డమరులమీద విరుచుకుపడినాడు. వారిపై హర్షుడు సాగించిన తీవ్రమైన అత్యాచారాలను కల్హణుడు నిశితధోరణిలో వివరించినాడు.

ఆ స్థితిలో దుష్టనిగ్రహణాధిదేవత ఇద్దరు సోదరుల రూపాన అవ తరించింది. ఆ సోదరులు ఉచ్చలుడు - సుస్సలుడు. వీరు లోహరకుటుంబపు ఉపశాఖకు చెందినవారు. డమరులు మొదలైన తిరుగుబాటు వర్గాలవారు పిచ్చెక్కినట్లు ప్రవర్తించే రాజును పదభ్రష్టుని చేయటానికి ఆ సోదరులతో చేతులు కలిపినారు. హర్షుడు తెగింపుతో వారందరినీ ఎదిరించినాడుగాని, చివరకు వారంతా కలిసి ఆయనను అతిక్రూరంగా చంపినారు. తెగిన హర్షుని తలను ఉచ్చలుని ముందుకు భటులు తెచ్చినారు. ఆయన దానిని తన్ని తగులబెట్టించినాడు. ఆ తరువాత కేవలంగా మిగిలిన మొండాన్ని ఎవడో కలపమీది అధికారి జాలిపడి అనాథ ప్రేతసంస్కారంగా దహనం చేసి నాడు. (ఈ అంశాన్ని వర్ణించే కొన్ని శ్లోకాలను 'కవిగా కల్హణుడు' అన్న అధ్యాయంలో చదివినాము.)

హర్షుని దయనీయమైన మరణం రాజతరంగిణి ఏడవ తరంగంలో చిత్రితమైన చివరి వృత్తాంతం. (అక్కడినుండి కల్హణుని దాక జరిగిన సంఘ

టనలు, విషయాలు 'కల్హణుడు: ఆయన కాలం' అన్న అధ్యాయంలో వివరించబడినవి.)

ఎనిమిదవ తరంగంలో ఎక్కువభాగం హర్షుని పతనానికి – ఈ గ్రంథ రచనకూ నడిమ కాలమైన పన్నెండవ శతాబ్దం పూర్వార్ధాన్ని చిత్రించటానికే కల్హణుడు వినియోగించినాడు. అక్కడక్కడ కొంత అస్తవ్యస్తంగా ఉన్నాగూడా, కల్హణుడు చేసిన విస్తృత వర్ణనలు, ఇచ్చిన వివరాలు ఆకాలానికి చెందిన కాశ్మీరురాజ్యపు సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులనుగూర్చి ప్రామాణికమైన పరిజ్ఞానాన్ని మనకు కలిగిస్తున్నవి.

తిరుగబడిన డమరులు రాజ్యంలో శాంతిని కకావికలు చేసినారు రాజ్యానికి హక్కుదారులమని చెప్పుకొనే పలుమంది రావటం - పోవటం జరిగింది. ఇంతలో శ్రీనగరం ముట్టడి ఒకటి వచ్చిపడింది. సుస్సలుని కుమారుడైన జయసింహుడు – 'కుత్సిత రాజనీతిలో, చతుర కుతంత్రాలతో' కాశ్మీరును పరిపాలించినాడు. రాజతరంగిణి సమాప్తి శ్లోకాలు జయసింహుని రాణియైన రద్దాదేవిని, ఆమె సంతానాన్ని పొగడటానికి ఉపయోగింపబడినవి. ఈ విధంగా మనం జయసింహుని రాజ్యపాలనాకాలంలో ఇరవైరెండవ సంవత్సరం (క్రీ. శ. 1149–50) వరకు వస్తాము. తన 'రాజతరంగిణి'ని దక్షిణభారత దేశంలో ప్రవహించే వేగప్రవాహిని అయిన గోదావరీనదితో పోలుస్తూ కల్హణుడు గ్రంథాన్ని ముగించినాడు.

# రాజతరంగిణి నేర్పే పాఠాలు

మొత్తం భారతదేశ చరిత్ర దృష్టితో చూచినా గూడా రాజతరంగిణి అత్యంతాసక్తికరమైన గ్రంథమనే అంశం మరొకసారి గుర్తుచేసుకోవలసి ఉంటుంది. భారతదేశ చరిత్రలోని అత్యధిక భాగం దేశంలోని వివిధ ప్రాంతాల చరిత్రలతో రూపొందింది. అయితే, పలుప్రాంతాల చారిత్రక వివరాలు చాలా తక్కువగా లభిస్తుండగా రాజతరంగిణి వల్ల కాశ్మీరు ప్రాంత వివరాలు మిక్కిలి విరివిగా లభిస్తున్నవి. కాగా, కల్హణుని గ్రంథం ఒక ప్రత్యేక ప్రాంతానికి సంబంధించిన విపుల చరిత్ర కావటం కారణంగా మిగిలిన ప్రాంతాలకు గూడా అనువర్తింప జేయదగిన పద్ధతుల ననేకంగా రాజతరంగిణి మన కందిస్తున్నది.

కల్హణుని దృష్ట్యా 'చరిత్ర' అనేది ఏదో నేర్చుకోవలసిన విషయం కాదు. నిజానికి, ప్రజలు – వారి జీవితాలను అవగాహన చేసుకొనటానికి ఉపయోగించే దది. ఎందుకంటే, పరస్పరం అల్లుకుపోయిన మానవీయ వివిధ సంబంధాల రీతులను చరిత్ర చిత్రిస్తుంది. వేదకాలంనాడు రాజత్వ మనేది ఎన్నికల పద్ధతిలో ఏర్పడేది. అనంతరకాలాన అది అనువంశికంగా రూపొందింది. రాజ్యాల వర్తమాన – భవిష్యత్తులు ఆయారాజుల వ్యక్తిత్వాల మీద ఆధారపడ సాగినవి. రాజ్యాన్ని ఉన్నత రీతిలో రూపొందింపజేసే ఒక 'రాజకీయ మండలి' అంటూ ఏదీ ఉండేదికాదు. అయితే నిరంకుశు లైన రాజుల విధానాలను సామాన్య ప్రజలు ఓపికగా పరిశీలిస్తూ, గమనిస్తూ ఉండేవారు. భూస్వామ్య ప్రభువుల వర్గంయొక్క క్షేమంలోనుండి తిరుగు బాటుదారులు ఉదయించినారు. ఇవే ఎక్కడైనా ప్రసిద్ధమైన తిరుగుబాటులు. లలితాదిత్యుడు, ఆయనవంటి శక్తిమంతులైన ఇతర రాజుల రాజ్యపాలనలలో కూడా ప్రజల జీవన పరిస్థితులు బానిసయుగంలో కన్నా ఏమంత మెరుగుగా ఉండేవికావు. ధనవంతులు రుచికరమైన మాంసపు వంటకాలతో పూల వాసనలతో సువాసితమైన మద్యాన్ని సేవిస్తూ ఉండగా సామాన్య ప్రజలకు రెండుపూటలా అన్నం దొరకటమే గొప్ప అదృష్టంగా ఉండేది. ఈ విధంగా 'ప్రాచీనకాలపు వ్యవహారాలను అనేకంగా' కల్హణుని గ్రంథం వెలుగులోకి తెస్తున్నది.

రాజకీయ విధానాలనూ, రాజ్య నిర్వహణరీతులను చిత్రించటానికి ఉపకరణంగానే చారిత్రక ఘట్టాలు వివరింపబడుతూ వుంటవి. ప్రభుత్వపు ఆదర్శాలు, ప్రధానంగా కాశ్మీరుకు సంబంధించిన కల్హణుని వివరణలు చాలా ఆసక్తికరమైనవి. లలితాదిత్యుని రాజ్యపాలనా రీతిని వివరించటంలో ఈ అంశాలు విరివిగా మనకు లభిస్తవి. రాజ్యనీతి తంత్రాలు భారతీయ రాజ్య నీతి శాస్త్రాలతో పోల్చి చూసుకోదగిన విధంగా కల్హణుడు వివరించినాడు. కల్హణుడు వర్ణించిన, వివరించిన అంశాలలో ప్రాంతీయతా వాసన అధికం. అందుకని అవి చారిత్రికంగా అధిక ప్రాధాన్యం వహిస్తున్నవి.

ఈ అంశాలలో మొట్టమొదట గమనించదగింది విలక్షణమైన కాశ్మీరీతనం. భౌగోళికంగా కాశ్మీరు చిన్నప్రాంతం. తమ రాజ్యంలో అంతః కలహాలను నివారించటానికి పాలకులు సహజంగా ముందు జాగ్రత్తలు తీసుకునేవారు. లోయప్రాంతపు అంచుల్లో నివసించే గిరిజనులు, నిజానికి, "ఎదిరించకున్నా గూడా అణచి పెట్టబడేవారు." రాజ్యం బలహీనంగా ఉన్నప్పుడు దోపిడీలు సాగించే ఖాసాలు మొదలైన గిరిజనుల ప్రవృత్తిని గూర్చి కల్హణుడు నిశితంగా పరిశీలించినాడు. అదే విధంగా, పల్లెల్లో నివసించే వారికి ఒక సంవత్సరం వరకు మాత్రమే సరిపడే ఆహారపదార్థాలకు మించి అందుబాటులో లేకుండా చూడవలసి ఉంటుందని ప్రభుత్వానికి సలహా కూడా ఇచ్చినాడు. దీనివల్ల డమరులు ప్రాతినిధ్యం వహించే భూస్వామ్య వర్గాల శక్తిని అదుపులో ఉంచటానికి వీలవుతుందని ఆయన తాత్పర్యం. కల్హణుని కాలంలో, అంతకు ముందుకాలంలో కూడా మాటిమాటికి ప్రభుత్వానికి ఎదురుతిరిగే ఈ భూస్వాములు కాశ్మీరులో అంతర్విభేదాలను రెచ్చగొడుతూ శాంతి లేకుండా చేసేవారు. వాళ్లను కల్హణుడు చాలా అసహ్యించుకొన్నాడు. వారిని 'దస్యులు' (దోపిడీదారులు) అన్నాడు. రాజకీయంగా అస్థిరత్వం ఏర్పడినప్పుడు ప్రజలలో అన్ని వర్గాలవారూ రాజ్యంలో వచ్చే మార్పులను బట్టి తామూ రంగులు మార్చేవారు. ఇట్లాంటి వారిని గూర్చి కల్హణుడు పలుమార్లు చెప్పినాడు. సోమరులు, దేని విషయంలోనూ పట్టింపు లేనివారు రాజ్యంలోని రకరకాలైన అనువంశికపు మార్పులకు మొద్దుబారిపోయి ఉండేవారు. స్వదేశీయ ప్రజలలోని వర్గాలను, వారి తరహాలను కల్హణుడు ఎంతో నిశితంగా, విమర్శనాత్మకంగా పరిశీలించినాడు కాబట్టి, ఇన్నిన్ని వివరాలు ఇంత విస్పష్టంగా చెప్పగలిగినాడు. ప్రాస్తావికంగా

ఆయన తన గ్రంథంలో చేసిన 'వ్యాఖ్య'ల ద్వారా వెలిబుచ్చిన అభిప్రాయాల ద్వారా ఎన్నెన్నో అంశాలు తెలియవస్తున్నవి.

చారిత్రక సంఘటన అవగాహనద్వారా అనేక గుణపాఠాలు తరువాతి తరాలవారు నేర్చుకోవలసి ఉంటుందని కల్హణుని అభిప్రాయం. దానికి అనుగుణంగానే ఆయన అనేకాంశాలను వివరించినాడు. కిషన్‌గంగా లోయ ప్రాంతంమీదికి జయసింహుడు దండెత్తిన సందర్భంలో శత్రుపక్షపు సైనిక శక్తినిగూర్చి సరియైన అంచనా లేకుండా వేసిన పథకాలు విఫలం కావటం తప్పనిసరి అన్నాడు కల్హణుడు. అదే సందర్భంలో జయసింహుని కెదురు తిరిగిన శత్రుపక్షాలు అవలంబించిన పద్ధతులలోని లోపాలను విమర్శిస్తూ, ఆ లోపాలే రాజుయొక్క విజయానికి ఏవిధంగా తోడ్పడినవనేది వివరించినాడు.

ద్వేషపూరితమైన రాజసభా కుతంత్రాలు, అంతఃపుర కల్లోలాలు రాజ్యాన్ని, తద్వారా ప్రజలనూ ఏ విధంగా ప్రభావితం చేస్తాయనేది కాశ్మీర చరిత్రద్వారా నేర్చుకోవల్రసిన మరొక ప్రధాన గుణపాఠం దీన్నిబట్టి కల్హణుడు రాజసభా రాజకీయాలను ఎంత నిశితంగా పరిశీలించినాడనేది మన కర్థమవుతుంది. తాను చూచిన, పరిశీలించిన, తెలుసుకొన్న అంశాలను ఈ విధంగా గ్రంథస్థం చేయటంలో; తరువాతి తరాలవారు తన పరిశీలన వల్ల లాభం పొందవలెనని కల్హణుడు ఆశించి ఉంటాడనటంలో సందేహం లేదు. ఆర్. సి మజూమ్‌దారు అన్నట్లు1 – "కాశ్మీరరాజుల, రాణుల విపరీతమైన విషయభోగాసక్తి రాజ్యాన్ని చెప్పరానంతగా బాధల్లో ముంచింది. వారి ఆ ఆసక్తి ఆ కాలపు ఆచారాల, ప్రవృత్తులలోని నిస్సారతను స్పష్ట పరుస్తుంది; మన ప్రాచీనప్రభువుల నిరంకుశత్వాన్నీ, రకరకాల భ్రాంతులనూ అజ్ఞత్వాన్నీ ప్రదర్శించి మనలను చకితపరుస్తుంది."

ఆయన ఇంకా ఈవిధంగా అన్నాడు: "కాశ్మీర రాజులలో ఎంత మంది ప్రవృత్తి పరిశీలించినాకూడా, వారిలో ఏ ఒక్కరికి కూడా భారత దేశం తమ మాతృభూమి అనేభావం ఉన్నట్లు కన్పించదు." కాని ఈ అభిప్రాయం మాత్రం వివాదానికి దారి తీస్తున్నది, కాశ్మీరను భారతదేశపు ఇతర భాగాలనుంచి వేరుచేసిన ప్రత్యేకభౌగోళిక పరిస్థితి మూలంగా ఆ ప్రాంత

1. ఏన్షియంట్ ఇండియా., పు. 386

రాజ్యవు పాలనావిధానంలో, ప్రజల ఆచారవ్యవహారాలలో విభిన్నత్వం భాసించవచ్చు. అయినా, నిజానికి, కాశ్మీరీయులు భారతదేశీయ జీవన వాహినిలో భాగస్వాములుగానే సాగినారని నిరూపించటానికి ఈగ్రంథం ఎన్నెన్నో ఉదాహరణలను చూపుతున్నది. మచ్చుకు ఒకటి. కాశ్మీరులోనూ, భారతదేశం మొత్తంలోనూ చాలా ప్రాచీన కాలంనుండి వ్యాపించివున్న 'సతి' ఆచారం యొక్క క్రమ వ్యాప్తిని నిర్ధారించటానికి కల్హణుని గ్రంథం పరిశోధకులకు ఎంతో ఉపకరిస్తుంది. సైథో-తార్తారుల జీవన విధానంలో నుండి ఈ ఆచారం ఉదయించింది. సాహసిక యుగాలలో ఈ ఆచారం భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో మాదిరిగానే కాశ్మీరులోనూ ఉజ్జీవించింది. ఇది కేవలం రాజకుటుంబాల వరకే పరిమితంగా ఉండిపోలేదు. "ఈ 'సతి' ఆచారం ఈ లోయ ప్రాంతంలో ఎంతగా వేళ్లు పాతుకుని వ్యాపించి పోయిందంటే; తల్లులూ, అక్కలూ, చెల్లెళ్లూ మాత్రమే కాక దగ్గరి బంధువులు తదితరులు కూడా మరణించిన తమ ప్రేమ పాత్రులతో బాటు తమను దహనం చేసుకునేవారు"—అన్నాడు కల్హణుని గ్రంథాన్ని గూర్చి అధికారికంగా మాట్లాడ గలిగిన ఎస్. సి. రాయ్.[1]

వివిధ భారతీయ ప్రాంతీయ రాజ్యాల చరిత్రలలో చీకట్లు ముసురుకున్నట్టుగా అన్పించే రకరకాల పరిస్థితులలో కూడా రంగురంగుల ఆహ్లాదకరమైన వెలుగుల ప్రసారం ఎంతో ఆనందం కలిగిస్తుంది. రాజ్యా పరిపాలనా విధానాలలో కొంతగా అపరిపక్వత కన్పించినా గూడా, జీవితంలో ఎన్ని రకాల ఒడుదొడుకులు వస్తున్నా గూడా; ప్రభుత్వంమాత్రమే కాక ప్రజలు గూడా సంగీతం, నాట్యంవంటి వివిధ లలితకళలను వృద్ధి పొందించినారు. చిత్రకళ, వాస్తుకళ అత్యున్నతంగా వర్ధిల్లినవి. మతం, తత్త్వశాస్త్రం, భౌతికశాస్త్రం మొదలైనవి గూడా తమ తమ వివిధ శాఖలలో గణనీయమైన ప్రగతిని సాధించినవి. అయితే, సమాజం యొక్క ప్రత్యేకమైన అవసరాలను తీర్చే విధంగానే ఈ ప్రగతి సాధింపబడినదని కల్హణుని పరిశీలన స్ఫురింపజేస్తున్నది. కాలంలోని ఆలోచనా విధానాల పరిపక్వత వల్ల వివిధరంగాలలో విజయం, ప్రగతి సాధించటంలో పరిశ్రమించిన విశిష్ట వ్యక్తులకు సమాజం కిరీటం పెట్టింది.

1. ఎర్లీ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ కాశ్మీర్, 1969. పు. 116.

వాక్పుష్ట, డిద్ద, సుగమాల, సూర్యమతి వంటిరాణుల, ఇతర అప్రధాన స్త్రీల జీవితాలను గమనిస్తే, ప్రజా జీవితంలో స్త్రీలకు పురుషులతో సమానావకాశాలు లభించినట్లు స్పష్టపడుతుంది. కల్హణుడు (మరి ఇతర చారిత్రకులు గూడా) ప్రాచీన భారతదేశంలో స్త్రీల విద్యా-పాండిత్య-సామర్థ్యాలను ఎన్నో విధాలుగా వివరంగా ప్రస్తావించి ప్రశంసించినారు. అసూర్యంపశ్యలుగా, ముసుగులు వేసుకొని అంతః పురాలలోనే అణిగిమణిగి ఉండటమనేది వారికి తెలియదు. గృహ ప్రాంగణంలో నుండి రాజకీయ, ప్రజా జీవితరంగాల మీదికి స్త్రీ దూసుకుని వచ్చి తలెత్తుకుని నిలిచింది. ఆర్. ఎస్. పండిట్ రాజతరంగిణి అనువాదానికి 'ముందు మాటల'లో జవాహర్ లాల్ నెహ్రూ అన్నట్లు—"కేవలం యవనికాభ్యంతరాలలోనే గాకుండా రాజ్య మంత్రాంగంలోనూ, విద్యారంగంలోనూ, యుద్ధరంగంలో కూడా స్త్రీలు ఎంతో ప్రాధాన్యం వహించినట్లు కల్హణుని గ్రంథం ద్వారా తెలుస్తున్నది". రాణులకు సొంత ఆస్తులుండేవి. పరిపాలనా యంత్రాంగంతో క్రియాశీల సంబంధాలు కలిగి వుండేవారు. స్త్రీ పురుష భేదంగానీ, జన్మ-వర్ణ పరమైన భేదంగానీ రాజకీయ-సైన్య-ప్రజారంగాలలో ఏ పదవిని అధిష్ఠించటానికైనా ఆటంక మయ్యేదికాదు. నాట్యకత్తె కూడా రాజకీయాలలో ఉత్తేజకరంగా పాల్గొంటూ ఉండేది. "కాశ్మీర భూమి రాజుల నెదించటంలో ప్రసిద్ధి వహించింది" అన్నాడు కల్హణుడు. "ఈ దేశంలో దేవాలయాలలో నాట్యంచేసే స్త్రీలుగూడా రాజుల నెదిరించటంలో ఉల్లాసం పొందుతారు" అనిగూడా అన్నాడు.

కర్కోటకుల కాలానికి పూర్వమే భూమికి ప్రాధాన్యం పెరగటం గమనింపబడింది. అయితే, రైతుల జీవితాన్నిగూర్చి రాజతరంగిణిలో వివరాలు లభించవు. కాని, భూస్వాములైన డమరులు పన్నులు వసూలుచేయటానికి సంబంధించిన వివరాలనుండి కొన్ని అంశాలను రాబట్టవచ్చు. రాజ్యంలో అస్థిరత్వం నెలకొన్న కాలంలో డమరులు, తంత్రిణులు తమ ఇష్టం వచ్చినట్టుగా రాజ్యానికి రాజులను మారుస్తూ ఉండేవారు. వారినిగూర్చిన తన తిరస్కారభావాన్ని కల్హణుడెక్కడా దాచుకోలేదు.

అస్పృశ్యత అనేది కాశ్మీరులో ఎవరూ ఎరుగని విషయం. బౌద్ధమత ప్రాధాన్యం గల కాలంలో అస్పృశ్యత అనేది పూర్తిగా అణగారిపోయిందనవచ్చు. చక్రవర్మ మహారాజు 'అస్పృశ్య' డోంబా స్త్రీని వివాహమాడి

నాడు. భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో భావింపబడే అస్పృశ్యులవంటి వారు కారు డోంబులు. వారు చక్కని గాయకులన్నాడు కల్హణుడు. చండాలురనే మరొక అవరవర్ణం చెప్పబడింది వీరిలో కొందరు రాజుకు అంగరక్షకులుగా ఉండేవారు. అత్యంత సాహసోపేతులైన సేనాపతులుగా బ్రాహ్మణులుకూడా ఉండేవారని కల్హణుని గ్రంథం తెలియవరుస్తున్నది. ఆరోగ్యకరమైన ఈ విధానాన్ని మరాఠారాజులు పునరుజ్జీవింప జేసినారు. అయితే, గమనించవలసిన అంశమేమంటే, బ్రాహ్మణులకూ అవర వర్ణాలకూ మధ్య భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో ఉన్న మాదిరిగా మరే వర్ణాలూ (క్షత్రియ - వైశ్య - శూద్ర అనేవి) లేవు.

రాజతరంగిణి కేవలం రాజులు, వారి రాజ్యాలకు చెందిన సమాచారానికి మాత్రమే పరిమితంకాదు. అంతకుమించి విస్తరించిన గ్రంథమది. సమకాలీన సామాజిక – రాజకీయ జీవితాన్ని ప్రామాణికంగా చిత్రించి కల్హణుడు మనకందించినాడు. కాశ్మీరు, దానికి సంబంధించి ఉన్న వివిధ ప్రాంతాల గతాన్ని గూర్చిన సమాచారానికి కల్హణుని గ్రంథం ఒక అగాధమైన నిధి. అనంతరకాలాన గజిబిజిగా సాగిన కాశ్మీరు చరిత్ర పరిణామ రీతిని సరిగా అవగాహన చేసుకొనటానికి ఈ గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుంది. కల్హణుని రచనాకాలానికి (క్రీ. శ. 1148-49) – మొగలు సామ్రాజ్యంలో కాశ్మీరు ఒక భాగమైపోయిన కాలానికి (క్రీ. శ. 1583) మధ్యకాలంలో రాజకీయ పరిస్థితులలోని అవిచ్ఛిన్న పరిణామరీతి రాజతరంగిణి ఉత్తరార్ధంలో చిత్రించబడిన పరిస్థితులనే సూచిస్తున్నది.

కల్హణుని కవితారీతిలోని ఒక విశిష్టలక్షణం సూక్తిమయత, వర్ణనాత్మక శ్లోకాల బాహుళ్యం. కల్హణుని గ్రంథరచనకు లభించిన ఆధార గ్రంథాల విషయాల వాస్తవికత అంతగా కచ్చితమైనది కావచ్చు, కాకపోవచ్చుగాని, వాటినిగూర్చి ఆయన వినయలక్షణం ఈ క్రింది పంక్తులలో వ్యక్తమవుతుంది :

> పూర్వ గ్రంథాలు వర్ణించిన కథా విషయ వస్తువునే నేను మరల వర్ణిస్తున్నాను. అయినా, నేను చెప్పే కారణాలను, ప్రయోజనాన్ని సరిగా వినకుండానే సహృదయులు నా గ్రంథ విషయంలో విముఖులు కాకుందురుగాక,

సమకాలీన రాజుల విషయాలను వ్రాసిన ప్రాచీనుల చారిత్రక గ్రంథా లాధారంగా ఆధునికులు వ్రాస్తున్నప్పుడు ఎంత సామర్థ్యం చూపటానికి వీలవుతుంది? అందువలన పూర్వుల గ్రంథాలలో నిర్లక్ష్యం చేయబడిన, విడువబడిన అంశాలను నా వర్ణనలో సమ కూర్చి ఒక అనుస్యూతిని సంపాదించటానికి ప్రయత్నిస్తాను.

ఈ గ్రంథం నేర్పే గుణపాఠమిది: "లౌకిక వైభవమంతా అశాశ్వతం. వారి వారి కర్మఫలం ఆయావ్యక్తులను అనుసరిస్తూనే ఉంటుంది." ఈగ్రంథం లోని తరంగా లెనిమిదింటిలో నాలుగు ఈవిధమైన తాత్పర్యకథనంతోనే ముగుస్తవి. ఆయన గాఢమైన అభిప్రాయం ఒకటి ఎనిమిదవ తరంగంలో ఈవిధంగా ఉన్నది.

నీడ స్వయంగా నిరంకుశ ప్రవృత్తి గలది. (దాని నాపగలదేదీలేదు.) నీడచే అనుసరింపబడిన ఎండమాత్రం (నీడతో) సంబంధం వల్ల వందల విధాలుగా ఉంటుంది. అదేవిధంగా, దుఃఖం సుఖంకన్నా భిన్నమైనదే అయినా, సుఖంయొక్క స్థితి అనంతమైన దుఃఖం కలి గించే బాధలతో వేధలతో విశీర్ణమైపోతూ ఉంటుంది.

అంతా విధివిధానమే అని అనుకొనేవాడు కాడు కల్హణుడు. అట్లాగని, థామస్ హార్డీవలె, అంతా 'పరిస్థితుల పీడనం మాత్రమే' అనికూడా విశ్వ సించేవాడు కాడు. కర్మసిద్ధాంతంలో బౌద్ధమతానికున్నంత విశ్వాసం కల్హణుని కున్నది. ఇది మొత్తం గ్రంథంలో కొట్టవచ్చినట్టు కన్పిస్తుంది. ఆయన కాలంలో బౌద్ధానికి శైవం పరిపోషకమైం దనేది గమనింపదగిన అంశం. "ప్రతిదీ కాలానుగుణంగా అంతరిస్తుందనీ, సమయానుసారం క్షీణి స్తుందనీ కల్హణు డెరుగును కేవలం కళాకారుడు మాత్రమే పరుగెత్తే గతాన్ని పట్టుకొని, ఒకరూపమిచ్చి దానికి అమరత్వం సాధిస్తాడు."

పాఠకుడు కొంత ఓపికగా తనను అనుసరించవలెనని కల్హణుడు ఆశించినాడు. సమకాలీన ప్రభువులలో ఎవరికి కూడా తాను స్తుతి పాఠకుడు కాదని ఆయన స్పష్టం చేసినాడు. ఆయన వ్రాసినదంతా విషయపరంగా మాత్రమే సాగింది కాబట్టి విశ్వసించదగింది అందువల్ల పాఠకుడు ఆ చరిత్ర గమనం నుండి నిష్పన్నమైన పాఠాలతో లాభం పొందవచ్చు.

కల్హణునికి అనంతర కాలాన రచింపబడిన చారిత్రిక గ్రంథాలలో చాలినంత ప్రామాణిక సమాచారం లభించదు. అయితే, లభించినంతవరకు సరిగా వ్యాఖ్యానించుకొనటానికి ఉపకరించే సమాచారం కల్హణుని రాజతరంగిణిలో ఉన్నది. ఇందుకు కల్హణుడు మనఃస్ఫూర్తిగా అభినందనీయుడు. ఈ విధంగా గొప్ప చారిత్రికుడు, కవి అయిన కల్హణుడు ప్రాచీన కాశ్మీరు చరిత్ర–సంస్కృతులను విస్మృతి సముద్రంలో మునిగిపోకుండా రక్షించటమే కాక, పూర్వ చారిత్రకులలోని అసంబద్ధ మన్పించే అంశాలకు చరిత్ర పరిశోధకులు సమన్వయించుకొనటానికి కూడా ఎంతో సహాయపడినాడు. చివరిమాటగా – కాశ్మీరు చరిత్రాధ్యయనం చేసిన చారిత్రకుడు గతంతో తృప్తిగా సంభాషించగలడు. భౌతికంగా, నైతికంగా ఎంతో నేర్చుకోగలడు. మరి, ఇంతటి అవకాశం భారతదేశపు ఏ ఇతర ప్రాంత చరిత్రాధ్యయనం చేసినవారెవరికీ లేదు.

## ఇతర చారిత్రకులు

కాశ్మీరుకూ దాని చుట్టుప్రక్కల ప్రాంతాలకూ సంబంధించి ప్రాచీన కాలపు సమాచారం విషయంలో కల్హణుని రాజతరంగిణి ఒక పెన్నిధి. కల్హణుని తరువాతి కాలపు కాశ్మీరు చరిత్రయొక్క వివిధగతులను అవగాహన చేసుకొనటానికి కూడా అది ఎంతగానో ఉపకరిస్తున్నది. కవి - చరిత్రకారుడు అయిన కల్హణుడు చరిత్ర రచనలో వేసిన దారిలోనే తరువాతి చరిత్రకారులు ముందుకు సాగినారు. వారిలో పలువురు కల్హణుని మాదిరిగానే కవులు, పండితులు కూడా.

జోనరాజ పండితుడు కల్హణుని రాజతరంగిణిని తన కాలందాకా విస్తరింపజేసినాడు. క్రి.శ. 1383 లో జన్మించినట్లు భావింపబడుతున్న జోనరాజు ప్రసిద్ధ పండితుడు. ఆయన అసలుపేరు జ్యోత్స్నాకరుడు. రాజతరంగిణి సమాప్తమైన కాలం (క్రి.శ. 1149-50) నుండి క్రి.శ. 1459 వరకు చరిత్ర రచన సాగించినాడు. ఆయన విశిష్ట పాండిత్యం కారణంగా ఉదారుడైన ముస్లింరాజు జైన్-ఉల్-అబిదిన్ సుల్తాను గౌరవానికి పాత్రుడైనాడు. రాజతరంగిణితో ఆగిపోయిన చరిత్రను తన కాలంవరకు సాగించుమని సుల్తాను జోనరాజును కోరినాడు. జోనరాజు రచించిన ఈ గ్రంథం 'ద్వితీయ రాజతరంగిణి'గా ప్రసిద్ధమైనది.

జోనరాజు 'రాజతరంగిణి' లో అధికభాగం కల్హణుని కాలం తరువాతి హిందూ రాజుల - జయసింహుని నుండి రాణి కోటాదేవి వరకు - రాజ్యకాలాలను వివరిస్తుంది. జోనరాజు పాండిత్యం చాలా గొప్పది. అయితే, చారిత్రకుడుగా ఆయన సాధించవలసిన అంశాలమీద, ఆయన చాతుర్యంమీద ఆయనయొక్క పాండిత్యభారం తలమునకలుగా పడింది. శ్రీకాంత కౌల్ గుర్తించినట్టుగా - "ఈ గ్రంథాన్ని చెడగొట్టిన ప్రధాన లోపం భాషా ప్రౌఢిమ, పదసముదాయంలోని అస్పష్టత. ఈ గ్రంథ రచనారీతి పలుసందర్భాలలో చారిత్రకంగా కచ్చితమైన నిర్ణయాలు చేయటానికి వీలైన సమాచారాన్ని కచ్చితంగా అందించటంలో విఫలమైంది." కాగా చివరకు కౌల్ - "జోనరాజుయొక్క మిక్కిలి క్లిష్టీకరింపబడిన అభివ్యక్తి పాఠకులను, పరిశోధ

కులను చివరకు చికాకుపెట్టేవిధంగా తయారైంది'' అని అంటాడు. పాలకుని ఆజ్ఞతో వ్రాయబడిన ఈ చరిత్ర గ్రంథంలోని కొన్ని భాగాలు 'రాజ్యసభా పత్రాల'వలె తయారైనవి. జోనరాజుకు లభించిన ఆధారాలు చాలీచాలని సమాచారాన్ని అందీయటంవల్ల కావచ్చు, మొదటి రాజుల రాజ్య కాలాలను గూర్చి సారాంశంగా మాత్రమే వ్రాయబడింది. ప్రధానమైన ఘట్టాలనేకం కేవలం ఒక్కొక్క శ్లోకంలో మాత్రమే చెప్పబడినవి. అనే కాంశాలు నిర్లక్ష్యం చేయబడినవి. ఈ విధమైన పలులోపాలున్నా గూడా జోనరాజు 'రాజతరంగిణి'1 తన ప్రత్యేకతను నిలుపుకొంటూనే ఉన్నది. క్రీ.శ. 1150 నుండి క్రీ.శ. 1459 వరకు కాశ్మీరు సమాచారాన్ని సమ కూర్చే గ్రంథాలన్నింటిలోనూ ఇది ప్రాచీనమైంది. మొత్తంమీద, ఉన్నంతలో ఇందులో చెప్పబడిన కాలక్రమం వాస్తవికమైనది, చిత్రించబడిన భౌగోళిక స్వరూపం విశ్వసింపదగింది. కాగా, విలక్షణమైన కావ్యరూపంలో, కల్హణుని కావ్యంవలె, విషయపరమైన దృష్టితో రచింపబడిన గ్రంథమిది.

జోనరాజు శిష్యుడు శ్రీవరుడు. ఈయన కూడా జైన్-ఉల్-అబిదిన్ సుల్తానుకు ఆత్మీయుడు. క్రీ.శ. 1459 నుండి క్రీ.శ. 1486 వరకు జరిగిన

---

1. జోనరాజు గ్రంథాన్ని జె. సి. దత్తు, డాక్టర్ పీటర్ సన్ అనే పండితు లిరువురూ సంప్రదించినారు. అయితే, దత్తు ఉపయోగించిన గ్రంథం (1835 నాటి కలకత్తా ప్రతి) లో 980 శ్లోకాలుండగా, పీటర్‌సన్ ఉపయో గించిన గ్రంథం (1896 నాటి బొంబాయి ప్రతి) లో 1334 శ్లోకాలున్నవి. ఈ తేడాలను ఉటంకిస్తూ తన 'కాశ్మీరు' అనే గ్రంథంలో డాక్టర్ జి. ఎం. డి. సూఫి ఈ విధంగా వ్రాసినాడు – ''పైగా, 'రాజావళీ పతకం' అనే పేర ప్రాజ్యభట్టు రచించిన గ్రంథం ఇప్పటివరకూ గుర్తించ బడలేదు. అంతేకాదు, నిజానికి శుకుడు రచించిన 'రాజతరంగిణి' ప్రాజ్యభట్టు—శుకుడు కలిసి రచించిన గ్రంథంగా వారు భ్రాంతిపడినారు. దీనికి కారణం సుల్తాన్ ఫతేషా మూడుసార్లు కాశ్మీరు సింహాసనాన్ని ఆక్ర మించటంవలన కలిగిన అస్తవ్యస్తత కావచ్చు. శ్రీవరుడు తన చరిత్ర గ్రంథాన్ని పూర్తి చేసేనాటికి ఫతేషా మళ్లీ సుల్తానైనాడు. రెండవసారి రాజ్యం చేస్తున్నాడు. కాగా, ఈ ముగ్గురు పండితుల సంబంధం అను స్యూతంగా సాగినట్లు కన్పిస్తుంది.''

సంఘటనలను నాల్గు అధ్యాయాలలో వివరిస్తూ తన గురువుగారి చరిత్ర గ్రంథాన్ని ముందుకు సాగించినాడు. ఈ గ్రంథం 'జైన-రాజతరంగిణి'గా వ్యవహరించబడింది. జోనరాజువలె శ్రీవరుడు కూడా గొప్ప పండితుడు, కవి. అంతకుమించి సంగీతవేత్తకూడా. అయితే, ఆయన తన గురువుగారి శైలిని అనుసరించలేదు. పూర్తిగా కల్హణుని శైలినే అనుసరించినాడు. నిజానికి, జోనరాజు గ్రంథానికి పొడిగింపైన శ్రీవరుని రచన అచ్చంగా 'రాజతరంగిణి' రచనయే అని అనిపిస్తుంది. ఇదిట్లా ఉండగా, ఆయన రచించిన నాలుగధ్యాయాలలో సమకాలీన జీవితానికి సంబంధించి విలువైన వివరాలు అనేకంగా లభిస్తున్నవి. ప్రముఖస్థలాల పేర్ల మార్పులకు సంబంధించి పలు విషయాలను ఆయన రచన తెలియజేస్తున్నది. ఉదాహరణకు-లలితాదిత్యుడు కట్టించిన దేవాలయానికి అంతగా దూరంకాని 'మార్తాండ తీర్థం' భవన మన్న పేరుతో ఉన్న అంశం ఇదివరకే ప్రస్తావించబడింది. ఆ పేరుతోనే అది ఈనాటికీ ఉన్నది. రచనా కార్యానికి అంకితమైన శ్రీవరుడు జైన్-ఉల్-అబిదిన్ సుల్తాను మొదలుకొని ఆయన తరువాత అధికారానికి వచ్చిన సుల్తాన్ హసన్‌షా వరకు (క్రీ.శ. 14 2-84) రాజుల మార్పిడిని వర్ణించినాడు. సంగీతశాఖకు అధికారిగా శ్రీవరుని హసన్‌షా నియమించినాడు. సంగీతాన్ని ఆ సుల్తాను సాంప్రదాయికంగా పోషించినాడు. ఆ తరువాత వచ్చిన సుల్తాను మహమ్మదుషా కూడా శ్రీవరుని గౌరవించినాడు.

శ్రీవరుడు తన రచనలో చిత్రించిన కాలం (క్రీ.శ. 1459-1486) ముప్పయ్యేళ్లకన్నా తక్కువే. కాని వివరాలు మాత్రం చాలా విపులంగా ఉన్నవి. కథనరీతిలో ఇది జోనరాజు రచనకన్నా మించిందని అందరూ అంగీకరిస్తున్నారు. అయితే, – "శ్రీవరుడు ఒక బానిసవలె కల్హణుని అనుకరించినాడు ...అతని రచన చాలాభాగం సొంతరచనగా కాక, రాజతరంగిణి లోని అధ్యాయంవలె అన్పిస్తుంది. పైగా జోనరాజు కథనంవలె రాజసభా పత్రం మాదిరిగా ఉంటుంది" అన్నాడు స్టెయిన్.[1] అంతమాత్రాన స్టెయిన్‌కు శ్రీవరుని రచనపై గౌరవంలేదని కాదు. తగినంతగా ఆ గ్రంథాన్ని గౌరవించినాడు – "ఇంతైనా, ఈ గ్రంథం చిత్రించిన ముప్పయ్యేళ్లకు సంబం

1. స్టెయిన్., ఎం.ఏ., క్రానికల్ ఆఫ్ ది కింగ్స్ ఆఫ్ కాశ్మీర్., రాజతరంగిణి ఆంగ్లానువాదం.

ధించిన చరిత్ర వివరాలకి గ్రంథం ఏకైకం కావటమే దాని ప్రత్యేకత" అన్నాడు.

శ్రీవరుని గ్రంథాన్ని ప్రాజ్యభట్టు ముందుకు సాగించినాడు. ఆయన గ్రంథంపేరు 'రాజావళీ పతకం.' క్రీ.శ. 1486 నుండి 1513-4 వరకు – ఈ ఇరవయ్యేళ్ల చరిత్రను ఈ గ్రంథం వివరించింది. ఈ కాలంలో సుల్తాన్ ఫతేషా, సుల్తాన్ మొహమ్మదుషా పరస్పరం ఒకరినొకరు రెండేసిమార్లు రాజ్యభ్రష్టులనుచేసి రాజ్యాధికారం చేజిక్కించుకున్నారు. ఈ రాజుల మార్పిడులు - ఆ రాజులే మాటిమాటికి మారిపోవటం – కొంత గజిబిజి కలిగించింది. క్రీ.శ. 1586 లో ఈ లోయప్రాంతాన్ని అక్బరు చక్రవర్తి తన సామ్రాజ్యంలో కలుపుకొన్న తరువాత శ్రీవరుని శిష్యుడైన శుకుడు[1] ఈ 'రాజావళీ పతక' గ్రంథాన్ని మరికొంత తరువాతి చరిత్ర చేర్చి పూర్తిచేసినాడు. ఈ భాగాన్ని కల్హణునిమీద తనకున్న గౌరవానికి సూచనగా ఆయన 'రాజతరంగిణి' అన్న పేరుతోనే వ్యవహరించినాడు. ప్రాచీన నగరాలకు తమకాలానికి జరిగిన పేర్ల మార్పిడి (కొన్ని ఈనాటి పేర్లకు చాలాదగ్గరగా ఉన్నవి) ప్రాజ్యభట్టు - శుకుల రచనల్లో ప్రముఖంగా కన్పిస్తుంది. ఆర్. కె. పర్ము[2] అభిప్రాయంలో – "ప్రాజ్యభట్టు అసలు రచన నశించిందనటంలో సందేహించ నవసరంలేదు. మనకినాడు లభించే భాగం ఆయన గ్రంథసారాన్ని 50 శ్లోకాలలోకి కుదించిన శుకుని రచన మాత్రమే." శుకుని గ్రంథంలో చాలా లోపాలున్నవి. కాలక్రమం అస్తవ్యస్తంగా ఉన్నది. ఆయన చిత్రించిన భౌగోళిక స్వరూపం గూడా అంతటా సరైనది కాదు.

రాజతరంగిణి సంప్రదాయాన్ని ముందుకు సాగించిన గ్రంథం ఇంకొకటికూడా ఉన్నది. దానిపేరు 'లోకప్రకాశం.' 11వ శతాబ్దానికి చెందిన క్షేమేంద్రుడీ గ్రంథాన్ని రచించినా డంటారు కాని, ఈ గ్రంథం రెండవ అధ్యాయంలో షాజహాన్ ప్రస్తావన ఉండటంవల్ల ఇది 17 వ శతాబ్దపు రచన అని చెప్పవలసివస్తున్నది. ఆ గ్రంథంలోని భాషాప్రయోగ

1. చూ. కింగ్స్ ఆఫ్ కాశ్మీర్ III – జోనరాజు, శ్రీవరుడు, శుకుడు రచించిన 'రాజతరంగిణు'లకు జె. సి. దత్తు ఆంగ్లానువాదం, కలకత్తా 1898.

2. హిస్టరీ ఆఫ్ ముస్లిం రూల్ ఇన్ కాశ్మీర్; 1320–1819., క్రొత్తఢిల్లీ 1969.

విధానం, పర్షియన్ - సంస్కృత పదాల కలగలుపు, కాశ్మీరభాషా ప్రభావం మొదలైనవాటిని బట్టి ఈ అంశం నిరూపితమవుతున్నది. అయితే, ఈ గ్రంథంలో ఒక ప్రత్యేకత ఉన్నది. రాజకీయ - రాజవంశాల వివరాలకన్నా రాజ్యపరిపాలన, ఆర్థిక, సామాజిక పరిస్థితుల వివరణ ఇందులో అధికంగా ఉన్నది.

ఈ చరిత్ర గ్రంథాలన్నీ కావ్యాలుగా, కల్హణుని రాజతరంగిణితో పోల్చి చూచుకుంటే, నిశ్చయంగా తక్కువస్థాయికి చెందినవే. అయితే, వాటి లోని లోపాల విషయం ఎట్లాఉన్నా, చరిత్ర రచనలో కల్హణుడు ప్రవేశ పెట్టిన విధానాన్ని అవి గణనీయంగా పెంపొందించినవి. హిందూ రాజుల చేతులలో నుండి కాశ్మీరు రాజ్యాధికారం ముస్లిం రాజుల చేతులలోనికి మారిన కాలానికి సంబంధించిన ప్రామాణిక సమాచారాన్ని ఈ గ్రంథాలు మనకు అందిస్తున్నవి. కాగా, - "కాశ్మీరుపై అక్బరు విజయం సాధించటానికిముందు ఏ కొద్ది సందర్భాలలోనో తప్ప - దాదాపు రెండున్నర శతాబ్దాలలో వ్యాపించిన కల్లోలాలతో, అణచివేతలతో సతమతమై నలిగిపోయిన సమ కాలీన జీవితాన్ని ఈ గ్రంథాలు నిజాయితీగా వెల్లడిస్తున్నవి."[1] ఆయా రచయితల అభిప్రాయాలు వారివారి కథనరీతిని ప్రభావితం చేసినా గూడా, మొత్తంమీద సమకాలీన సంఘటనలకు సంబంధించి ఈ గ్రంథాలవల్ల లభించే సమాచారం వాస్తవికమైంది. జోగేశచంద్ర (జె.సి.) దత్తు అన్నట్లుగా - "ఈ రచయితల రచనలు విలువైనవనటం కేవలం చారిత్రక దృష్టితో మాత్రమే. ఈ రచనలలోని సమాచారపు వాస్తవికతను పరీక్షించుకొన టానికి కాశ్మీరుకు సంబంధించిన తత్కాలీన చరిత్ర మరేదీ లభించకపోవటం వల్ల; ఆస్థాన పండితులైన ఈ రచయితలు తాము ఏ రాజులకు సంబంధించి వ్రాస్తున్నారో ఆ రాజుల చిరునవ్వులమీద బ్రతికేవారు కావటంవల్ల-ఈ రచ యితలు ఆయా వ్యక్తులను గూర్చి, సంఘటనలను గూర్చి చెప్పిన అంశాలను నిస్సంకోచంగా అంగీకరించే అవకాశం లేదు."[2]

కాశ్మీరు ముస్లింల పరిపాలనలోనికి వచ్చినతరువాత కూడా దాదాపు రెండుశతాబ్దాలవరకు రాజకీయ వ్యవహారాల భాషగా సంస్కృతమే సాగింది.

---

1. బామ్ జై., పి.ఎన్. కౌల్., ఎ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్. 1962.

2. కింగ్స్ ఆఫ్ కాశ్మీర్., సంపుటం III ప్రస్తావన

అయితే, ముస్లింరాజులు పారసీ భాషా సాహిత్యాల నాదరించటం, వాటికి ప్రాధాన్యమీయటం పెరుగుతున్నకొద్దీ చరిత్ర గ్రంథాలు సంస్కృతంలో రచించటమనేది క్రమంగా తగ్గిపోసాగింది. కాశ్మీరు పండితులు తమంతట తామే ఈ విధమైన మార్పుకు అలవాటుపడిపోయినారు. చరిత్ర గ్రంథాలను పారసీ భాషలో రచించసాగినారు.

సంస్కృత భాషలో రాజతరంగిణిని ముందుకు సాగించటానికి ఒక వైపు ప్రోత్సహిస్తూనే, మరొకవైపు దాన్ని సుల్తాన్ జైన్-ఉల్ - అబిదిన్‌పారసీ భాషలోకి ముల్లా అహమద్‌తో అనువదింపజేసినాడు. ఈ అనువాదానికి సుల్తాన్ సరియైన వ్యక్తినే ఎన్నుకున్నాడనవచ్చు. స్వయంగా ముల్లా అహమద్ సమర్థుడైన పండితుడు, విలక్షణమైన కవి, చరిత్ర రచయిత. ఈ అనువాద గ్రంథం పేరు 'బహ్‌ర్-ఉల్-అస్మార్' (కథా సముద్రం). ముల్లా అహమదు ఈ అనువాద కార్యాన్ని చివరిదాకా సాగించలేకపోయి ఉంటాడు. ఆ అసమగ్ర రచనను అక్బర్ రాజ్యకాలంలో అబ్దుల్ ఖాదిర్ బదాయూని అనే పండితుడు పూర్తిచేసినాడు; అసలు గ్రంథాన్ని కొంత సంస్కరించినాడు. వ్యావహారిక పార్సీ భాషలోకి మార్చినాడు. ఈ మార్పు చక్రవర్తి కోరిక ననుసరించి జరిగింది. అయితే ఈ ఇద్దరి రచనలలో ఏదికూడా ఈనాటికి లభించటంలేదు. కాని, ముల్లా అహమదు వ్రాసిన చరిత్ర గ్రంథం మలిక్ హైదర్ చౌదురా రచనకు ఆధారమని మాత్రం కచ్చితంగా చెప్పవచ్చు.

కల్హణుని రాజతరంగిణిని అనుసరించి, ఆదికాలం నుండి తనకాలం – అంటే; జహాంగీరు కాలంవరకు మలిక్ హైదర్ కాశ్మీరు చరిత్రను పార్సీ భాషలో రచించినాడు. ఈ గ్రంథంలోని విషయం జహాంగీరు చక్రవర్తి రాజ్యకాలంలో 12 వ సంవత్సరం (క్రీ.శ. 1617) తో ముగుస్తున్నది. ఈ గ్రంథం పేరు 'తవారిఖ్-ఏ-కాశ్మీర్'. సమకాలీన సంఘటనల కిది దర్పణం వంటిది. మలిక్ హైదర్‌కు సమకాలీన రాజకీయ సంఘటనలతో కల్హణుని కంటె కూడా ఎక్కువ ప్రత్యక్షంగా జోక్యం ఉండటమే ఆ గ్రంథం 'దర్పణం' కావటానికి కారణం. మలిక్ హైదర్, ఆయన సోదరుడు మాలిక్ అలీ - ఈ ఇద్దరూ షేర్ అఫ్ఘన్ ఖాన్ యొక్క భార్య అయిన మీర్-ఉన్-నీసా బేగంను అతని మరణానంతరం రక్షించినారు. ఆ తరువాత ఆమె జహాంగీర్ చక్రవర్తి భార్య అయి 'నూర్‌జహాన్' అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. మలిక్ హైదర్ పట్లగల కృతజ్ఞతా సూచనగా ఆమె జహాంగీరుకు

గొప్పగా చెప్పగా జహాంగీర్ ఆ హైదర్‌ను ఎన్నో బిరుదులతో సత్కరించినాడు. కాశ్మీరు ప్రభుత్వంలో హైదర్ పెద్ద పదవిని నిర్వహించినాడు. చక్రవర్తి చేసిన గౌరవానికి ఆయన నిజంగా అర్హుడే. ఆయన వాస్తునిపుణుడు కూడా. జామా మసీదును, ఇంకా తక్కిన మసీదులను గూడా ఆయన పునర్నిర్మించినాడు. మలిక్ హైదర్ ఉపనామం 'చౌదురా'. శ్రీనగర్‌కు దక్షిణంగా 17 కిలో మీటర్ల దూరంలో ఉన్న ఆయన గ్రామాన్ని బట్టి ఆయనకా ఉపనామం వచ్చింది. ఆ గ్రామం ఆయన జన్మస్థానంగా జహంగీర్ తన సంస్మృతులు - 'తుజుక్ ఏ జహంగీరి' లో చెప్పినాడు. కాగా, ప్రస్తుతం ఆసక్తికరమైన విషయమేమిటంటే, మలిక్ హైదర్ రచించిన చరిత్ర గ్రంథం మాదిరిగానే, అబుల్ ఫజల్ వంటి మరికొందరు రచించిన చరిత్ర గ్రంథాలుకూడా బాహాటంగా రాజతరంగిణినే ఆధారం చేసుకొని సాగినవి. అనేక సంఘటనలు, అద్భుతాలు ఆ గ్రంథంలో నుండి స్వీకరించి యథాతథంగా పునరుక్తమైనవి ప్రాచీన హైందవరాజులను గూర్చి కల్హణుడు చెప్పిన కథలనే హైదర్ మరింతగా అలంకరించి చెప్పినాడు. అయితే, చారిత్రక వాస్తవికతను అధికంగా సంతరించుకొన్న లొహరా వంశం మొదలైనవాటిని గూర్చి కల్హణుడు చెప్పిన అంశాలకు మాత్రం హైదర్ కొద్ది పుటలను మాత్రమే కేటాయించినాడు.

'తవారిక్-ఏ-కాశ్మీర్' అనే పేరుతోనే మరొక చరిత్ర గ్రంథం కూడా ఉన్నది. దీని రచయిత హసన్-అలీ కాశ్మీరి. హైదర్ గ్రంథంతో పోల్చి చూస్తే, ఇది చిన్న గ్రంథం. ప్రాచీన కాలంనుంచి క్రీ.శ. 1616 వరకు వివిధ సంఘటనలను ఈ గ్రంథం చిత్రిస్తున్నది. ప్రధానంగా హసన్‌షా రాజ్యకాలం చివరివరకు సుల్తానుల పాలనలో ఉన్నప్పటి కాశ్మీరు సమాచారం ఇందులో వివరంగా ఉన్నది. కల్హణుని నుండి సాగివచ్చే కవి - చారిత్రిక సంప్రదాయం ఇంకా సాగుతూనే ఉన్నది. పారసీ సాహిత్య మర్మజ్ఞుడయిన నారాయణ కౌల్ అజీజ్ (అజీజ్ అనేది నారాయణ కౌల్‌కు కవితాపరమైన ఉపనామం) అనే కవి మలిక్ హైదర్ అడుగుజాడలలో సాగుతూ క్రీ.శ. 1710 లో 'తవారిక్-ఏ-కాశ్మీర్' రచించినాడు. సుల్తానులకు, మొగలులకు సంబంధించి విషయపరమైన దృష్టితో ఇది రచింపడిబండి. అయితే, ఈ గ్రంథంలోని ఎక్కువ భాగం మలిక్ హైదర్ చరిత్ర గ్రంథం మీద ఆధారపడి ఉన్నది.

ఇహా గ్రంథకర్త అయిన మరొక కవి మహమ్మద్ అజం కౌల్. అప్పటి అవసరాన్ని బట్టి తన చరిత్ర రచనా కౌశల్యాన్ని ప్రదర్శిస్తూ 'వాఖియాత్-ఏ-కాశ్మీర్' (కాశ్మీరు సమాచారం) రచించినాడు. మొగలులలో చివరి రాజుల కాలాన శ్రీనగర్‌లో నివసించినవాడు ఆయన. ఆయన చరిత్ర గ్రంథంలోని సమాచారం క్రీ.శ. 1746 లో ముగుస్తుంది. ఈ గ్రంథం ఆయన గాఢ పరిశ్రమ ఫలం. అందులో వివరింపబడిన కాలం కేవలం పదకొండు సంవత్సరాలు మాత్రమే. పూర్వగ్రంథాల కిది ఒక విధంగా సంక్షిప్తరూపమనవచ్చు. కాని, సమకాలీన మత, సామాజిక, సాహిత్యక రీతులను ప్రధానంగా ఇది చిత్రించింది. ఆ గ్రంథాన్ని రచించటంలో కావ్యంగా కౌల్ సాధించిన ఫలితాల విషయం అట్లా ఉండగా, ఖ్వాజా మహమ్మద్ అజం ఒక గొప్ప పుణ్యాత్ముడుగా, భక్తుడుగా కీర్తింపబడినాడు. ఆయన మరణానంతరం క్రీ.శ. 1765 లో ఆయన కుమారుడు ఖ్వాజా మహమ్మద్ అస్లామ్ తండ్రి రచనకు మరికొంత చేర్చి 'గౌహర్-ఏ-ఆలమ్' (విశ్వవిభూషణాలు) రచించినాడు.

ఇక, 19 వ శతాబ్దంలోకి వస్తే, కాశ్మీరుకు చెందిన మరొక కవి - చారిత్రకుడు కన్పిస్తాడు. ఆయన బీర్బల్ బ్రహ్మ పండితుడు. ప్రసిద్ధ ఫారసీ భాషావేత్త. 'ముఖ్తసర్ తారీఖ్-ఏ-కాశ్మీర్' (కాశ్మీరు సంక్షిప్త చరిత్ర) అనే చరిత్ర గ్రంథాన్ని ఆయన రచించినాడు. రెండవ డోగ్రా మహారాజా రంజిత్ సింగ్ రాజ్యకాలంలో - క్రీ.శ. 1835 లో ఈ గ్రంథం రచింపబడింది. మొగలులు - అఫ్ఘనుల కాలంలో గజిబిజిగా సాగిన కాశ్మీరు దేశపు చరిత్ర ఈ గ్రంథంలో సుదీర్ఘంగా వర్ణింపబడింది కల్హణునివలెనే బ్రహ్మ పండితుడు కూడా ప్రజల జీవన పరిస్థితుల చిత్రణకు అధిక ప్రాధాన్యమిచ్చినాడు. హిందువుల సామాజికాచార సంప్రదాయాలను గొప్పగా చేసి చెప్పినా గూడా, ఆ కాలపు పరిస్థితులను గూర్చి ఆయన అంచనాలు చరిత్రకారులకు మిక్కిలి విలువైనవి - అక్కడక్కడా చారిత్రిక గ్రంథ స్వభావానికి సరిపడని అత్యంతాతిశయోక్తులు, వర్ణలు కొన్ని కన్పిస్తవి.

భారతీయ సంస్కృత సాహిత్యంలో కాశ్మీరు ప్రస్తావన అంతగాలేదు. ఈ లోపమే ప్రధానంగా కల్హణుని చరిత్ర గ్రంథానికి, ఇదివరకే సూచింపబడినట్లు, పరోక్షంగా మరింత ప్రాధాన్యాన్ని కలిగిస్తున్నది. అతి ప్రాచీన

విద్యాస్థానాలు, సాహిత్య సంస్థానాలు అనేకం నిర్లక్ష్యం చేయబడినవి, లేదా, అల్పంగా సంస్కృత సాహిత్యంలో ప్రస్తావించబడినవి. ఇందుకు కాశ్మీరు కూడా అపవాదంకాదు. అయితే, పాణిని తన అద్భుతమైన సంస్కృత వ్యాకరణ గ్రంథంలో కాశ్మీరును పేర్కొన్నాడు. కాశ్మీరును మహాభారతమే కాక, అనేక పురాణాలు గూడా ప్రస్తావించినవి. వరాహమిహిరుని (క్రీ.శ. 500) 'బృహత్ సంహిత'లో కాశ్మీరు భారతదేశపు ప్రాంతాల్లో చేర్చి చెప్పబడింది.

భారతదేశపు హద్దులను దాటి గమనిస్తే, పరిస్థితి మరొక విధంగా ఉన్నది. టాలమీ (క్రీ.శ. 2 వ శతాబ్దం) తన భూగోళశాస్త్రంలో 'కస్పెరియా' (కాశ్మీరు) ప్రాంతాన్ని 'బిదాస్పెస్' (వితస్తానది) క్రింది ప్రాంతాల్లో చేర్చి చెప్పినాడు. హెకాటియస్ (క్రీ.పూ. 546-486) 'కస్పపైరోస్' అనేది గాంధారదేశీయుల నగరమని చెప్పినాడు. ఇట్లా చెప్పటానికి కారణం, ప్రాచీన కాలంలో గాంధారం (కాబూలు లోయప్రాంతం) తో కాశ్మీరుకు సాంస్కృతిక - రాజకీయ సంబంధాలు గాఢంగా ఉండటమే. ఆ తరువాత హైరోడోటస్ ('చరిత్రపిత') 'కాస్పపైరస్' నగరాన్ని పేర్కొన్నాడు.

ఈ ప్రాచీన ప్రస్తావనలు పశ్చిమదేశాలలో కాశ్మీరు కీర్తిని వ్యక్తపరుస్తుండగా, ఈ లోయ ప్రాంతం గురించి చైనీయుల ప్రస్తావనలు క్రీ.శ. 541 నుండి మరింత వివరంగా లభిస్తున్నవి. క్రీ.శ. 631 నుంచి దాదాపు రెండు సంవత్సరాలు ఈ ప్రాంతంలో ఉన్న ప్రసిద్ధ చీనాయాత్రికుడు హ్యూవాన్ సాంగ్ వ్రాతలు చాలా వివరాలతో కన్పిస్తున్నవి. రాజు, ఆయన రాజ్యం, ఆయన సహనశీలం, ప్రజలూ, వాతావరణం, భూమి పరిస్థితి మొదలైన అంశాలను గూర్చి లక్ష్యప్రాయంగా కచ్చితమైన రీతిలో వర్ణించినాడు. ఆనాటి సంప్రదాయాలను, ఈ లోయ ప్రాంతపు ఆదిమకాలదశను గూర్చి ఆయన వ్రాసిన అంశాలు చరిత్రకారులకు ఎంతో ఉపయోగకరంగా ఉన్నవి. తాను క్రీ.శ. 633 లో తాస్మైదన్ పర్వతమార్గం ద్వారా ఆ లోయప్రాంతం నుంచి తిరిగి వెళ్ళిపోయినట్లు, పన్-ను-సో చేరినట్లు, ఆయన వ్రాసినాడు. పన్-ను-సో అనేది కల్హణుని గ్రంథంలో 'పరోత్స' అని పేర్కొనబడింది. అది ఈనాటి 'పూంఛ్.'

ఈ విధమైన ప్రస్తావనల విషయంలో టాంగ్ వంశపు రాజ తంత్రాలకు గూడా చాలా ప్రాధాన్యమున్నది. తమ రాజసభకు కాశ్మీరునుంచి ఒక

రాయబారి వచ్చినాడని, ఆ రాయబారిని చెన్‌టో-లో-పి-లి అనేరాజు పంపినాడని, ఆయన తరువాత రాజ్యానికి వచ్చిన ఆయన సోదరుడు ము-టో-పి అనేరాజు మరొక రాయబారిని పంపినాడని ఆ పత్రాలలో వ్రాయబడి ఉన్నది. ఈ రాజులపేర్లు రాజతరంగిణిలో కల్హణుడు పేర్కొన్న చంద్రాపీడ, ముక్తాపీడ (లలితాదిత్య) రాజుల పేర్లేనని చారిత్రికులందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. ఆ పత్రాలలో ప్రస్తావించబడిన మ-హో-టో-మో-తాగ్ సరస్సు (మహాపద్మ-ఇది వూలాన్ సరస్సుకు ప్రాచీనమైన పేరు), పో-లో-ఔ-లో-పో-లో నగరం (ప్రవరపురం - ఇది శ్రీనగర్‌కు ప్రాచీన నామం) కూడా రాజతరంగిణిలోను, ఇతర కాశ్మీరు చరిత్ర గ్రంథాలలోను ప్రస్తావింపబడినవే.

గమనింపదగిన మరొక చీనా యాత్రికుడు ఔకాంగ్. ఆయన గూడా హ్యూవాన్‌సాంగ్ మాదిరిగానే, ఉరుసా (హజరా) ద్వారా ఈ లోయ ప్రాంతానికి క్రి. శ. 859 లో వచ్చి నాలుగు సంవత్సరాలిక్కడ ఉన్నాడు. ఆ నాలుగేండ్లూ స్మరణీయమైనవి. ఆయన ఈ ప్రాంతాన్ని, ప్రజలను గూర్చి వ్రాసిన అంశాలు హ్యూవాన్‌సాంగ్ వ్రాసినంత స్పష్టంగా లేకున్నా, చారిత్రకంగా చాలా విలువైనవి. అవంతివర్మ (క్రి. శ. 855-883) కట్టించిన దేవాలయాలు, విహారాలను గూర్చి కల్హణుడు చెప్పిన అంశాలతో ఔకాంగ్ వ్రాతలు ఏకీభవిస్తున్నవి.

టాంగ్ వంశం అంతరించటంతో ఈ ప్రస్తావనలు ఆగిపోయినవి. భారతదేశపు వాయవ్యరాజ్యాలతో చైనాకుగల రాజకీయ సంబంధాలు హఠాత్తుగా తెగిపోయినవి. తరువాత రెండు శతాబ్దాలవరకు కూడా చైనా బౌద్ధులు కాశ్మీరుకు రాకపోకలు సాగించినారు గాని వారి దినచర్యా గ్రంథాలలో ఈ ప్రాంతాన్ని గూర్చికాని ప్రజలనుగూర్చి గాని ఏ విధమైన ప్రస్తావన గూడా కన్పించదు.

చైనావారి తరువాత కాశ్మీరుచరిత్ర - భౌగోళిక విషయాలను గూర్చి వ్రాసిన విదేశీయులు ముస్లింలు. తొలితొలిగా ఈ దేశానికి వచ్చిన ముస్లింలలో, ప్రస్తుత విషయాన్నిబట్టి, అల్బెరూని చాలా ప్రధానమైన వ్యక్తి. ఆయన గొప్ప అరబ్బీ పండితుడు. ఇతర భారతదేశ ప్రాంతాలతో వేరుబడ్డట్టుగా అన్పించే ఈ లోయప్రాంతంపై ఆయనకు మహమ్మదు ఘజనీ విజయాల

కారణంగా ఆసక్తి కలిగింది. "హిందువులు ఇంకా మన చేతులకు అందని కాశ్మీరు, బనారస్ మొదలైన ప్రాంతాలకు పారిపోయినారు" అని చెప్పబడింది. కాశ్మీరు, బనారసు శాస్త్రాలకు, కళలకు ప్రసిద్ధ కేంద్రస్థానాలని అల్బెరూని అన్నాడు. అయితే, మహమ్మదు ఘజనీ కాశ్మీరును జయించటంలో విఫలుడు కావటంవలన అల్బెరూని కాశ్మీరును దర్శించలేకపోయినాడు. అయినా కాశ్మీరు ప్రజలను, వారి ప్రవృత్తులను, వారి వ్యావసాయికత, కళలు, చాతుర్యం మొదలైనవాటిని గూర్చి ఇతర భారత ప్రాంతీయ విషయాలకన్నా వివరంగా వ్రాసినాడు.

మొగలులు అధికారంలోకి వచ్చిన తరువాత కాశ్మీరును గూర్చి చాలా రచనలు వచ్చినవి. అబుల్‌ఫజల్ అనే పండితుడు 'అయీన్-ఏ-అక్బరీ' అనే చారిత్రిక గ్రంథం రచించినాడు. అందులో కాశ్మీరుయొక్క ఆదికాలపు చరిత్రను సంగ్రహంగా వ్రాస్తూ, తన ఈ వ్రాతకు కల్హణుని రాజతరంగిణి ఆధారమని చెప్పినాడు. అక్బరువెంట ఫాదర్ గెరోమ్‌జావియర్, ఔరంగజేబు వెంట ఫ్రాన్సిస్ బెర్నియర్ అనే పాశ్చాత్యులు కొంతకాల మున్నారు. వారు కాశ్మీరు, అక్కడి ప్రజలను గూర్చి వ్రాసినారు. క్రీ.శ. 1665 లో ఔరంగజేబుతో విస్తృతంగా పర్యటించిన డాక్టర్ బెర్నియర్ వ్రాతలు, కాశ్మీరు సాంఘిక, ఆర్థిక జీవిత విషయాలను అనేకంగా వెలుగులోకి తెచ్చినవి. "కచె మీరు ప్రాచీన రాజుల చరిత్రలు జెహా-గుయర్ ఆజ్ఞప్రకారం ఫారసీ భాష నుండి ఇప్పుడు నేను అనువదిస్తున్నాను" అని అంటూ, తన అనువాదానికి మలిక్ హైదర్ రచించిన చరిత్ర గ్రంథంమూలమని ఆయన వ్రాసినాడు. ఈ అనువాదం ఈనాటివరకూ లభించలేదు. బహుశః అంతరించిపోయి ఉండవచ్చు. 18 వ శతాబ్దపు మధ్యకాలంలో "డిస్క్రిప్షన్ డె ల్' ఇన్ డె" అనే తన రచనలో టైరోలీస్ మిషినరి - లేపెరె టైఫెన్థలర్ - అనే ఆయన కూడా కాశ్మీరు రాజుల చరిత్రల సారాంశాలను సమకూర్చటానికి మలిక్ హైదర్ రచనయే మరొకసారి ఆధారమైనది. 17 వ శతాబ్దం చివరికాలంలో, 18 వ శతాబ్దంలోనూ మరికొంతమంది పాశ్చాత్యులు కాశ్మీరును గూర్చి స్పష్టంగా మరికొన్ని అంశాలు వ్రాసినారు. వారిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవాడు జార్జ్‌ఫార్‌స్టర్. ఆయన బెంగాలు సైన్యంలో ఒక అధికారిగా ఉండేవాడు. క్రీ. శ. 1783 లో ఈ ప్రాంతానికి ఆయన వచ్చినాడు. ఈ ప్రాంతపు సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులను గూర్చి అనేకాంశాలు ఆయన వ్రాసి

నాడు. మిక్కిలి క్రూరమైన అఫ్ఘనుల పాలనలో కాశ్మీరు ప్రజలు అనుభవించిన బాధలను గూర్చి ఆయన వ్రాసిన వ్రాతలు, ఆ తరహా సందర్భాల వివరణలో రాజతరంగిణి తెలియజేసే అంశాలను స్ఫురింపజేస్తున్నవి. సిక్కుల (క్రి.శ. 1819-46) కాలపు విషయాలను పలువురు పాశ్చాత్య యాత్రికులు చిత్రించినారు. వారిలో వైన్ అనే ఆయన వ్రాతలు చాలా ప్రధానమైనవి. రాజకీయ, ఆర్థిక విప్లవాలు, ప్రజలు, వారి ప్రవృత్తులు, జానపదరీతులు, శాలువాల వర్తకం మొదలైన అంశాలను ఆయన చిత్రించిన తీరునుబట్టి అధిక ప్రాధాన్యం పొందుతున్నవి. మూర్‌క్రాఫ్ట్ అనే ఆయన లధఖ్‌ను గూర్చి కూడా వ్రాసినాడు. అలెగ్జాండర్ కన్నింగ్‌హామ్ అనే ఆయన రచించిన 'లధఖ్' అనే గ్రంథం "చిన్న టిబెట్"ను గూర్చిన సమాచారానికి ప్రధాన గ్రంథం.

యాత్రిక రచయితలలో ఒకడైన సర్‌వాల్టర్ లారెన్స్[1] అనే ఆయన ఈ విధంగా వ్రాసినాడు: "కాశ్మీరు లోయ హిందువుల 'పవిత్ర దేశం' నేను తిరిగిన ఎన్నో పల్లెలలో ప్రాచీనావశేషాలను చూపించని పల్లె అంటూ లేదు ..." ఆసక్తిగలవారు సాగించిన త్రవ్వకాలలో క్రమక్రమంగా ముఖ్యమైన విషయాలను తెలియజేసే వస్తువు లనేకంగా బయటపడినవి. సంస్కృత-పారసీ భాషాగ్రంథాలను సంపాదించుతూ విరివిగా పర్యటించిన జార్జ్ బెహ్లర్ (క్రీ. శ. 1875) అనే ఆయన కల్హణుని రాజతరంగిణిలోనూ, ఇతర చారిత్రిక గ్రంథాలలోనూ ప్రస్తావించబడిన అనేక ప్రదేశాలను నిరూపించగల సాక్ష్యాధారాలను కనుగొన్నాడు. కాశ్మీరుయొక్క చారిత్రిక-భౌగోళిక విషయాలకు విశేష ప్రాధాన్యమిస్తూ, రాజతరంగిణిని సమగ్రంగా, విమర్శనాత్మకంగా అధ్యయనం చేయటానికి ఉపయోగపడే మార్గదర్శక సూత్రాలను ఆయన రూపొందించినాడు.

పురావస్తు పరిశోధనల ద్వారా తెలియవచ్చిన అనేకాంశాలు రాజతరంగిణిలో చెప్పబడిన అనేక విషయాలను నిర్ధారిస్తూ కాశ్మీరు చరిత్రను మరింత ప్రకాశింపజేస్తున్నవి. ప్రాచీన కాలానికి చెందిన బంగారం, వెండి, రాగి, ఇత్తడి నాణాలు కాశ్మీరులోనూ, ఇతర ప్రాంతాలలోనూ చాలా లభించినవి. అవన్ని కాశ్మీరు చరిత్ర పరిశోధనను విస్తరింప జేస్తున్నవి. జార్జి

1. ది వ్యాలీ ఆఫ్ కాశ్మీర్.

కన్నింగ్‌హామ్ సంపాదించిన అనేక నాణాలు రాజతరంగిణిలోని కాలక్రమ రీతిని పూర్తిగా సమర్థిస్తున్నవి. ప్రాచీన నాణాల పరిశోధనా ఫలితాలను ఆయన ఒక వ్యాసంలో[1] వెల్లడించినాడు. నాణాలను తయారుచేయటంలోని శాస్త్రీయ ప్రాధాన్యాన్ని, కల్హణుడు, తదితరులు వ్రాసిన చరిత్రగ్రంథాలను విలువ కట్టటంలో వాటిని ఉపయోగించవలసిన అవసరాన్ని ఆ వ్యాసం నిరూపిస్తున్నది.

కాశ్మీరు, దానిని చుట్టుకొని ఉన్న ప్రాంతాలలోని జాతుల, తెగలను గూర్చిన పరిశోధన రాజతరంగిణి వలన చాలా ఫలవంతమవుతున్నది. కిషన్ గంగ లోయ ప్రాంతానికి పై అంచులలో – ప్రసిద్ధమైన శారదాపీఠం ఉన్న ప్రాంతాలు నాటివలె నేటికీ దరదులకు నివాసభూములు. కాశ్మీరీయులకు ఉత్తరప్రాంతీయులుగా దరదులను కల్హణుడు ఎన్నోమార్లు ప్రస్తావించినాడు. "ఉత్తరప్రాంతాని కింకా చివరలోని మ్లేచ్ఛులు" అని కల్హణుడు ప్రస్తావించిన వారుకూడా దరదులే అయిఉంటారు. వారిలో పలువురు తనకాలంలో ముస్లింలుగా మారి ఉండటంవల్ల కల్హణుడు వారిని ఆవిధంగా పేర్కొని ఉంటాడనిపిస్తుంది. దక్షిణం, పడమర పరిసరప్రాంతాలలో 'ఖాసా'వారున్నారు. వారు రాజపురి, పూంఛ్ మొదలైన భాగాలను పరిపాలించినవారు. పదకొండవ శతాబ్దంలో 'ఖాసాలు' ఈ లోయను హస్తగతం చేసుకున్నారు. ఉత్తరాన ముజఫరాబాదు వరకు డోంబులు వ్యాపించి ఉన్నారు. భవుట్టులు (ఆధునికంగా లడక్, దాని సమీప మండలాలలో వీరున్నారు. వీరికి 'ఖాటియాలు' అని ప్రస్తుత వ్యవహారం) ఈ లోయప్రాంతపు వాయవ్య - తూర్పు భాగాలలో వ్యాపించి ఉన్నారు. ఈవిధమైన అనేక వాస్తవికాంశాలు రాజతరంగిణివల్ల తెలియవస్తున్నవి. కాశ్మీరు, ఇంకా ఉత్తరప్రాంతాలలోని ప్రజలకు సంబంధించి సమగ్ర పరిశోధన జరిగినప్పుడు రాజతరంగిణి తెలిపే విషయాలు ఎంతో ఉపయోగకరమైనవిగా నిరూపితం కాగలవు.

---

1. న్యూమిస్మాటిక్ క్రానికల్, క్రీ.శ. 1846.

# ఉపయుక్త గ్రంథ సూచి


అబుల్ ఫజల్ : 'అయిన్ - ఇ - అక్బరీ' — హెచ్. ఎస్. జారెట్ అనువాదం. బిబ్లియోథికా ఇండికా సీరీస్ ఆఫ్ ది ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్; అన్నాట్ అనువాదం., జె.ఎన్.సర్కార్, ఏషియాటిక్ సొసైటి, కలకత్తా, 1949.

కౌల్, మహమ్మద్ అజిమ్ : 'వాఖ్యాత్ - ఏ - కాశ్మీర్' (కాశ్మీరు సమాచారం), శ్రీనగర్.

కౌల్, ఎస్. : సంపాదన. 'జైన - రాజతరంగిణి', హోషియార్‌పూర్, 1966.

జాడూ, జగధర్ & కంజిలాల్ సంపాదన : నీలమత పురాణం' శ్రీనగర్, 1928.

జోన్స్, సర్ విలియమ్ : 'ఏషియాటిక్ రీసర్చెస్' కలకత్తా; 1826 సంపుటం—V

దత్త, జె. సి. : 'కింగ్స్ ఆఫ్ కాశ్మీర' (కాశ్మీర రాజులు)-III జోనరాజు, శ్రీవరుడు, శుకుడు రచించిన 'రాజతరంగిణు'ల అనువాదం. కలకత్తా, 1898.

పండిత్, ఆర్. ఎస్. : కల్హణుని 'రాజతరంగిణి' అనువాదం, పునర్ముద్రణ. సాహిత్య అకాదెమి, 1977.

పర్మ్మ, ఆర్. కె. : 'హిస్టరీ ఆఫ్ ముస్లిం రూల్ ఇన్ కాశ్మీర్' (కాశ్మీరులో మహమ్మదీయ పరిపాలనా చరిత్ర), కొత్తఢిల్లీ, 1969.

పీటర్‌సన్, పి. : జోనరాజు రచించిన 'ద్వితీయ రాజతరంగిణి' అనువాదం; బొంబాయి, 1896.

బామ్ జై, పి. ఎన్. కె. : 'ఏ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్' (కాశ్మీరు చరిత్ర); మెట్రోపాలిటన్ బుక్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్, ఢిల్లీ, 1962.

బుహ్లర్, జి. : 'విక్రమాంక దేవ చరిత్ర' అనువాదం, బొంబాయి, 1875.

మజూమ్‌దార్, ఆర్. సి. : 'ఏన్షియంట్ ఇండియా' (ప్రాచీన భారత దేశం), బనారస్; 1956.

,, ,, 'ది వేదిక్ ఏజ్' (వైదిక యుగం), లండన్, 1950.

రాలిన్సన్, హెచ్. జి. : 'ఇండియా' (భారతదేశం), లండన్, 1937.

రే, ఎస్. సి. : 'ఎర్లీ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ కాశ్మీర్' (ప్రాచీన కాశ్మీరు చరిత్ర : సంస్కృతి), కొత్త ఢిల్లీ, 1969.

లారెన్స్, వాల్టర్ : 'ది వ్యాలీ ఆఫ్ కాశ్మీర్' (కాశ్మీరు లోయ) లండన్, 1895.

విల్సన్, హెచ్ . హెచ్. : 'ఎన్ ఎస్సే ఆన్ ది హిందూ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్' (కాశ్మీరు హిందూ రాజ చరిత్రపై ఒక వ్యాసం), ఏషియాటిక్ సొసైటి నిర్వహణ. 'ఏషియాటిక్ రీసెర్చెస్' – 15 వ సంపుటం, కలకత్తా, 1825.

సక్సేనా, కె. ఎస్. : 'పొలిటికల్ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్' (కాశ్మీరు రాజకీయ చరిత్ర), ది అప్పర్ ఇండియా పబ్లిషింగ్ హౌస్ ప్రైవేట్ లిమిటెడ్, లక్నో,1974.

సూఫి, జి. ఎమ్. డి. : 'కాశ్మీర్'; పునర్ముద్రితం, లైట్ అండ్ లైఫ్ పబ్లిషర్స్, కొత్తఢిల్లీ, 1974.

స్టెయిన్, ఎం. ఏ. : 'కల్హణుని రాజతరంగిణి' అనువాదం, పునర్ముద్రితం, మోతీలాల్ బనారసీదాస్, ఢిల్లీ; వారణాసి; 1961.

" " 'నోట్స్ ఆన్ ఔ-కాంగ్స్ అకౌంట్స్ ఆఫ్ కాశ్మీర్. (కాశ్మీర్‌ను గూర్చి ఔ-కాంగ్ వ్రాతలపై వ్యాఖ్యలు), వైన్ (Wien), 1896.

(గమనిక : 'అనువాదం' – ఆయా గ్రంథాలకు ఆంగ్లంలోకి పరివర్తనం)